ఎన్. ఎస్. కృశ్చేవ్

# సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమం గురించి

సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ 22వ మహాసభలో చదివిన నివేదిక

అక్టోబరు 18, 1961



సోవియట్ భూమి అనుబంధం
సంచిక 1, జనవరి 1962.

ఈ ప్రచురణలోని పాఠం సోవియట్ నొవొస్తి
సమాచార శాఖచే సిద్ధపరచబడిన అనువాద
పాఠాన్ని అనుసరించి వున్నది.

వెల : 30 నయా పైసలు

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచార శాఖ,
25, బారాకంబా రోడ్, న్యూఢిల్లీచే ప్రచురితం; పంజాబీ ప్రెస్,
సదర్ బజార్, ఢిల్లీ-6 చే ముద్రితం

# విషయసూచిక

సోవియట్ భూమి అనుబంధం, సంచిక 1, జనవరి 1962

పుట

# కామ్రేడ్స్

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ నూతన కార్యక్రమాన్ని తయారు చేయవలసిందిగా కేంద్ర కమిటీని పార్టీ 20వ మహాసభ ఆదేశించింది. కేంద్ర కమిటీ ఆ పని నిర్వర్తించింది; ఈ కార్యక్రమం ముసాయిదాను పార్టీ, ప్రజలూ చర్చించిన అనంతరం. మహాసభ పరిశీలనకై సమర్పిస్తున్నది.

కమ్యూనిస్టు వ్యవస్థ నిర్మాతల మహాసభగా, మానవ చరిత్రలో ప్రథమ కమ్యూనిస్టు సమాజ నిర్మాణాని కవసరమయిన మహత్తర కార్యక్రమాన్ని చర్చించి ఆమోదించిన మహాసభగా, చరిత్రలో యీ మన మహాసభ వన్నెకెక్కుతుంది.

మానవాళి సృజించిన మహా ప్రతిభాధురీణులూ, కార్మిక వర్గ మహానాయకులూ అయిన మార్క్స్, ఎంగెల్స్, లెనిన్‌లకు మన మహాసభ వేదిక నుండి ప్రేమ విశ్వాసాలతో మొట్టమొదట నివాళులు సమర్పించవలసివున్నది. సోషలిజం అనివార్యమని మార్క్స్, ఎంగెల్స్ శాస్త్రీయ దృష్టితో జోస్యం చెప్పారు. సోషలిజం నిర్మించేందుకు లెనిన్ పథకం తయారు చేశారు. ఆ సోషలిజం సోవియట్ యూనియన్‌లో వాస్తవ రూపం ధరించింది. మన దేశమీనాడు నూతన శిఖరాగ్రాలను—కమ్యూనిజం శిఖరాగ్రాలను అందుకొనేందుకు సాగిపోతున్నది.

కార్మిక వర్గమూ, దాని కమ్యూనిస్టు పార్టీ తమ పోరాటంలో మూడు చారిత్రక దశలను అధిగమిస్తాయి. ప్రపంచాన్ని ప్రభావితం చేసే ఈ మూడు దశలు యివి: దోపిడీదారుల పాలనను కూలదోసి శ్రామిక వర్గ నియంతృత్వం స్థాపించడం, సోషలిజం నిర్మించడం, కమ్యూనిస్టు సమాజాన్ని రూపొందించడం.

మన పార్టీ, ప్రజలూ మొదటి రెండు దశలను పూర్తిచేశారు. పార్టీ కొక నిజమైన దిక్సూచి వుండడమే అది యీ రెండు దశలలోనూ అది తప్పక విజయం సాధించడానికి చాలవరకూ కారణం. మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాలనే దృఢమైన పునాదులపై నిర్మింపబడిన విప్లవాత్మకమైన పార్టీ కార్యక్రమాలే యీ దిక్సూచి.

మొదటి రెండు కార్యక్రమాలను తయారుచేయడంలో వ్లాదిమిర్ ఇల్యిచ్ లెనిన్ సాక్షాత్తు పాల్గొన్నారు, దర్శకత్వం వహించారు. తృతీయ కార్యక్రమాన్ని రూపొందించటంలో మనము సదా లెనిన్ సలహాలు అభిలషించాము; ఆ ప్రతిభాశాలి దీర్ఘదృష్టి, సోషలిస్టు, కమ్యూనిస్టు వ్యవస్థల నిర్మాణంపై ఆయన ఉజ్వల భావాలూ మనకు మార్గదర్శకము లయ్యాయి. కాబట్టే ఈ కార్యక్రమం కూడా లెనినిస్టు కార్యక్రమమని చెప్పడం సహేతుకమే.

20వ శతాబ్దం అద్భుతమైన కమ్యూనిస్టు విజయాల శతాబ్దం. ఈ శతాబ్ది పూర్వార్ధంలో, సోషలిజం మానవ లోకంలో సుస్థిరంగా నెలకొన్నది. ఉత్తరార్థంలో కమ్యూనిజం కూడా సుస్థాపితం కాగలదు. పార్టీ నూతన కార్యక్రమమే ఇందుకు మార్గం చూపుతున్నది. ఈ కార్యక్రమం ఆధునిక యుగపు కమ్యూనిస్టు ప్రణాలిక అని పేర్కొనబడడం సక్రమమే.

ఈ ముసాయిదా కార్యక్రమం పార్టీ సమిష్టి చింతన ఫలితం. "ఇది మన కార్యక్రమం; మన ఆశలకు ఆశయాలకు ఇది అనుగుణంగా వుంది" అని సోవియట్ ప్రజంతా అంటారు.

ఈ ప్రణాలికలోని భావాలు మానవాళి చిరకాల స్వప్నాలను వ్యక్తం చేస్తున్నాయి. ముసాయిదాను సోదర పార్టీలు హృదయపూర్వకంగా ఆమోదించాయి. ప్రపంచమంతటా శ్రామిక వర్గం, కార్మిక ప్రజలు మహోత్సాహంతో ఈ కార్యక్రమానికి స్వాగతం చెప్పారు. కమ్యూనిజం శక్తి ఎంతటిదో, మానవాళి భవిష్యత్తుకు మన కార్యక్రమమెంత ప్రధానమయినదో యిది నిరూపిస్తున్నది.

# I

# సోషలిజం సాధించిన చరిత్రాత్మక విజయాలు

## 1. లెనిన్ కార్యక్రమం వాస్తవం చెయ్యబడింది.

కామ్రేడ్స్, కమ్యూనిజం వైపుకు సాగుతున్న చరిత్రాత్మకమైన మహాప్రస్థానంలో, మన పార్టీ 1917 అక్టోబరులో ప్రథమంగా గొప్ప విజయం సాధించింది. దోపిడీదారుల పరిపాలనను కూల్చివేసి, శ్రామికవర్గ నియంతృత్వం నెలకొల్పబడ్డది. పార్టీ ద్వితీయ మహాసభ ఆమోదించిన కార్యక్రమం నెరవేరింది. మహోజ్వలమైన సోషలిస్టు పరివర్తనా పథంలో దేశం అడుగు పెట్టింది. అయితే అదివరకెవ్వరూ పరిశోధించి చూడని పథమిది.

భయమన్నది ఎరుగని నాయకుడూ, మన కందరికి ప్రియతముడూ అయిన లెనిన్ సోవియట్ నౌక చుక్కాని చేబట్టారు. సోషలిస్టు వ్యవస్థా నిర్మాణానికై ఆయన ఒక అద్భుతమైన ప్రణాలిక తయారు చేశారు. లెనిన్ రచించిన పార్టీ కార్యక్రమం, ఎనిమిదవ మహాసభలో ఆమోదింపబడింది. ఇది సాహసంతో, శాస్త్రీయ దృక్పథంతో భవిష్యత్తును గూర్చి చెప్పిన జోస్యం, నూతన సమాజ నిర్మాణానికవసరమయిన ఒక విస్పష్ట ప్రణాలిక, ప్రజానీకానికి ఆవేశంతో చేసిన ఒక విప్లవాత్మకమైన విజ్ఞప్తి. సోషలిస్టు వ్యవస్థను నిర్మించడానికి అవసరమయినదంతా మనకున్నదనే అంశాన్ని ఆధారంగా చేసుకొని, పార్టీ ముందుకు సాగింది. నూతన వ్యవస్థలోని విప్లవాత్మకమైన శక్తులపైన, శ్రామిక ప్రజల ధైర్యసాహసాలపైన పార్టీ అచంచల విశ్వాసముంచింది.

నూతన వ్యవస్థ నిర్మాణంలో ఆనాడున్న కష్టాలు అపారమయినవి. విశాలమయిన మన దేశమంతటా యుద్ధం సాగుతూ వుండేది. మానవాళి సోషలిస్టు మార్గాన్ని చేపట్టకుండా ఆదిలోనే నిరోధించాలనే ప్రయత్నంలో, అంతర్జాతీయ రంగంలోని అభివృద్ధి నిరోధక శక్తులూ, దేశంలోని విప్లవ ప్రతీఘాత శక్తులూ ఏకమై, సోవియట్ రిపబ్లిక్‌పై విరుచుకొని పడ్డాయి.

అదివరకే రష్యా జాతీయ ఆర్థిక వ్యవస్థ ముఖ్యమైన పెట్టుబడిదారీ దేశాల ఆర్థిక వ్యవస్థకన్నా 50 నుండి 100 సంవత్సరాలవరకు వెనుకబడి వుండినది. దీనికితోడు, సామ్రాజ్యవాద యుద్ధమూ, మన ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం కలిగించుకొన్న విదేశీయుల దండయాత్రా రష్యా జాతీయ ఆర్థిక వ్యవస్థను ఛిన్నాభిన్నం చేశాయి. 1919లో దేశంలోని పారిశ్రామిక ఉత్పత్తి 1913లో కన్న అయిదు రెట్లు తక్కువ. వ్యవసాయం చాలా క్షీణదశలో వుండినది.

సోషలిస్టు పంథా ననుసరించి ప్రజా జీవితాన్ని మలచడంలో మనకానాడు అనుభవం లేదు. చరిత్రలో మనం కొత్త పుంతలు తొక్కవలసిన అవసరమేర్పడింది. ఈ కారణాలవల్ల కూడ మన కష్టాలు ఇనుమడించాయి. బయటినుండి ఏ విధమైన భౌతిక, సాంకేతిక సహాయం పొందే అవకాశం సోవియట్ ప్రజలకు లేదు. దేశం పెట్టుబడిదారీ దేశాల శత్రు వలయంలో చిక్కి వుండేది. శత్రువుల ముట్టడికి తట్టుకొంటూ దేశం మనవలసి వచ్చింది.

అపారమైన ఈ కష్టాలన్నింటినీ అధిగమించి, నూతన జీవిత నిర్మాణానికి మార్గం సుగమం చేసేందుకై పార్టీ, ప్రజలు నిజంగా బ్రహ్మాండమైన కృషికి పూనుకోవలసిన అవసరమేర్పడింది.

కమ్యూనిస్టులమయిన మనం ఏదైనా ధ్వంసం చేయడానికే తప్ప, నిర్మించడానికీ, సృష్టించడానికీ శక్తి లేని వారమని మన శత్రువులు అనే వారు. ప్రజలు ద్వేషించే దోపిడీ విధానాన్ని మనం నిర్మూలించిన మాట నిజం. అయితే పెట్టుబడిదారీ విధానమనే అసహ్యాకరమయిన పెంటకుప్పను

తొలగించి, ఆ స్థలంలో న్యాయాతి న్యాయమైన ఒక నూతన సాంఘిక వ్యవస్థ, కమ్యూనిజంను నిర్మించాలనే ఉద్దేశంతో అలా చేశాము. కమ్యూనిస్టులు ఉత్తమోత్తమమయిన సృజనాత్మక శక్తిగా, ప్రపంచాన్ని మారుస్తూ, నిత్యనూతనం చేసే శక్తిగా చరిత్రలో అడుగుపెట్టారు.

కమ్యూనిస్టులు అతి నిశ్చలులైన దేశభక్తులనీ, మాతృ దేశంయొక్క నిజమైన పుత్రులనీ, తమ దేశ ప్రయోజనాలకోసం అత్యంత ధైర్యంగా పోరాడేవారనీ చరిత్ర ధృవపరిచింది. మన దేశాన్ని జాతీయ విపత్తునుండి రక్షించింది బోల్షివిక్కులమయిన మనమే; విదేశ సామ్రాజ్య వాదులు మన దేశాన్ని దాస్య శృంఖలాలలో బంధించకుండా కాపాడింది, దాన్ని ప్రపంచ ప్రజల దృష్టిలో ఒక మహాదేశంగా చేసింది బోల్షివిక్కుల మయినమనమే.

రష్యాలో సోషలిజం నిర్మించడానికి తయారు చేసిన ప్రణాళికను బూర్జువా పార్టీలు, రాజకీయవేత్తలు, సిద్ధాంతవేత్తలు తృణీకారంతో అవహేళన చేశారు; దానిపైని విపరీతమైన ద్వేషం వెళ్ళగక్కారు. "బోల్షివిక్కుల ప్రయోగం" విఫలంకాక తప్పదని వారంతా ఒకే పాట పాడారు. రష్యాలో మానవ జీవిత ధర్మాలన్నీ సంపూర్తిగా నశిస్తాయనీ; సోషలిస్టు, కమ్యూనిస్టు సిద్ధాంతాలు పూర్తిగా విఫలంకాక తప్పదనీ చర్చిల్ జోస్యం చెప్పారు.

"విఫలులైన వారెవరు?" అని మనమీనాడు చర్చిల్‌ను అడగవచ్చు. ప్రపంచంలోని ముఖ్య దేశాలలో ఆర్థికంగా అట్టడుగున వుండిన మన దేశం, నేడు ప్రపంచంలోని పారిశ్రామిక దేశాల్లో ద్వితీయ స్థానమాక్రమిస్తున్నది; చారిత్రక పురోగతిలో అన్నిటికన్నా ముందున్నది. ఒకప్పుడు ప్రపంచంలో ప్రథమ స్థానమలంకరించిన గ్రేట్ బ్రిటన్, యీ మధ్యకాలంలో దాని స్థానం కోల్పోయింది. మళ్ళీ అది ఆ స్థానానికి వచ్చే అవకాశం లేదు. సోషలిస్టు భావాలు ఎంతటి మార్పు తీసుకొని రాగలవో, సామ్రాజ్యవాద భావాలు ఎలా నిష్ఫలమయ్యాయో కళ్ళకు కట్టినట్టు యిది నిరూపిస్తున్నది.

రష్యాలో సోషలిజం నిర్మించడం అసాధ్యమని నిరూపించడానికి

రెండవ ఇంటర్ నేషనల్ నాయకులు కూడ ప్రయత్నించారు. "పెట్టుబడి దారీ విధానాన్ని సమూలంగా నాశనం చేయడమనేది అసాధ్యం...పెట్టుబడి దారీ విధానం మళ్ళీ పుంజుకొంటుంది; పుంజుకొని తీరాలి; బహుశా అదీ త్వరలోనే జరుగుతుంది." ఇదీ మన దేశాన్ని గురించి కార్ల్ కాట్స్కీ చెప్పిన జోస్యం. బోల్షివిక్ పార్టీ తన కార్యక్రమాన్ని అమలు జరపలేదని అతను ఖండితంగా చెప్పాడు. మెన్షివిక్కులూ, మితవాద సోషలిస్టు-రెవా ల్యూషనరీలూ, కాట్స్కీ పాడిన పాటే పాడారు. "పరిశ్రమలు సర్వ నాశనమై, రవాణా యంత్రాంగం విచ్ఛిన్నమై, ఆర్థికంగా వెనుకబడి వున్న దేశాన్ని సోషలిస్టు ప్రాతిపదికపై పెట్టడానికి చేసే ప్రయత్నాలవల్ల జాతీయ ఆర్థిక వ్యవస్థ ధ్వంసం కావడమూ, దేశం కల్లోలంలో అరాచకంలో మునిగి పోవడమూ తప్ప, పెద్దగా జరిగేదేమీ లేదు" అని మితవాద సోషలిస్టు-రెవొల్యూషనరీ పార్టీ కేంద్ర కమిటీ రయాటు చేసిన ఒకానొక పత్రంలో వుంది.

బూటకపు, సోషల్-డెమొక్రటిక్ బూటకపు ప్రవక్తలు సత్యాన్ని దాటి చాలా దూరం వెళ్ళారు. మితవాద సోషలిస్టు నాయకుల్లో ఈషణ్మాత్ర మైనా నిజాయితీ వుండినట్లయితే, బోల్షివిక్కులు చెప్పినదే సరియైనదని వారు అంగీకరించి వుండేవారు. ప్రజలను ఏ గమ్యం వైపుకు తీసుకొని పోవాలో ఎరిగిన పార్టీ కమ్యూనిస్టు పార్టీ ఒక్కటే అని తేలింది. అది ఎన్నో కష్టాలను అధిగమించి, ట్రాట్స్కీ అనుయాయులనూ, మితవాద అవకాశ వాదులనూ, జాతీయ దురభిమానంచే పెడదారి తొక్కినవారినీ, తదితర నిరాశావాదులనూ ప్రక్కకు నెట్టివేసింది. తన ప్రణాళికలను జయప్రదంగా అమలు జరిపి, వాటికి వాస్తవ స్వరూపమిచ్చింది. తన మాటలకు చేతలకు ఏ మాత్రమూ తేడా లేదని నిరూపించింది.

పార్టీ, ప్రజలూ సాగించిన కార్యకలాపాలవల్ల కలిగిన ముఖ్యమైన ఫలితమేమంటే సోవియట్ యూనియన్‌లో సోషలిజం తిరుగులేని సంపూర్ణ విజయం సాధించడం. ప్రపంచమంతటా చరిత్రాత్మకమైన

ప్రభావాన్ని ప్రసరింపజేసే ఒక మహత్తర కార్యం సాధించబడింది. సోష లిస్టు వ్యవస్థను స్థాపించి, దానిని అభివృద్ధి చేసే విషయంపై మానవాళికొక శాస్త్రం లభించింది. ఇది ఆచరణలో పరీక్షింపబడిన శాస్త్రం. అందువల్ల ఇప్పుడు, ఇతర దేశాల ప్రజలు సోషలిజం వైపుకు పురోగమించడం మరింత సులభం.

సోషలిస్టు రాజ్యాంగ యంత్రం ఒక కొత్తరకమైన రాజ్యాంగ యంత్రం. సోషలిస్టు ప్రజాస్వామ్యం అత్యున్నత స్థాయికి చెందిన ప్రజా స్వామ్యం. అటువంటి సోషలిస్టు రాజ్యాంగ యంత్రాన్ని సోషలిస్టు ప్రజా స్వామ్యాన్ని నెలకొల్పడం, వాటిని పటిష్ఠం చేయడం, మనపార్టీ, ప్రజలూ రాజకీయ రంగంలో సాధించిన ప్రధాన విజయం. సోవియట్ యూని యన్ నిజమైన ప్రజాపాలన, స్వేచ్ఛ, సమానతలున్న దేశం.

ఆర్థిక రంగంలో చరిత్రాత్మకమైన మన ముఖ్య విజయాలివి: ఉత్పత్తి సాధనాలపై సామాజిక యాజమాన్యాన్ని నెలకొల్పడం; వివిధ వర్గాల మధ్య, జాతుల మధ్య తీవ్ర సంఘర్షణలకు దారితీసే వ్యక్తి యాజ మాన్యాన్ని రద్దుచేయడం. వేల సంవత్సరాలుగా కొనసాగుతూవున్న వ్యక్తి గత ఆస్తి వ్యవస్థ శాశ్వతమయినదనీ, పవిత్రమయినదనీ బూర్జువా వర్గం చాటింది. కమ్యూనిస్టులమయిన మనం ఈ సిద్ధాంతాన్ని ధైర్యంగా చెల్ల తీశాము. సోషలిజం సామాజిక యజమాన్య యుగాన్ని ప్రవేశపెట్టింది: ఉత్పత్తి రంగంలో అరాచకానికీ, ఆర్థిక సంక్షోభాలకూ, ఇతర సాంఘిక కల్లోలాలకూ స్వస్తి చెప్పింది.

ఆశ్చర్యం కలిగేలా అనతికాలంలోనే మనం బలీయమైన పరిశ్రమలను నెలకొల్పాము. ఇవే సోషలిస్టు వ్యవస్థకు భౌతిక ప్రాతిపదిక; మన దేశ శక్తి సంపదకు పునాది. రైతాంగం సోషలిస్టు ప్రాతిపదికను చేపట్టేలా వారికి సహాయ పడటం, అధికారం హస్తగతం చేసుకోవటం మనేదాని తరు వాత అత్యంత క్లిష్టమైన పని. లెనిన్ యొక్క సహకార పథకంతో దీనిని పార్టీ పరిష్కరించింది. రైతుల సహకారం మానవాళి సాంఘిక-ఆర్థిక చరి

త్రలో ఒక ముఖ్యమైన పరిణామం.

మన దేశాన్ని ఒకసారి మీ మనో నేత్రంతో తిలకించండి, గత కాలంతో పోల్చిచూడండి. మన దేశ స్వరూపం ఎంత అద్భుతావహంగా మారిపోయిందో, ఇన్నాళ్లూ మనమెంత మహత్తరమైన మార్గంలో పయనించామో మీకు అర్థమవుతుంది.

రష్యా గడ్డపార, తోపుడు బండీ, కర్రనాగలీ, రాట్నాల దేశమని అందరూ అనుకొనేవారు. ఆనాడు మన దేశంలో వున్న యంత్రాలు అమెరికాలోని యంత్రాల కన్న పది రెట్లూ, జర్మనీలో వున్న యంత్రాల కన్న అయిదు రెట్లూ తక్కువ. ఈ నాడు సోవియట్ యూనియన్ సాంకేతిక రంగంలో బాగా పురోగమించిన దేశం; మహా శక్తివంతమైన యంత్ర పరికరాలూ, ఎంతో సున్నితమైనయంత్రాలూ, స్వయంచలిత శ్రేణులూ, ఎలెక్ట్రానిక్ కంప్యూటర్లూ, అంతరిక్ష నౌకలూ గల దేశం. 1961 లో మన యంత్ర నిర్మాణ పరిశ్రమలోనూ, లోహ పరిశ్రమలోనూ మొత్తం ఉత్పత్తి 1913లో కన్న 350 రెట్లూ, 1919లో కన్న ఇంచుమించు వేయి రెట్లూ ఎక్కువ.

రష్యా కేవలం కలపా, గడ్డీ, చెట్టు బెరడుల దేశమనే అభిప్రాయముండేది. దానికి నిజంగా లోహం కరవుగా వుండేది. ఈ నాడు సోవియట్ యూనియన్ ఉక్కు, అల్యూమినియం, సిమెంటు, ప్లాస్టిక్కు విస్తారంగా వున్న దేశం. బ్రిటన్, పశ్చిమ జర్మనీ, ఫ్రాన్స్—యీ మూడు దేశాలూ కలసి ఎంత ఉక్కు ఉత్పత్తి చేస్తాయో సుమారుగా అంత ఉక్కు మనం ఉత్పత్తి చేస్తున్నాము.

పారాఫిన్ దీపాలూ, కొవ్వొత్తుల దేశమని ఒకప్పుడు రష్యాకు పేరు. సోవియట్ల ఎనిమిదవ మహాసభ ప్రతినిధులు 'గొయల్‌రో' విద్యుదీకరణ పథకాన్ని గూర్చి చర్చలు జరిపినప్పుడు, మహాసభ జరుగుతున్న భవనంలోని దీపాలకు తగినంత విద్యుచ్ఛక్తి సరఫరా చేయడమే గగనమయింది. ఆనాడు మాస్కోలో విద్యుదుత్పత్తి పరిస్థితి అట్టిది. నేడు ప్రపంచంలోకల్లా శక్తి

వంతమయిన విద్యుదుత్పాదక కేంద్రాలు సోవియట్ యూనియన్‌లో ఉన్నాయి.

మనం 30 వేల కోట్ల కిలోవాట్ల గంటల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేస్తున్నాము. 1961లో మనం ఉత్పత్తి చేసే విద్యుచ్ఛక్తి 1913లో కన్న 160 రెట్లూ, 1919లో కన్నా 650 రెట్లూ ఎక్కువ.

మన దేశంలో సోషలిస్టు నిర్మాణం ప్రారంభమయిన రోజుల్లో లెనిన్, మన దేశాన్ని ఎదుర్కొంటున్న బృహత్తర కర్తవ్యాలను గూర్చి మాట్లాడుతూ, నెక్రసావ్ గేయంలోని ప్రసిద్ధ చరణాలను ఉటంకించారు. తన దేశాన్ని చూచి కవికి కలిగిన హృదయావేదన, తన దేశ శక్తిపై అతనికి గల అచంచల విశ్వాసం ఈ చరణాలు వ్యక్తంచేస్తున్నాయి:

నిర్భాగ్యురాలవు. సకల సంపత్సమేతవు!
మహాశక్తివి. ఏదీ చేతగానిదానవు!
తల్లి రష్యా!

"నూరు ఆరయినా, ఆరు నూరయినా, రష్యా నిర్భాగ్యంగానూ, ఏదీ చేతగాని దేశంగానూ వుండే పరిస్థితి అంతం కావాలనీ, రష్యా అక్షరాలా శక్తివంతమైన సకల సంపత్సమేతమైన దేశం అయ్యేటట్టు సాధించి" తీరుతామని బోల్షివిక్కులు పూనిన దృఢదీక్షను లెనిన్ ప్రకటించారు.* ఇది మనం సాధించాము!

ఇక సాంఘిక రంగంలో, ప్రజల చిరకాల వాంఛలు పార్టీ కృషివల్ల ఫలించాయి. మానవుణ్ని తోడి మానవుడు ఏయే రూపాల్లో దోచుకొంటాడో, ఆ దోపిడీ రూపాలన్నీ పటాపంచలయ్యాయి. దోపిడీ వర్గాలు రద్దయ్యాయి. కార్మికవర్గం సమాజానికి మార్గదర్శకమయిన శక్తిగా రూపొందింది. రైతాంగం సోషలిస్టు ఆర్థిక సూత్రాలను స్వీకరించింది. సకల సోవియట్ ప్రజలలోనూ సోషలిస్టు ఐక్యత నెలకొన్నది. పురుషులకేయే హక్కు-

* వి. ఐ. లెనిన్, రచనల సంకలనం, 4వ రష్యన్ ముద్రణ, 27వ సంపుటి 134వ పేజి.

లున్నాయో అవన్నీ స్త్రీలకూ లభించాయి. సంఘ శ్రేయస్సుకోసం ఏ సృజనాత్మకమైన వృత్తినైనా స్త్రీలు నేడు చేపట్టవచ్చు.

సైద్ధాంతిక రంగంలో ఒక పెద్ద విప్లవం వచ్చింది. దీని ప్రభావమూ, ఫలితాలూ వస్తువులోనూ, సాంఘిక ప్రాముఖ్యంలోనూ అసల్పమైనవి. దీని ప్రాముఖ్యమూ ఫలితాలు గొప్పవి. జ్ఞానమూ, శాస్త్రమూ అనే కరదీపికను కమ్యూనిస్టులు చేబూని పైకెత్తారు. సాంస్కృతిక రంగంలో వచ్చిన విప్లవం వల్ల నిరక్షరాస్యత నిర్మూలింపబడింది. సాంస్కృతిక, శాస్త్రీయ రంగాలలో మానవుడు సాధించిన విజయాలు కోటానుకోట్ల ప్రజల సొత్తు అయింది. ప్రజల మేధావి వర్గమొకటి రూపొందింది. ఇంజనీయర్లను తయారుచేయడంలో మనమేనాటినుండో ప్రపంచంలో అగ్రస్థానమలంకరిస్తున్నాము.

భవిష్యత్తులో విశ్వజనీన సంస్కృతిని పోలిన సోషలిస్టు సంస్కృతి అవతరించింది. మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతం సోవియట్ సమాజ సిద్ధాంతమయింది. వ్యక్తిగత యాజమాన్య వ్యవస్థ మూలంగా వ్యాపించిన మానవ ద్వేష భావాలు కాలగర్భంలో కలిసిపోయాయి. సోవియట్ ప్రజల జీవితంలోనూ, పనిపాటల్లోనూ సమిష్టి జీవన సూత్రాలు జయించాయి.

వివిధ జాతుల మధ్య సంబంధాల సమస్యను పార్టీ పరిష్కరించింది. చాలా క్లిష్టమయిన ఈ సమస్య శతాబ్దాలుగా మానవులను వేధించింది, పెట్టుబడి దారీ ప్రపంచంలో ఈ సమస్య నేటికీ అలాగే వుంది. జారిస్టు రష్యా "వివిధ జాతుల చెరసాల" అని లోగడ పేరు మోసింది. నేడు, సోవియట్ యూనియన్ వివిధజాతులు అన్నదమ్ములవలె కలిసివుండే కుటుంబమనీ, వేరువేరు జాతులకు చెందిన ప్రజలు స్నేహంగా జీవిస్తూ అభివృద్ధిచెందుతూ వున్న దేశమని కీర్తికెక్కింది. పితృస్వామ్యపు తెగనుండి పెట్టుబడిదారీ దశవరకు గల వివిధ చారిత్రిక పరిణామ దశలలో వుండి, ఏలాటి హక్కులు లేని పీడిత జాతులన్నీ సోవియట్ వ్యవస్థ ద్వారా పునరుజ్జీవం పొందాయి; నవ జీవనంతో, సిరిసంపదలతో విలసిల్లుతున్నాయి. తమకన్నా ఎక్కువ

అభివృద్ధి చెందిన జాతుల సహాయంతో, ముఖ్యంగా రష్యా జాతికి చెందిన ప్రజల సహాయంతో, ఒకప్పుడు వెనుకబడివున్న జాతులు పెట్టుబడిదారీ పథాన్ని దాటవేసి, అభివృద్ధిచెందిన జాతుల స్థాయి నందుకొన్నాయి. ఒకే లక్షణాలు గల వివిధ జాతులకు చెందిన ఒక నూతన చారిత్రిక ప్రజానీకం—సోవియట్ ప్రజానీకం—సోవియట్ యూనియన్‌లో రూపొందింది. ఈ జాతులకన్నిటికి మాతృభూమి ఒకటే; సోషలిస్టు మాతృభూమి—సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల యూనియన్. వీటికి గల ఆర్థిక ప్రాతిపదిక ఒకటే—అది సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ. వీటి సాంఘిక వర్గ వ్యవస్థ ఒకటే. సిద్ధాంతమూ ఒకటే—అది మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతం. ధ్యేయమూ ఒకటే—అది కమ్యూనిస్టు వ్యవస్థ స్థాపన. ఆత్మిక స్థితి, మనఃప్రవృత్తిలో అనేక అంశాలతో ఈ జాతులకు సామ్యముంది.

ఈ బ్రహ్మాండమైన మార్పులవల్ల ప్రజల జీవన పరిస్థితులు బాగా మారిపోయాయి. జారిస్టు రష్యాలో కార్మికుడు తరచు రోజుకు 12-14 గంటలు బండచాకిరీ చేసేవాడు. అతనికి ముట్టే జీతమూ-ప్రాణాలు నిలబెట్టుకోవడానికి కూడ చాలేది కాదు. అనేక మంది కార్మికులు మురికిపేటల్లో నివసించేవారు. రైతులు భూమికోసం ఆజన్మాంతం తహతహలాడేవారు. రైతాంగంలో మూడింట ఒక భాగానికి భూమి దున్నుకొనేందుకు గుర్రమనేదే వుండేదికాదు. చేతికందిన పంటలో ఎక్కువభాగం పన్నులు, నజరానాలు మొదలగునవి చెల్లించడానికి సరిపొయ్యేవి. రైతుల్లో అత్యధిక సంఖ్యాకులకు కడుపునిండ తిండి వుండేది కాదు. ఏ పెద్ద పండగలో పబ్బాలో వస్తేనే రైతు మాంసం మొగం చూచేవాడు. పంచదార అతనికి అందని పండు. ఏటేటా వేలకొలది రైతులు చితికి నాశనమై, పట్టణాల్లో అసంఖ్యాకులుగా వున్న నిరుద్యోగుల్లో చేరిపోయేవారు.

సోషలిజంవల్ల ప్రజల జీవితం మారిపోయింది. శ్రామికునికి మహమ్మారివంటి నిరుద్యోగం ఏనాడో మటుమాయమయింది. నిరుద్యోగ నిర్మూలన, పని గంటల తగ్గింపుతో కార్మికుని యదార్థ వేతనాలు 480 శాతం పెరి

గాయి; రైతు యదార్థ ఆదాయం 500 శాతానికి మించే పెరిగింది. గ్యాసు. విద్యుచ్ఛక్తి. టెలివిజన్. రేడియో. రెఫ్రిజిరేటర్లు, పుస్తకాలు. వార్తాపత్రికలు గ్రామీణ ప్రజల నిత్యజీవితంలో భాగాలయ్యాయి. ప్రపంచంలోకల్లా మన దేశంలో ఇళ్ళ అద్దెలు తక్కువ. వస్తువులను పూర్తిగా రద్దుచేసే శాసనం వస్తోంది. మన దేశంలో మనిషి సగటు ఆయుఃప్రమాణం 69. సంవత్సరాలకు పెరగడం మన విజయాలకు చక్కని తార్కాణం. మానవుని సగటు ఆయుఃప్రమాణం సోషలిజంవల్ల రెట్టింపుకు పైబడింది. కమ్యూనిజంవల్ల మనిషి ఆయుస్సు ఇంకా పెరుగుతుంది. "మనం దీర్ఘకాలం జీవిస్తాం; కాని ముక్కాళ్ళ ముదుసలులం కాబోము" అని అన్న కవి కల నిజమవుతుంది.

సోషలిజం మూలాన, మానవుడు చరిత్రలో మొట్టమొదటిసారిగా, ప్రాథమిక సామాజిక హక్కులను పొందాడు. పని చేయడానికీ, విశ్రాంతికీ, వృద్ధాప్యంలోనూ, జబ్బు చేసినప్పుడూ, అశక్తుడైనప్పుడూ జీవన భద్రతకూ, విద్యకూ హక్కులివి. సోషలిజం మూలాన, తమ భవిష్యత్తులోనూ, తమ పిల్లల భవిష్యత్తులోనూ సోవియట్ ప్రజలకు అపారమైన విశ్వాసమూ, తమ భద్రతకు యేలాటి ముప్పు లేదనే భావమూ ఏర్పడింది; వారిని ఆశావాదులుగా తీర్చిదిద్దింది.

సోషలిస్టు వ్యవస్థ మహత్తర శక్తి దేశభక్తియుత మహా యుద్ధంలో విదితమయింది. అజేయమని అందరూ అనుకొన్న జర్మన్ ఫాసిస్టు మూకల్ని సోవియట్ ప్రజలు ఆ యుద్ధంలో పూర్తిగా ఓడించారు.

సోషలిజం విజయం పొందిన ఫలితంగా, సమాజ పరిణామ స్వభావంలో పెద్ద మార్పులు వచ్చాయి. భౌతికమైన సామాజిక పరిణామ సూత్రాలు వాటంతటవే అమలు జరుగుతూ వస్తూన్నందువల్ల, వేల సంవత్సరాలుగా ప్రజలు బాధపడ్డారు. ఈ సూత్రాలు అమలు జరగడంలో ప్రజలు నిమిత్తమాత్రులుగా వుంటూ వచ్చారు. సోషలిస్టు వ్యవస్థలో ప్రజలు యీ భౌతిక సూత్రాలను తెలుసుకోవడమేకాక, వాటికి అధినాథులయ్యారు.

దోపిడీదారులు కార్మికులనూ, రైతులనూ క్రియాశూన్యులయిన మూగజీవాలుగా చూచారు. ఇలాంటి కార్మికులు, రైతులు సోషలిస్టు పరిసరాలలో యెంత బ్రహ్మాండంగా అభివృద్ధి చెందగలరో నేడు వెల్లడి అయింది. వారి అద్భుతావహమయిన వీరోచిత కృత్యాలు, అనుపమానమయిన ధైర్యం, అపార బలసంపద బహిర్గతమయ్యాయి. సోవియట్ యూనియన్‌ను చూచి, సమస్త దేశాల శ్రామిక ప్రజలకు తమ శక్తిపై విశ్వాసం ఏర్పడింది.

సోషలిస్టు వ్యవస్థవల్ల మన దేశంలో కలిగిన మేలే, మానవాళి ఏ పంథా అనుసరించాలనే ప్రశ్నకు తిరుగులేని జవాబు. బూర్జువా పార్టీల, సోషల్-డెమొక్రటిక్ పార్టీల సకల పథకాల దివాళాకోరుతనాన్ని వాస్తవ విషయాలే రుజువు జేస్తున్నాయి. ఈ పార్టీలు తమ వాగ్దానాలను నిలబెట్టుకోలేకపోయ్యాయి. ఏ ప్రధాన సాంఘిక సమస్యనూ అవి పరిష్కరించలేదు; పరిష్కరింపజాలవు కూడ. మానవాళిని వేధిస్తున్న సాంఘిక సమస్యలను ఆచరణలో పరిష్కరించగలిగిన, తన కార్యక్రమపు కర్తవ్యాలను నిర్వర్తించగలిగిన సాంఘిక-రాజకీయ శక్తి ఒక్క కమ్యూనిస్టులే అనేది చరిత్ర నిరూపించింది.

## 2 ప్రపంచ పరిణామ ముఖ్య ఫలితాలు.

కాంగ్రేస్. సామ్రాజ్యవాదమూ, దాని వైరుధ్యాలూ వృద్ధిచెందినందువల్ల, "పెట్టుబడిదారీ విధానం పతనం కావడం, అత్యున్నతమైన సోషలిస్టు ఆర్థిక వ్యవస్థకు పరివర్తనం చెందడం అనివార్యం అయ్యింది" అని ఎనిమిదవ మహాసభ ఆమోదించిన మన పార్టీ కార్యక్రమం పేర్కొన్నది. ప్రపంచవ్యాప్త శ్రామిక కమ్యూనిస్టు విప్లవ యుగం ప్రారంభమయినదని ఈ కార్యక్రమం ఎలుగెత్తి చాటింది. మార్క్సిస్టు-లెనినిస్టులు ఊహించినట్లుగానే, తుచ తప్పకుండా తరువాత పరిణామాలన్నీ సాగాయి. 1919 నాటి ప్రపంచ రాజకీయ పటాన్నీ ఈనాటి ప్రపంచ రాజకీయ పటాన్నీ పోల్చి చూద్దాం.

| | 1919 | | | | 1961 | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | విస్తీర్ణం | | జనాభా | | విస్తీర్ణం | | జనాభా | |
| | మిలియన్ చదరపు కిలోమీటర్లు | శాతం | మిలియన్లు | శాతం | మిలియన్ చదరపు కిలో మీటర్లు | శాతం | మిలియన్లు | శాతం |
| I. ప్రపంచం ... | 135.4 | 100 | 1,777 | 100 | 135.4 | 100 | 3,017 | 100 |
| (1) సోషలిస్టు ప్రపంచం ... | 21.7 | 16.0 | 138.0 | 7.8 | 35.1 | 25.9 | 1,072 | 35.5 |
| (2) మిగతా ప్రపంచం ... | 113.7 | 84.0 | 1,639 | 92.2 | 100.3 | 74.1 | 1,945 | 64.5 |
| II. పెద్ద సామ్రాజ్యవాద దేశాలు (అమెరికా, బ్రిటన్, ఫెడరల్ జర్మన్ రిపబ్లిక్, ఫ్రాన్స్, జపాన్, ఇటలీ) వాటి వలస దేశాలు | 60.3 | 44.5 | 855 | 48.1 | 18.6 | 13.7 | 541.5 | 17.9 |
| III. అన్ని వలస, అర్ధ వలస దేశాలు, అధినివేశ ప్రతిపత్తి దేశాలు ... | 104.5 | 77.2 | 1,230 | 69.2 | 14.2 | 10.5 | 85.4 | 2.8 |
| IV. 1919 తరువాత స్వాతంత్ర్యం పొందిన వలస దేశాలు, అర్ధ వలస దేశాలు (సోషలిస్టు దేశాలను మినహాయించి) | ... | ... | ... | ... | 72.2 | 53.4 | 1,228 | 40.7 |

ఇలా పోల్చిచూచినప్పుడు ఏమి గోచరిస్తున్నది? ఆధునిక కాలం లోని మహత్తర విప్లవ శక్తులు ప్రపంచ స్వరూపాన్ని మార్చివేశాయి. ప్రపంచ ప్రజలలో అధిక సంఖ్యాకులపై సామ్రాజ్యవాదానికి గల పట్టు శాశ్వతంగా పోయింది. మానవుని పురోగమన రాజమార్గం సుస్థాపిత మయింది. అదే సోషలిజం.

మన యుగంలో సమాజం అభ్యుదయ పంథాలో అభివృద్ధి చెందిన ముఖ్య ఫలితమే ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ నిర్మాణం. చైనాలోనూ, యూరోపు ఆసియాలలోని చాలా ఇతర దేశాలలోనూ సోష లిస్టు విప్లవాలు విజయం పొందటం, 1917 అక్టోబరు తరువాత ప్రపంచ చరిత్రలో వచ్చిన పరిణామాల్లోకల్లా గొప్పది.

ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ నూతన వ్యవస్థ. కాని మానవుని భవిష్య దభివృద్ధి ధోరణులు ఎలా వుంటాయో సూచించేందుకు తోడ్పడ గల ఎంతో ప్రాముఖ్యంతో కూడిన నిర్ణయాలు చేయడానికి అవసరమయిన అనుభవం ఈ వ్యవస్థ ఇదివరకే గడించింది.

పెట్టుబడి దారీ విధానం అంతమొంది, దాని స్థానే సోషలిస్టు విధానం రావటం అనివార్యమని కేవలం ఒక దేశం అనుభం వల్లనే కాక, అనేక దేశాల అనుభవం వల్ల ధృవపడింది. సోషలిజం వల్ల కలిగే మేళ్లు ఎంత గొప్పవో రుజువయింది. ఉత్పాదక శక్తులు అతి త్వరిత గతితో అభివృద్ధి చెందటం, శ్రామిక ప్రజల జీవన ప్రమాణాలు క్రమంగా పెరగడం, ఒకరి శ్రమ శక్తిని మరొకరు దోపిడీ చేయడమనేది రద్దుకావడం, వ్యక్తికి విస్తృత మయిన సాంఘిక, రాజకీయ హక్కులు కలగడం—ఇవన్నీ నూతన వ్యవస్థ మూలంగా ఖాయమయినాయి.

సోషలిస్టు విప్లవం వల్ల, సోషలిస్టు నిర్మాణం వల్ల వచ్చిన సమిష్టి అనుభవంలో సోదర దేశాల మహోజ్జ్వల మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీల అను భవమెంతో చేరివుంది. సోవియట్ యూనియన్ యొక్క పెద్ద అనుభవ మొక్కటే కాక, కార్మికవర్గ నియంతృత్వ నూతన రూపమయిన ప్రజాతంత్ర

ప్రజాస్వామ్యం యొక్క అనుభవం కూడ అంతర్జాతీయ కార్మికోద్యమానికి యిప్పుడు లభించింది; విప్లవ ప్రజాతంత్ర దశనుండి సోషలిస్టు దశకు శాంతి యుతంగా పరివర్తనానుభవం; సోషలిస్టు నిర్మాణ ప్రయోజనాలకై పార్ల మెంటునూ, పలు రాజకీయ పార్టీలు గల వ్యవస్థనూ వినియోగించుకొనే అనుభవం; పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన దేశాల్లో సోషలిస్టు వ్యవస్థను నిర్మించే అనుభవం; ఆర్థికంగా వెనుకబడిన దేశాలు పెట్టుబడిదారీ పరిణామ దశను దాటవేసి సోషలిస్టు దశకు పరివర్తనం చెందే అనుభవం; భూమి విషయంలో వ్యక్తి యాజమాన్యం పట్ల రైతాంగానికి సంప్రదాయ సిద్ధంగా వున్న గాఢాభిమానాన్ని దృష్టిలో పెట్టుకొని భూమిని జాతీయం చేయకుండానే గ్రామీణ ప్రాంతాలలో సోషలిస్టు పరివర్తనను తీసుకవచ్చే అనుభవం అంత ర్జాతీయ కార్మికోద్యమానికి యిప్పుడు చేకూరాయి.

వివిధ దేశాల మధ్య, వివిధ దేశ ప్రజల మధ్య ఒక కొత్త రకం ఆర్థిక, రాజకీయ సంబంధాలను సోషలిజం పెంపొందించింది. సోషలిస్టు అంతర్జాతీయత, సర్వతోముఖమైన హార్దిక సహకారం, పరస్పర సోదర సహాయం, సర్వస్వతంత్రమైన సకల దేశాల మధ్య సంపూర్ణమైన సమాన ప్రతిపత్తి—ఇవీ సోషలిస్టు దేశాల మధ్య సంబంధాలలోని ప్రధాన లక్ష ణాలు. దేశాల మధ్య చిరకాలంగా వుంటూ వచ్చిన విరోధభావం సోషలిస్టు ప్రపంచంలో నశించిపోయింది. సోషలిస్టు దేశాల మధ్య స్నేహ సౌహార్దతా సూత్రాలు అమలు జరుగుతున్నాయి.

శాంతి సాంఘికాభ్యుదయాలకు అనుకూలంగా ప్రపంచ పరిణామాన్ని అధికాధికంగా ప్రాభావితం చేస్తున్న అంశంగా సోషలిస్టు వ్యవస్థ రూపొందు తున్నది. సోషలిస్టు ప్రపంచ దృష్టాంతాన్ని చూచి ఇతర దేశాలలోని కార్మికవర్గమూ, యితర శ్రామిక ప్రజలూ ఉత్తేజితులై తమ ముఖ్యమైన హక్కులకోసం, తమ ప్రయోజనాలకోసం, సాంఘిక, జాతీయ విముక్తి కోసం, శాశ్వతమైన శాంతికోసం పెట్టుబడిదారీ పీడనకు వ్యతిరేకంగా సాగించే తమ పోరాటాన్ని మరింత ఉధృతం చేస్తున్నారు. సోషలిజం

ప్రపంచానికి వసంతాగమం అంటివనీ, పెట్టుబడిదారీ విధానం గతించిన కాలమనీ, జీవిత వాస్తవాలనుబట్టి ప్రజానీకం క్రమక్రమంగా గుర్తిస్తూ వుంది.

చారిత్రక ప్రాముఖ్యానిబట్టి వలసవిధాన పతనానిది, ప్రపంచ పరిణామ ఫలితాల్లో రెండోస్థానం. సోషలిస్టు వ్యవస్థ అవతరించి పటిష్ఠం కావడంతో, పీడిత ప్రజావిముక్తి యుగం ప్రారంభమయింది. సోషలిజం ఒక బలవత్తరమైన శక్తిగా రూపొందిన తరువాతనే, 150 కోట్ల ప్రజలు వలసాధిపతుల పీడనునుంచి విముక్తి చెందడమనే చారిత్రక పరిణామం సాధ్యమయింది. వలస విధానమనే దుర్గంపై జాతీయ విముక్తి విప్లవాలు గట్టిదెబ్బ తీశాయి. వలస సామ్రాజ్యాల శిథిలాలపై సర్వస్వతంత్రమైన నలభైరెండు దేశాలు ఆవిర్భవించాయి.

సామ్రాజ్యవాదం యావత్తు ఖండాలనే ప్రజల చెరసాలలుగా మార్చింది. కోటానుకోట్ల ప్రజలను దాస్యశృంఖలాలతో బంధించి, వారిని శతాబ్దాలుగా నాగరికతనుంచి వేరుచేసింది. ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాల ఆర్థిక వ్యవస్థలను చుట్టుముట్టి, పరిమితం చేసి, కేవలం వ్యవసాయానికీ, ముడి సరుకులకు మాత్రమే ప్రాముఖ్యమిచ్చింది. పరిస్థితిని మీరే అంచనావేయండి [illegible]. సోషలిస్టేతర ప్రపంచంలో ఉత్పత్తిఅయ్యే పారిశ్రామిక సరుకుల్లో పది శాతమూ, యంత్రాలు పరికరాల్లో సుమారు మూడు శాతమూ, లోహాలలో అయిదు శాతమూ మాత్రమే ఆ ప్రపంచంలోని మొత్తం జనాభాలో మూడింట రెండుపాళ్ళకు పైగా నివసిస్తున్న దేశాల్లో, పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో ఉత్పత్తి అవుతున్నది. ఆసియా ఆఫ్రికాలలోని బడుగు దేశాల్లో తలసరి సాంవత్సరిక ఆదాయం, అమెరికాలోకన్న సుమారు 20—25 రెట్లు తక్కువ.

పెట్టుబడిదారీ దేశాల "నాగరికతా స్థాపకులు" వలస దేశాలను "శ్రద్ధ"గా ఆదుకొంటూ వచ్చిన చాలా ఏళ్ళ తరువాత, ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలోని లక్షలాది ప్రజలు అక్షరాలా తిండిలేక మాడి చస్తూ

వున్నారు. ఈ ప్రాంతాలలో మనిషి సగటు ఆయుఃప్రమాణం. ఒకప్పుడు వాటిపై పెత్తనం చేసిన దేశాలలోని ఆయుఃప్రమాణంలో సుమారు సగం. ఆఫ్రికాలో శిశుమరణాలు విపరీతం. ఆఫ్రికాలో వయోజనుల్లో నూటికి 80 మందికి పైగానూ, లాటిన్ అమెరికాలో నూటికి 40 మందికి పైగానూ చదువనూ, వ్రాయనూ రాదు. "స్వేచ్ఛా ప్రపంచ" నాగరికత అని చెప్పబడుతున్నదానికి వలస దేశ ప్రజలు చెల్లించిన భయంకరమైన మూల్యమిదీ! కాబట్టి, వలసాధిపతులు నెలకొల్పిన మానహీనమయిన సంబంధాలను వలస దేశాల ప్రజలు తెంచివేసుకొంటూ వుండటం సహజమే.

పెట్టుబడిదారీ వ్యవస్థ సర్వవిధాలా విపరీతంగా బలహీనపడటం, ఆ వ్యవస్థను ఆవహించిన సార్వత్రిక సంక్షోభం సరికొత్తగా తీవ్రరూపం ధరించడం ప్రపంచ పరిణామం యొక్క మూడవ ఫలితం. పెట్టుబడిదారీ విధానాన్ని గూర్చి, దాని అత్యున్నత దశ అయిన సామ్రాజ్య విధానాన్ని గూర్చి, మన పార్టీ ద్వితీయ కార్యక్రమంలో లెనిన్ చేసిన పరిశీలన పూర్తిగా సరియైనదని వాస్తవ విషయాలు నిరూపించాయి. కాబట్టి ఈ విషయానికి సంబంధించిన మూల సిద్ధాంతాల వివరణను మన పార్టీ నూతన కార్యక్రమంలో కూడ ఉటంకించడం అవసరమని భావించాము.

సోషలిస్టు విప్లవాలు, జాతీయ విముక్తి విప్లవాలు, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ అభివృద్ధి, వలస వ్యవస్థ విచ్ఛిత్తి—ఇవీ, పెట్టుబడిదారీ విధాన సంక్షోభాన్ని తీవ్రతరం చేస్తున్న ప్రధానాంశాలు. ఇటీవల సంవత్సరాలలో పెట్టుబడిదారీ వ్యవస్థ ఒక నూతనమైన దశ నందుకొన్నది. కాని పెట్టుబడిదారీ సంక్షోభ తీవ్రతకు కారణభూతమైన అంశాలు యివి మాత్రమే కావు. ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ సంక్షోభం సర్వవ్యాప్తమైన పరిణామం. ఇది బూర్జువా సామాజిక జీవితానికి సంబంధించిన అన్ని రంగాలకూ, అంటే, ఆర్థిక వ్యవస్థకు, ఆంతరంగిక, విదేశాంగ విధానాలకు, సిద్ధాంతాలకూ సంబంధించినది.

మొదటి విషయం, పెట్టుబడిదారీ విధానం యొక్క ఆర్థిక అస్థిరత్వం బాగా హెచ్చింది. అభివృద్ధిలో కొన్ని దేశాలకూ మిగతా దేశాలకూ గల వ్యత్యాసం మరింత ప్రస్ఫుటంగా పెరిగింది. ఈ విషయం మనం గమనించాలి. పెట్టుబడిదారీ వ్యవస్థ ఆర్థికాభివృద్ధి వేగం తగ్గిపోతున్నది. కొన్ని దేశాలలో యిది జనాభా పెరుగుదల వేగానికి కాస్తంతగా మాత్రమే ముందున్నది. ఆర్థిక సంక్షోభాలు మరింత తరచుగా సంభవిస్తున్నాయి—ముఖ్యంగా అమెరికాలో యిది కనిపిస్తున్నది. ఆర్థిక వ్యవస్థలో యుద్ధావసరాల ఉత్పత్తి ఒక శాశ్వతాంశంగా రూపొందింది. సైనికతత్వం అపరిమితంగా పెరిగింది. జాతీయాదాయంలో పదిహేను నుండి ఇరవై శాతం వరకు ఆయుధాల కోసం ఖర్చవుతున్నది. మానవ బలగంలో గణనీయమైన భాగం భౌతిక విలువల ఉత్పత్తికై వినియోగం కావటంలేదు. ఉత్పత్తి యంత్రాంగాన్ని సంపూర్ణంగా వినియోగించకుండా కొంత భాగాన్ని వృధాగా వుంచడమనేది హెచ్చవుతూనే వున్నది. సంక్షోభాలు వచ్చినప్పుడు కొన్ని పరిశ్రమలలో ఉత్పత్తి శక్తిని 50 శాతం వరకూ వృధాచేస్తున్నారు. అనేక దేశాలలో అసంఖ్యాక ప్రజలకు వ్యాపించిన నిరుద్యోగం నిజంగా ఒక జాతీయ విపత్తుగా పరిణమించింది. ఈ దేశాలలో వ్యవసాయ వృత్తిలోని అదనపు జనసంఖ్యను గురించి చెప్పనక్కరే లేదు. అధికారయుతంగా ప్రకటింపబడిన లెక్కల ప్రకారమే ఉత్తర అమెరికా, పశ్చిమ యూరోపులోని అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలోనూ, జపాన్, ఆస్ట్రేలియాలలోనూ గల 8 కోట్ల 50 లక్షల పారిశ్రామిక కార్మికుల్లో 80 లక్షలనుండి ఒక కోటివరకు పూర్తిగా నిరుద్యోగులు. అంటే సగటున ప్రతి తొమ్మిదిమంది లోనూ ఒకడు నిరుద్యోగి.

ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ రాజకీయ అస్థిరత్వం హెచ్చింది. ముఖ్యంగా వర్గ వైషమ్యాలు పెరుగుతూ వుండడం దీనికి కారణం. ఇందుకు తార్కాణంగా, చాలా కొద్దిమందే వున్న గుత్త పెట్టుబడిదారులకు ప్రజలలోని తదితర తరగతులకు మధ్య వైరుద్ధ్యాలు తీవ్రమౌ

తున్నాయి; కార్మిక వర్గ పోరాటం ఎంతో విస్తృతమవుతున్నది; రైతుల పోరాటం ఉధృతమవుతున్నది. ఫాసిజాన్నీ, నిరంకుశ సైనిక ప్రభుత్వాలనూ ఎదుర్కొని ప్రజాస్వామ్యాన్ని రక్షించుకోవడానికై శ్రామిక ప్రజానీకం సామూహిక చర్యలు తీసుకొంటున్నది. ఇంకా యిటువంటివే కారణాలు దీనిని రుజువుచేస్తున్నాయి. కమ్యూనిస్టు పార్టీల పాత్ర, పలుకుబడి స్థిరంగా హెచ్చుతూ వుండడం కూడా దీనినే స్పష్టపరుస్తున్నది.

సామ్రాజ్యవాద నిర్మాణాన్ని ఆమూలాగ్రంగా ఒక తీవ్రమైన విషమ సంక్షోభం ఆవహించింది. దీని భావం సామ్రాజ్యవాదం పూర్తిగా స్తబ్దమై పోయిందని కాదు; దాని ఉత్పత్తి శక్తులు ఉడిగిపోయాయనీ కాదు. తాత్కాలికమైన అంశాల ప్రభావం వల్ల, వివిధ పెట్టుబడిదారీ దేశాల్లో, వివిధ సమయాల్లో, పెట్టుబడిదారీ వ్యవస్థ మరింత త్వరితగతిలో అభివృద్ధి చెందడం కనిపిస్తుంది. కాని మొత్తంపైన, పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలు ఆధునిక ఉత్పత్తి శక్తుల అభివృద్ధిని అరికట్టడం రోజురోజుకూ ఎక్కువవుతున్నది. ఈనాడు సోషలిస్టు దేశాలలోని ఉత్పత్తి పెరుగుదల రేటు ఆ దేశాల అభివృద్ధికి గీటురాయి. గత దశాబ్దిలో సోషలిస్టు ప్రపంచంలో ఆర్థిక వ్యవస్థ ఏటేటా సగటున సుమారుగా 14 శాతం చొప్పున అభివృద్ధి చెందుతూ వుండగా, మొత్తంపైన పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ ఏడాదికి సగటున ఐదు శాతానికి మించి వృద్ధిచెందలేదు.

పెట్టుబడిదారీ విధానంలో అభివృద్ధి అవకాశాలు ఇంకా బ్రహ్మాండంగా ఉన్నవనీ, అందు కపనపరుయిన "అంతశ్శక్తులు" అందులో ఉన్నవనీ నిరూపించడానికి సామ్రాజ్యవాద సిద్ధాంతవేత్తలూ, రాజకీయ వేత్తలూ విఫల ప్రయత్నాలు చేస్తున్నారు. పెట్టుబడిదారీ విధాన స్వభావమే మారిపోతున్నదనీ, అన్నిటికన్నా ముఖ్యంగా అది సోషలిజం వేపుకు పరిణతి చెందుతున్నదనీ సిద్ధాంతీకరించడానికై, మితవాద సోషలిస్టులూ, సామ్రాజ్యవాదాన్ని సమర్థించే తదితరులూ, పెట్టుబడిదారీ విధానంలోని నూతన లక్షణాలను కొండంతలు చేసి చూపుతున్నారు. ఇదంతా పట్టి తెలివిమాలిన పని

అని వేరే చెప్పనవసరం లేదు. సామ్రాజ్య వాదాన్ని పరిశీలించి లెనిన్ చెప్పిన విషయాలను ఆచరణలో ధృవపరచడం తప్ప ఈ నూతన లక్షణాలలో విశేషమేమీ లేదు. పెట్టుబడిదారీ విధానం "పరివర్తనం చెందడ" మనేదేదీ లేదని ఇవి నిరూపిస్తున్నాయి. పైపెచ్చు అది దినదినానికీ బలహీన పడుతున్నది. దానిలోని వైరుద్ధ్యాలు తీవ్రరూపం ధరిస్తున్నవి. దాని క్షీణ దశ, పరాశ్రమోప జీవనత మరింత ప్రస్ఫుటమవుతున్నవి.

సామ్రాజ్యవాద వందిమాగధులు దేనిపైన తమ ఆశలను పెట్టుకొన్నారు? ముఖ్యంగా ప్రభుత్వ గుత్త పెట్టుబడిదారీ విధానంపైన. కాని ప్రభుత్వ గుత్త పెట్టుబడిదారీ విధానం చాలా రోజులుగా అమల్లో వున్న విషయమని మనకు తెలుసు. వాస్తవ విషయాలవల్ల వ్యక్తమవుతున్న దేమిటి? ఇవి పునరుద్ఘాటిస్తున్న దేమిటంటే—పెట్టుబడిదారీ విధాన పరిణామంలో సామ్రాజ్యవాదానికంటె భిన్నమైన ఒక నూతన దశ ఏదో అవతరించిందని ప్రభుత్వ గుత్త పెట్టుబడిదారీ విధానం సూచించదు. అటు వ్యక్తి ప్రయోజనాలను, ఇటు ప్రజల ప్రయోజనాలను, అటు కార్మికవర్గ ప్రయోజనాలను, ఇటు పెట్టుబడిదారీ వర్గ ప్రయోజనాలను సమానంగా సంరక్షించే ఒక వర్గాతీత శక్తిగా, మధ్యవర్తిత్వం నెరపగల శక్తిగా బూర్జువా రాజ్యాంగ యంత్రం అభివృద్ధి చెందినదని కూడ అది సూచించదు.

ప్రభుత్వ గుత్త పెట్టుబడిదారీ విధానమంటే, గుత్త పెట్టుబడిదారీ శక్తులూ, రాజ్యాంగ యంత్ర శక్తులూ ఒకే యంత్రాంగంగా సమ్మేళనం కావడమన్నమాట. తద్వారా, జాతి జీవితంలోని వివిధ రంగాలన్నిటినీ కొద్దిమంది ధనస్వాముల అధికార ప్రయోజనాలతో ముడి పెట్టడం జరుగుతున్నది. కేవలం ఆయా దేశాలలోనే కాక, మొత్తం పెట్టుబడిదారీ ప్రపంచ స్థాయిలో కూడ ఆర్థిక వ్యవస్థకు గుత్తపెట్టుబడిదారీ సంస్థలే పునాదిగా వున్నాయి. ప్రపంచ పెట్టుబడిదారీ ఉత్పత్తిలో ఇంచుమించు మూడవ భాగం 200 పెద్ద గుత్త పెట్టుబడిదారీ సంస్థల చేతుల్లో కేంద్రీకృతమై వుంది. ఇవి కబంధులవలె దేశాలనూ, ఖండాలను తమ కౌగిట బిగించి ప్రజల రక్తాన్ని పీల్చివేస్తున్నాయి.

ప్రభుత్వ గుత్త పెట్టుబడిదారీ సంస్థలు నెలకొనడంవల్లనూ, పెట్టుబడిదారీ పునరుత్పత్తి కార్యక్రమంలో ప్రభుత్వం అధికాధికంగా జోక్యం కలిగించుకోవడం వల్లనూ, ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి కొంతవరకు తోడ్పాటు కలిగే మాట వాస్తవమే. వనరులనన్నిటినీ కొద్దిమంది ధన స్వాముల ప్రయోజనాలకై సమీకరించడానికి కూడ ఇది చేయూత ఇస్తుంది. గుత్తపెట్టుబడిదారీ సంస్థలకు సహాయంగా, ఆర్థిక సంబంధాలలో ప్రభుత్వం జోక్యం కలిగించుకొన్న ఫలితంగా, ఉత్పత్తిలో కొంత అభివృద్ధి పొడసూపింది. యుద్ధం తరువాత కాలంలో ప్రాథమిక పెట్టుబడి విషయంలో మార్పు తీసుకరాబడింది.

1929–1933లో వచ్చినంత ఉధృతంగా ఆర్థిక సంక్షోభాలు చెలరేగితే, అందువల్ల సంభవించగల తీవ్రమైన సాంఘిక పరిణామాలు గుత్త పెట్టుబడిదారులకు తెలుసు. అందువల్ల, పెట్టుబడిదారీ విధానానికి సహజ సిద్ధమైన ఆర్థిక సంక్షోభాల వినాశాత్మక ప్రభావాన్ని ప్రభుత్వ కంట్రోలు విధానం ద్వారా తగ్గించడానికి వారు ప్రయత్నిస్తున్నారు. కాని ప్రభుత్వ గుత్తపెట్టుబడిదారీ విధానం, పెట్టుబడిదారీ విధానానికి సంబంధించిన స్వతస్సిద్ధమైన ఆర్థిక సూత్రాలను రద్దుచేయదు; చేయలేదు. ఉత్పత్తి రంగంలోని సమయానుకూల తత్త్వాన్నీ, అరాచకత్వాన్ని, ఆర్థిక సంక్షోభాలను, పెట్టుబడిదారీ విధానంలోని ఇతర దుర్లక్షణాలను తొలగించదు.

అమెరికాలో ప్రభుత్వ గుత్తపెట్టుబడిదారీ విధానం చాలా అభివృద్ధి చెందింది. అయితే అది ఆ దేశానికి మేలేమైనా చేసిందా? ఫాక్టరీల ఉత్పాదక శక్తిని పూర్తిగా వినియోగించకుండా ఉత్పత్తిని తగ్గించడం జరుగుతున్నది యెక్కువగా అమెరికాలోనే. పెట్టుబడిదారీ ప్రపంచంలో విస్తార ప్రజానీకం తిండిలేక మాడుతూన్న తరుణంలోనే అమెరికాలో పంట భూముల విస్తీర్ణాన్నీ, వ్యవసాయోత్పత్తినీ తగ్గించిన వారికి ప్రభుత్వం డబ్బిచ్చి ప్రోత్సహిస్తున్నది. సర్వులకు "పూర్తిగా ఉద్యోగాలు లభ్యమవు" తాయని గొప్ప చెప్పుకొన్న అమెరికాలో పూర్తిగానూ, పాక్షికంగానూ

నిరుద్యోగులయిన వారు లక్షల సంఖ్యలో శాశ్వతంగా వుంటున్నారు.

కాబట్టి, సామ్రాజ్యవాదాన్ని రక్షించుకోవడానికి ప్రభుత్వ గుత్తపెట్టుబడిదారీ విధానం ఒక సాధనం కాగలదనుకొన్నవారి ఆశలకు ఆస్కారం లేదనేది స్పష్టం.

ప్రపంచ పెట్టుబడిదారీ విధానానికి నాయకత్వం వహించాలనీ, దానికి తాము పెట్టనికోటగా వుండాలనీ అమెరికా సామ్రాజ్యవాదం ఆశయం. పెట్టుబడిదారీ ప్రపంచంలోకెల్లా, అమెరికా భాగ్యవంతమైన, శక్తివంతమయిన దేశమనటంలో సందేహం లేదు. అయితే పెట్టుబడిదారీ విధానానికి సంభవించే ఆర్థిక క్లేశాలకు ఆ దేశం రానురాను ప్రధాన కేంద్రమవుతున్నది. ఇక్కడ ఇంకొక్క విషయం కూడ పేర్కొనడం అవసరం. గత దశాబ్దమంతా పెట్టుబడిదారీ ప్రపంచంలోని మొత్తం ఉత్పత్తి, వాణిజ్యాల్లో అమెరికా భాగం క్రమంగా తగ్గిపోతున్నది. అమెరికా పెట్టుబడిదారీ వ్యవస్థ ఉచ్చదశ గతించింది. నేడది క్షీణ దశలో వుంది.

పెట్టుబడిదారీ ప్రపంచ మంతటినీ తన నాయకత్వాన "సమైక్యం" చేయటానికి అమెరికా చేసిన ప్రయత్నాలు విఫలం కావడానికి మరొక కారణంకూడా వుంది. అది సామ్రాజ్యవాద దేశాలమధ్యగల పరస్పర ఆర్థిక ఘర్షణ. ఈ సంఘర్షణ లేకుండా చేయడం అసాధ్యం. పెట్టుబడిదారీ దేశాల సమైక్యతా, మార్కెట్ల సమస్య తీవ్రతను తగ్గించడమూ అనే నినాదాలతో అంతర్జాతీయ రంగంలో ప్రభుత్వ గుత్త పెట్టుబడిదారీ సంస్థలు ఏర్పడుతున్నాయి. ఇవి పెట్టుబడిదారీ ప్రపంచంలోని మార్కెట్ల పునర్విభజనకు నూతన రూపాలు తప్ప వేరు కాదు. ఇవి తీవ్రమైన ఒత్తిడికీ, ఘర్షణను ఆలవాలమవుతున్నాయి. సామ్రాజ్యవాద శిబిరంలో రెండు ధోరణులున్నాయి. అవి ఒకదానికొకటి పెనవేసుకొని వుంటాయి. సోషలిజానికి వ్యతిరేకంగా తన శక్తుల నన్నిటినీ ఐక్యం చేయాలనే ధోరణి ఒకటి. సామ్రాజ్యవాద దేశాల మధ్యా, సామ్రాజ్యవాద దేశాలకు పెట్టుబడిదారీ ప్రపంచంతోని ఇతర దేశాలకూ మధ్యా, వైరుధ్యాలు పెంపొందే ధోరణి

రెండవది. రెండవ ధోరణిని అధిగమించడంలో అమెరికా ఇంతవరకు జయప్రదం కాలేదు. ఇకముందు కూడ కాదు. పెట్టుబడిదారీ విధాన రక్షకులమని చెప్పుకున్న దానిని నెరవేర్చుకొనే శక్తియుక్తులు అమెరికా ధన స్వాములకు లేవు. ప్రపంచాధిపత్యం సంపాదించాలనే వారి కోర్కె విషయం కూడా యింతే.

కామ్రేడ్స్, పెట్టుబడిదారీ విధానంలోని దోపిడీ తత్వం మరింత తీవ్రరూపంలో ముందుకు వచ్చేకొద్దీ, దాని ప్రజా వ్యతిరేక సిద్ధాంతాలూ నైతిక పతనమూ మరింత తీవ్రమయ్యేకొద్దీ, బూర్జువావర్గ వందిమాగధులు మరింత ఎగ్గెత్తి పెట్టుబడిదారీ విధానాన్ని గూర్చి కీర్తిస్తారు. అయితే, పెట్టుబడిదారీ విధానం మానవ లోకానికి ఇచ్చిందేమిటి? మానవుని సృజనాత్మకమైన ప్రతిభాశక్తి సాధించిన విజయాలను వికృతం చేసి, అవి మానవునికే వ్యతిరేకమయ్యేలా చేస్తున్నది. అణుశక్తిని మానవాళికొక ఉపద్రవంగా మార్చింది. సాంకేతిక రంగంలోని ప్రతి కొత్త పురోభివృద్ధినీ మానవునికే ఎదురు తిరిగేలా చేస్తున్నది. కొన్ని దేశాల సంపదలకు అనేక ఇతర దేశాల ప్రజల దారిద్ర్యం ఆధారభూతమవుతున్నది. మార్క్స్ చెప్పినట్లు, పెట్టుబడిదారీ విధానంలో విజ్ఞానశాస్త్ర చంద్రికలు కూడ అజ్ఞానాంధకారపటలంపైన తప్ప ప్రకాశించలేక పోతున్నాయి.

కోట్లకు, శతకోట్లకు పడగలెత్తిన కొద్దిమంది దుష్టులు పెట్టుబడిదారీ ప్రపంచంలోని యావత్తు సంపదపైన యదేచ్ఛగా అధికారం నెరపడమే కాక, దేశాల భవిష్యత్తుతోనే చెలగాటమాడుతున్నారు. ఒక్కతరం జీవిత కాలంలోనే సామ్రాజ్యవాదులు రెండు ప్రపంచ యుద్ధాలు ప్రారంభించారు. ఈ యుద్ధాలలో ధ్వంసమయిన అపార సంపదమాట అటుంచి, ప్రాణాలు కోల్పోయినవారూ, వికలాంగులయినవారూ కలసి 8 కోట్లవరకూ వుంటారు. ఇదీ, సామ్రాజ్యవాదుల విధానానికి మానవాళి చెల్లించిన మూల్యం. 20వ శతాబ్ది పూర్వార్ధంలో (1900–1953) జరిగిన యుద్ధాలకు, యుద్ధసన్నాహాలకు మొత్తం ప్రపంచంలో కలిసి అయిన వ్యయం, నాల్గు లక్షల

కోట్ల డాలర్లని కొంతమంది పరిశీలకులు అంచనా వేశారు.

ఈ డబ్బుతో మానవుని శ్రేయస్సుకై ఏమి చేసి వుండవచ్చునో చూద్దాము. ఈ డబ్బుతో ప్రపంచంలోని జనాభా కంతటికీ అవసరమయినంత రొట్టెను ఒక అర్ధ శతాబ్దంపాటు ఉచితంగా సరఫరాచేసి వుండవచ్చు. 50 కోట్ల కుటుంబాలకు, అంటే ప్రపంచ జనాభాలో మూడింట రెండు పాళ్ళకు సదుపాయమైన ఇళ్లు నిర్మించి వుండవచ్చు.

ప్రస్తుతం, సామ్రాజ్యవాదం మూలాన, మానవాళి ఏటేటా కనీసం పదివేల కోట్ల డాలర్లు సైనికావసరాల కోసం వ్యయం చేయవలసి వస్తున్నది. ఈ మొత్తలో 20 శాతం మాత్రమే ఏటేటా బడుగు దేశాల సహాయార్థం ఖర్చుచేస్తే, 25 సంవత్సరాలలో 23 కోట్ల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయగల విద్యుదుత్పాదక కేంద్రాలను, ఏటా 18.5 కోట్ల టన్నుల ఉక్కు ఉత్పత్తి చేయగల ఉక్కు కర్మాగారాలను నిర్మించవచ్చు; పదికోట్ల హెక్టర్ల భూమికి నీటిపారుదల సౌకర్యాలు కలిగించవచ్చు; ఇవి కాక, ప్రజల జీవన పరిస్థితులను బాగుచేయగల అనేక పెద్ద సత్కార్యాలు చేయవచ్చు. ఉన్నిటట్టి, నిరాయుధీకరణకై సాగించే పోరాటం, అన్ని దేశాల ప్రజలకు ఎంత అత్యవసర మయినదో మరొక్కసారి స్పష్టమవుతున్నది.

ప్రపంచ పరిణామం యొక్క ముఖ్యమైన ఫలితాలను ఇలా క్లుప్తీకరించి చెప్పవచ్చు: మార్క్స్, లెనిన్ చెప్పిన ప్రకారమే చరిత్ర నడుస్తోంది. సోషలిస్టు శక్తులూ, ప్రపంచంలోని అన్ని అభ్యుదయ శక్తులూ పెంపొందుతున్నాయి. వివిధ దేశాల ప్రజలు కృతనిశ్చయులై సామ్రాజ్యవాదం నుండి అధికాధికంగా విడిపోతున్నారు. ప్రపంచ స్థాయిలో సామ్రాజ్యవాదం పతనం కావడం, సోషలిజం దిగ్విజయం పొందడం తప్పదు.

# II

# పార్టీకి, ప్రజలకు మహత్తర గమ్యం- కమ్యూనిజం

కామ్రేడ్స్, మన పార్టీ చరిత్రలోనూ, మొత్తం సోవియట్ సమాజ చరిత్రలోనూ, ఈ నూతన కార్యక్రమం ఒక కొత్త మైలు రాయి. మన పార్టీ కార్యక్రమా లొక్కొక్కటీ మన దేశ పరిణామంలో ఒకొక్క నిర్దిష్ట చారిత్రక దశకు సంబంధించినవి. అయినప్పటికీ, మన కార్యక్రమాలన్నిటికీ పరస్పర సంబంధముంది. ఇవి ఒక పూర్ణాంశంలోని ప్రత్యేక భాగాలనే దృష్టితో చూచినట్టయితే- సోషలిస్టు విప్లవంకు, సోషలిస్టు వ్యవస్థా నిర్మాణంకు, కమ్యూనిస్టు వ్యవస్థా నిర్మాణంకు సంబంధించిన మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతమిందులో స్పష్టంగా గోచరిస్తుంది. ఇది కాల పరీక్షకు నిలబడిన సిద్ధాంతం.

పార్టీ కార్యక్రమాలను మూడు అంచలు గల రాకెట్‌తో పోల్చవచ్చు. మొదటి అంచలో, మన దేశం పెట్టుబడిదారీ ప్రపంచం నుండి వేరుపడింది. రెండవ అంచలో, అది సోషలిజం వైపుకు పయనించింది. మూడవ అంచలో, కమ్యూనిజం అనే కక్ష్య చేరుకొంటుంది. కామ్రేడ్స్! మహనీయుడైన లెనిన్, మన విప్లవ సిద్ధాంతమూ చూపించిన మార్గాన్నే అది అనుగమిస్తున్నది. అన్ని శక్తులకన్నా గొప్పదైన కమ్యూనిస్టు వ్యవస్థా నిర్మాతల శక్తి దీని చోదక శక్తి.

ముసాయిదా కార్యక్రమంలోని ప్రధానమైన అంశాలేమిటి?

ప్రధానమయిన విషయమేమంటే ఇది కమ్యూనిజం నిర్మించడానికి ఒక నికరమైన, శాస్త్ర చోదితమైన కార్యక్రమం. కమ్యూనిజం అనే

మహోజ్జ్వల భవనాన్ని ఎలా నిర్మించాలో ముసాయిదా స్పష్టం చేస్తున్నది. ఈ భవనం ఎలా నిర్మించాలి, లోపల ఎలా వుంటుంది, బయటికి ఎలా కనిపిస్తుంది, అందులో నివసించే ప్రజలెలాంటివారు, దాన్ని మరింత ఆహ్లాదకరంగానూ ఆకర్షవంతంగానూ చేయటానికి వారేమి చేస్తారు మొదలగు విషయాలన్నీ యిందులో మన కగుపిస్తాయి. కమ్యూనిజం అంటే ఏమిటో తెలుసుకోవాలనేవారికి మనం సగర్వంగా "మా పార్టీ కార్యక్రమాన్ని చదవండి" అని చెప్పవచ్చు.

మార్క్సు, ఎంగెల్సు, లెనిన్‌ల విప్లవ సిద్ధాంతాభివృద్ధిలో, ముసాయిదా కార్యక్రమం ఒక నూతన దశను సూచిస్తుంది. కమ్యూనిజం కోసం జరిగే పోరాటానికి సంబంధించిన సిద్ధాంతమూ, ఆచరణా లేవదీసే ముఖ్య ప్రశ్నలన్నిటికీ, ఆధునిక ప్రపంచ పరిణామానికి సంబంధించిన కీలకమైన ప్రశ్నలకూ, ఈ కార్యక్రమంలో స్పష్టమయిన సమాధానాలున్నాయి. పార్టీ జీవితానికి, సోవియట్ సామాజిక జీవితానికి సంబంధించిన ప్రధాన సమస్యల పరిష్కారంలోనూ, ప్రపంచ పరిణామం తీరుతెన్నుల పరిశీలనలోనూ, నూతనత్వం చాలా గల సూత్రీకరణలను ప్రవేశపెట్టిన సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ 20వ, 21వ మహాసభలకు, యీ కార్యక్రమాన్ని తయారుచేయడంలో బ్రహ్మాండమయిన, నిజంగా చారిత్రాత్మకమయిన పాత్ర వుంది. సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ 20వ, 21వ మహాసభలు జరిగి వుండకపోతే, ఇటువంటి కార్యక్రమాన్ని తయారు చేయటం మనకు చాలా కష్టమై వుండేది.

మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతం, కమ్యూనిస్టు వ్యవస్థా నిర్మాణానికి సంబంధించిన ఆచరణ—ఈ రెండూ అవిభాజ్యమనీ, అవినాభావ సంబంధం కలవనీ యీ కార్యక్రమంలోని అంశాలు మొత్తంగా ప్రస్ఫుటం చేస్తున్నవి. పరిశ్రమలు, వ్యవసాయం, రాజ్యాంగ యంత్రాభివృద్ధి, విజ్ఞాన శాస్త్రాలు, సంస్కృతి, కమ్యూనిస్టు విద్య—ఈ రంగాలలోని నిర్దిష్ట కర్తవ్యాలను కార్యక్రమం నిర్వచిస్తున్నది. ఇంత పెద్ద చారిత్రక దశ

రంతటికీ సామాజిక పరిణామ స్వభావాన్ని సోవియట్ ప్రజలు రిఖించ గరి గితే, వారెంతటి మహోన్నత శిఖరా లందుకొన్నారో ఆలోచించండి. కామ్రేడ్స్.

పార్టీ తృతీయ కార్యక్రమం సకల సోవియట్ ప్రజల కార్య క్రమం. పార్టీ తన మొదటి కార్యక్రమాన్ని ఆమోదించిన తరుణంలో దాన్ని, రాజకీయ చైతన్యం గల చిన్న చిన్న కార్మిక బృందాలు అనుసరిం చేవి. అది తన రెండవ కార్యక్రమాన్ని ఆమోదించినప్పుడు దాన్ని, కార్మిక వర్గమూ, రైతాంగంలో బహుళ సంఖ్యాకులూ అనుసరించేవారు. ఈనాడు పార్టీని సోవియట్ ప్రజలందరూ అనుసరిస్తున్నారు. పార్టీ కార్యక్రమాన్ని తమ జీవితంలోని మహత్తర ధ్యేయంగా మన ప్రజలు మనసారా స్వీక రిస్తున్నారు.

"సర్వస్వం **మానవుని కోసమే; మానవ శ్రేయస్సు కోసమే**" అనే మన **పార్టీ** నినాదాన్ని ఆచరణలో **పూర్తిగా** అమలుకు తేవడం **నూతన** కార్యక్రమం **తాత్పర్యం**. ప్రజల సంక్షేమాభివృద్ధికీ, **సాంస్కృతి** కాభివృద్ధికీ, మానవుని వ్యక్తిత్వ వికాసానికీ సంబంధించిన విషయాలకు కార్యక్రమం ప్రాముఖ్యమిస్తున్నది. ఇదే జరగవలసినది. శ్రామిక ప్రజల **జీవితాన్ని** ఆనందమయం, సౌఖ్యవంతం చేయడానికై బోల్షివిక్కులు విప్లవ పతాకను చేబూనారు. ఈ మహదాశయ సిద్ధికై సోవియట్ ప్రజలు పడిన కష్టాలూ, శ్రమా శతాధికంగా ఫలించే **యుగారంభానికి పార్టీ** తృతీయ కార్య క్రమం నాందీవాచకం పలుకుతున్నది.

నూతన అంతర్జాతీయ పరిస్థితులను ఆధారంగా చేసుకొనే ఈ ముసా యిదా కార్యక్రమం రూపొందింప బడింది. కమ్యూనిజం నిర్మింపబడు **తున్న**ది పెట్టుబడిదారీ వలయంలో **కాదు**. ప్రపంచ **సోషలిస్టు** వ్యవస్థ స్థాపించబడిన; సామ్రాజ్యవాద శక్తులకన్న సోషలిస్టు శక్తులూ, యుద్ధోన్మాద శక్తులకన్న శాంతి శక్తులూ రాను రాను బలాధిక మవు **తున్న** పరిస్థితుల్లో కమ్యూనిజం నిర్మింపబడుతున్నది. సోవియట్

భూమిలోని ఆర్థిక, సాంఘిక పురోగమనాన్ని నిరోధించడానికి సామ్రాజ్య వాద దేశాలు సహజంగా ప్రయత్నాలు చేస్తున్నాయి; సోవియట్ యూనియన్ తప్పనిసరిగా, తన రక్షణకై డబ్బు వ్యయం చేయవలసిన పరిస్థితిని కల్పిస్తున్నాయి. ఇలా జరిగి వుండకపోతే మన దేశం ఇంకా త్వరత్వరగా అభివృద్ధిచెందుతూ వుండేది. అయినప్పటికీ, సోషలిస్టు శక్తులు వృద్ధిచెంది, ప్రపంచ సామ్రాజ్యవాదం బలహీనపడేకొద్దీ, మన ఆర్థిక, సాంస్కృతికాభి వృద్ధికి యిప్పటికన్నా ఎక్కువ అనుకూలమైన పరిస్థితులు ఏర్పడగలవు.

మన కార్యక్రమం సోషలిస్టు అంతర్జాతీయతా భావగర్భిత మైనది. విదేశాలలోని తన సోదర పార్టీల విషయంలో నిర్వర్తించవలసిన బాధ్యతలను లెనిన్ పార్టీ సర్వదా గౌరవ భావంతో నిర్వర్తిస్తూ వచ్చింది. 1917 అక్టోబరులో, అది విముక్తి ప్రభాత కాంతులను ప్రసరింప చేసింది. ప్రపంచ ప్రజలకందరికీ కనిపించేలా సోషలిజం అనే అఖండ జ్యోతిని వెలిగించింది. నూతన సాంఘిక వ్యవస్థ వైపుకు వారిని తీసుకొని వెళ్ళే మార్గంపై యీ అఖండ జ్యోతి వెలుగు ప్రసరిస్తున్నది. భవిష్యత్తులో సైతం లెనిన్ పార్టీ అంతర్జాతీయతా పతాకను సమున్నతంగా నిలబెట్టి వుంచుతుంది. చరిత్రలో స్వల్పకాలంలోనే కమ్యూనిజాన్ని నిర్మించడం తన ప్రప్రథమ అంతర్జాతీయ కర్తవ్యమని పార్టీ నేడు భావిస్తున్నది.

ముసాయిదా కార్యక్రమం నిజమైన కమ్యూనిస్టు మానవతను ప్రతిబింబించే పత్రం; దేశాల మధ్య శాంతి సౌభ్రాతృత్వాలు నెలకొనాలనే భావాలతో ఇది నిండి వుంది. నిర్విరామంగా పెంపొందుతున్న మన దేశ బలసంపదను శాంతికోసం, మానవాళి అభ్యుదయంకోసం వినియోగించడానికి మనం పూనుకొన్నాము. సోవియట్ యూనియన్ పారిశ్రామిక రంగంలో ప్రథమ స్థానమాక్రమించిన తరువాత, ప్రపంచ పరిణామంలో సోషలిస్టు వ్యవస్థ సంపూర్ణంగా నిర్ణాయకమైన శక్తి అయిన తరువాత, ప్రపంచమంతటా శాంతి శక్తులు యింకా బలవత్తరమైన తరువాత, ప్రపంచంలో శాంతి శక్తులదే శాశ్వతంగా పైచేయి అవుతుంది. అంతర్జా

తీయవాతావరణ పరిస్థితిని సూచించే బారమితి ఇలా చాటుతుంది : "ఆకాశం నిర్మలంగా వుంది. ప్రపంచ యుద్ధ ప్రమాదం తొలగింది; ఇక ఎన్నటికీ రాదు."

కామ్రేడ్స్, కమ్యూనిజం మానవాళి యుగయుగాలుగా కంటూన్న కల. దాస్యం, పరాధీనత, దారిద్ర్యం, తిండికోసం బాధాకరమైన పోరాటం, ప్రజల మధ్య యుద్ధాలు—ఇవన్నీపోయి శాంతి, శ్రమజీవనం, స్వేచ్ఛ, సమానత, సౌభ్రాతృత్వం శాశ్వతంగా నెలకొన్న సంఘ వ్యవస్థ అవతరిస్తుందని శ్రామిక ప్రజలు విశ్వసించారు. వాటంతటకవే ప్రారంభమయిన ప్రజోద్యమాల ఫలితంగా భవిష్యత్తులో స్వర్ణయుగం రానున్నదనే ఊహాజగత్తుకు సంబంధించిన సిద్ధాంతాలు రేకెత్తాయి.

ఊహాజగత్తు సోషలిజం ప్రచారం చేసినవారు దోపిడీ వ్యవస్థను, దాని దుష్పరిణామాలను చాలా నిశితంగా విమర్శించారు. వారు భావి సమాజాన్ని వర్ణించారు. అయితే, సోషలిజాన్ని సాధించే మార్గాలను గురించి వివరించే సందర్భంలో కన్నా, ఆ సమాజంలో అంతరించే విషయాల గురించి చెప్పే సందర్భంలో వారు సత్యానికి చేరువలో వున్నారు. ఏమైనా, ఒక ఆదర్శవంతమైన సాంఘిక వ్యవస్థను గూర్చి ఊహా చిత్రాల వెనుక రత్నాల వంటి అద్భుత భావాలు నేటికీ కనిపిస్తున్నాయి. గొప్ప ఊహాజనిత సోషలిస్టు భావ ప్రేరితులయిన సెయింట్-సైమన్, ఫొరియర్, ఓవెన్, కాంపనెల్లా, మోర్‌లనూ, మన రష్యాకు చెందిన విప్లవ ప్రజాతంత్ర వాదులైన చెర్నిషెవ్‌స్కీ, హెర్జెన్, బెలిన్‌స్కీ, దొబ్రొల్యుబొవ్‌లనూ కృతజ్ఞతతో స్మరిస్తున్నాము. పైన పేర్కొన్న రష్యన్ ప్రజాతంత్రవాదులు తదితరులకన్నా శాస్త్రీయ సామ్యవాదం చేరువకు వచ్చారు.

అయితే, శాస్త్రీయ కమ్యూనిజానికి సంబంధించిన సిద్ధాంతాన్ని అభివృద్ధి చేసిన వారూ, నూతన సమాజాన్ని స్థాపించే మార్గాలు సాధనాలేవో, పాత ప్రపంచాన్ని నిర్మూలించి కమ్యూనిస్టు ప్రపంచాన్ని నిర్మించగల విప్లవ శక్తులేవో సూచించిన వారూ ఎవరంటే మార్క్స్, ఎంగెల్స్, లెనిన్;

కమ్యూనిజంలోని అత్యంత విశిష్టమైన గుణాలను మార్క్స్, ఎంగెల్స్ నిర్వచించారు. మనం ఆచరణలో కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మిస్తున్న యీనాడు మన గురువుల అద్భుతమయిన దూరదృష్టిని కీర్తించకుండా ఉండలేము. వారు భవిష్యత్కాలంలోకి ఒక శతాబ్దం మేరవరకు తొంగిచూడగలిగారు.

కమ్యూనిస్టు సమాజాన్ని గూర్చిన మార్క్స్ ఉపదేశాలను మన పార్టీ మహా నిర్మాత లెనిన్ మరింత ముందుకు తీసుకపోయారు. కమ్యూనిజానికి సంబంధించిన రెండు దశలను ఆయన అతి స్పష్టంగా నిర్వచించారు, సోషలిస్టు వ్యవస్థ నిర్మాణానికై ప్రణాళికను రూపొందించారు, ఏ భౌతిక సూత్రాలను అనుసరించి సోషలిస్టు వ్యవస్థ కమ్యూనిస్టు సమాజంగా పరిణతి చెందుతుందో తెలియజేశారు.

మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంత స్థాపకులు శాస్త్రీయ దృష్టితో చేసిన నిర్ధారణలపైననే కమ్యూనిస్టు వ్యవస్థను గురించిన మన భావన పూర్తిగా ఆధారపడి వుంది. ఐనప్పటికీ, వారికి లేని ఒక సౌకర్యం మనకు వుంది, అది చాలా ముఖ్యమైనది కూడ. మనం 20వ శతాబ్దం ఉత్తరార్థంలో జీవిస్తున్నాము. సోషలిస్టు, కమ్యూనిస్టు వ్యవస్థలను నిర్మించడంలో మనకు అమూల్యమైన, అపారానుభవముంది. ఈ నిర్మాణం జరుగుతున్నది థామస్ మోర్ ఊహా చిత్రంలోలాగా సముద్రం మధ్యలో ఎక్కడో దూరంగా వున్న ఒక చిన్న ఉటోపియా దీవిపైన కాదు; టొమ్మాసో కాంపెనెల్లా వర్ణించినట్లు ఒకానొక సౌర నగరంలో కాదు; రాబర్ట్ ఓవెన్ పథకంవలె దూరంగా వున్న అమెరికాలోని ఒక చిన్న భూభాగంలో కాదు. ఈ నూతన జీవితం నిర్మింపబడుతున్నది, ప్రపంచంలోని ఒక పెద్ద భాగంలో.

కమ్యూనిస్టు సమాజాన్ని విస్పష్టంగా, ఇదమిద్ధంగా మనం నేడు చిత్రించుకోగలుగుతున్నాము. అంతకన్నా ముఖ్యమయిన విషయమేమంటే, కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మించేందుకు ఆచరణ సాధ్యమయిన విధానాలను నిర్వచించగలుగుతున్నాము. శాస్త్రీయ కమ్యూనిజానికి సంబంధించిన సూత్రా

లకు ఒక కార్యరూపం ఇస్తున్నాము. కమ్యూనిస్టు వ్యవస్థ విజయ సిద్ధికి దారి తీసే సోషలిస్టు సమాజ పరిణామ ధోరణులు మనకు అనుభవవేద్యం కాబట్టి, కాలగర్భంలో దాగి, మన పూర్వులకు అగుపించని విశేషణాలనేకం మనకు విస్పష్టంగా దృగ్గోచరమవుతున్నాయి. అభివృద్ధి చెందిన కమ్యూనిస్టు సమాజానికి సంబంధించిన అన్ని వివరాలనూ ఇదమిద్ధంగా పేర్కొనడానికి ఏనాడు కూడ మనం ప్రయత్నించడం లేదు. ఇది సహేతుకమే. మన గురువులు చూపిన మార్గం కూడ ఇదే. దాన్నే అనుసరిస్తున్నాము.

కమ్యూనిజానికి ముసాయిదా కార్యక్రమం ఇస్తున్న నిర్వచన మిది:

"కమ్యూనిజం, ఉత్పత్తి సాధనాలపై ఒకేరకమైన ప్రజాయాజమాన్యం గల ఒక వర్గరహిత సామాజిక వ్యవస్థ. ఆ సమాజంలోని సర్వులూ సామాజిక ప్రతిపత్తిలో సంపూర్ణంగా సమానులు. ఈ వ్యవస్థలో ప్రజల సర్వతోముఖాభివృద్ధితోపాటు విజ్ఞాన శాస్త్రం, సాంకేతిక నైపుణ్యం నిరంతరాయంగా అభివృద్ధి చెందడం వల్ల, ఉత్పాదక శక్తులు పురోగమిస్తాంటాయి. ప్రజా సంపద ఆధారాలన్నీ వెల్లివిరిస్తాయి; "ఎవరి శక్తిని బట్టి వారు పనిచేయుటం; ఎవరి అవసరాలను బట్టి వారు ప్రతిఫలం పొందటం" అనే గొప్ప సూత్రం అమలు జరుగుతుంది. కమ్యూనిజం అంటే స్వేచ్ఛా, సాంఘిక చైతన్యం గల శ్రామిక ప్రజల సుసంఘటిత సమాజం. ఈ సమాజంలో ప్రజల స్వయంపరిపాలన నెలకొని వుంటుంది. సమాజ శ్రేయస్సు కోసం శ్రమించటమనేది ప్రతి ఒకరికి అతి ముఖ్యావసరమవుతుంది. దీన్ని సర్వులూ గుర్తిస్తారు. ప్రజలందరికీ అత్యంతోపయోగకరంగా వుండేలా ప్రతి వ్యక్తి శక్తి సామర్థ్యాలు వినియోగింపబడుతాయి."

కమ్యూనిస్టు సమాజ వర్ణనకు సంబంధించిన కొన్ని అంశాలను గురించి వివరిస్తాను. మొత్తం సమాజ స్థాయిలో కేంద్రీకృతమై, చాలా పట్టుదిట్టమైన పద్ధతిలో సాగే ఉత్పత్తి విధానం కమ్యూనిస్టు వ్యవస్థలో

అమలు జరుగుతుంది. ఇది అత్యంత ప్రజాతంత్రమైన పద్ధతిలో నిర్వహింపబడుతుంది. కమ్యూనిస్టు సమాజమంటే స్వయంసంపూర్ణమైన స్వతంత్ర ఆర్థికాంగాల కూటమి కానేకాదు. ఆర్థిక వ్యవస్థను సమైక్య పద్ధతిలో ప్రణాళికాబద్ధం చేయటం, ఏయే పనులకు యెంత మంది కావాలో నిర్ణయించి తదనుగుణమైన పంపకం చేయటం, పని కాలాన్ని క్రమబద్ధం చేయటం— ఇదంతా అభివృద్ధిచెందిన కమ్యూనిస్టు సమాజంలోనే యెక్కువ అవసరమవుతుంది. ఉత్పత్తి శక్తులు అభివృద్ధి చెందడంవల్లనేమి, వివిధ ఆర్థిక శాఖల మధ్య గల గట్టి పరస్పర సంబంధాలవల్లనేమి, సాంకేతికాభివృద్ధి నిరంతరాయంగా సాగవలసిన అవసరం వల్లనేమి, వస్తువినిమయ వినియోగాలకు సంబంధించిన కమ్యూనిస్టు సూత్రాలవల్లనేమి, ఇదంతా అవసరంఅవుతుంది. ఉత్పత్తి నిర్వహణలో ప్రజలంతా అత్యంత కార్యవ్యగ్రతతో పాల్గొంటేతప్ప, కమ్యూనిస్టు ఆర్థిక వ్యవస్థను అభివృద్ధి చేయటం అసాధ్యం. "వారి వారి శక్తినిబట్టి పని, వారి వారి అవసరాలను బట్టి ప్రతిఫలం" అనే మహత్తర కమ్యూనిస్టు నినాదాన్ని ఆచరణసాధ్యం చేయటానికి అవసరమయిన నిర్దిష్ట చర్యలను, పద్ధతులను మొట్టమొదటి సారిగా ఈ ముసాయిదా కార్యక్రమం విపులీకరిస్తున్నది. కష్టపడి పనిచేసేవారికి తగిన ప్రతిఫలం ముట్టజెప్పి ప్రోత్సహించటం, ప్రభుత్వ నిధుల ద్వారా వస్తు వినిమయాన్ని పెంచటం —ఈ రెంటినీ తగు విధంగా మేళవించటంవల్లనే కమ్యూనిస్టు సమానతా సూత్రాలను అమలు జరపటానికి మార్గమేర్పడుతుంది.

కమ్యూనిజంలో జీవన పరిస్థితులను గూర్చి కొందరు తప్పుగానూ, సంకుచిత దృష్టితోనూ చిత్రిస్తారు. వీరు, పైన పేర్కొన్న సూత్రంలో "వారి వారి అవసరాలను బట్టి" అని వున్న రెండవ భాగాన్ని మాత్రం తీసుకొని యించుమించు ఇలా వాదిస్తారు: "కమ్యూనిజంలో నీకిష్టముంటే పని చేస్తావు. లేకపోతే దూరప్రాచ్యం నుండి పశ్చిమానికీ, పశ్చిమంనుండి దక్షిణానికీ ఎలా బుద్ధిపుడితే అలా వెళ్లిపోతుంటావు. అయినప్పటికీ నీ అవసరాలను బట్టి నీకు సమస్తం సమకూరుస్తారు." ఒక పెద్ద చెంచాఉంటే

చాలు తాము కమ్యూనిజం కోసం సన్నిద్ధమయినట్టేనని వీరి భావం.

ఆదిలోనే వీరికి మనం ఆశాభంగం కలిగించక తప్పదు. వారి భావానికీ కమ్యూనిజానికీ ఎలాంటి సామ్యమూ లేదు. కమ్యూనిస్టు వ్యవస్థలో అత్యున్నతా అభివృద్ధి చెందిన సాంకేతిక నైపుణ్యం, అత్యుత్తమంగా సంఘటితమై అభివృద్ధి చెందిన ఉత్పత్తి విధానమూ, ఎంతో బాగా అభివృద్ధి అయిన యంత్రాలూ వుంటాయి. అయితే యీ యంత్రాలను నడిపేవారు ప్రజలు. నడిపించేవారుంటే తప్ప యంత్రాలున్నా లేనట్లే. కాబట్టి ప్రతి శ్రామికుని ప్రవర్తనకూ సంపూర్ణమైన జ్ఞానం, మంచి నిర్మాణ పాటవం, క్రమశిక్షణా, అవశ్య ప్రమాణం; అతను పాటించవలసిన సూత్రం. పెట్టుబడిదారీ విధానంలోలాగా అతడు కడుపు కక్కుర్తితో తన విధులను నెరవేర్చడు: చైతన్యంతో తనంతకు తానే తను విధులను నెరవేరుస్తాడు.

భౌతిక, ఆత్మిక సౌఖ్యాలు నెలకొల్పడానికై శ్రమించడం తన విధ్యుక్త ధర్మమనే చైతన్యం ప్రతి ఒకరికీ వుంటుంది. సోవియట్ ప్రజలందరూ ఎంత బాగా పనిచేసి తీరాలంటే, కమ్యూనిజం అనే మహోజ్జ్వల భవనం నిర్మింపబడిన తరువాత, వారు “నేను సైతం దాని నిర్మాణానికి నా శక్తిని ధారపోశాను” అని చెప్పగలిగి వుండాలి.

కమ్యూనిజాన్ని సోషలిజం నుండి వేరుపరచే అడ్డుగోడ ఏదీ లేదనీ; కమ్యూనిజమూ, సోషలిజమూ ఒకే సాంఘిక–ఆర్థిక నిర్మాణం యొక్క రెండు దశలనీ, ఆర్థిక అభివృద్ధి స్థాయి, సాంఘిక సంబంధాల పరిపక్వతలో మాత్రమే యీ రెంటికీ భేదం వున్నదనీ మార్క్సిస్టు–లెనినిస్టు సిద్ధాంత ప్రమాణ గ్రంథాలు నొక్కి చెప్పుతున్నాయి.

సోషలిజం తన సొంత పునాది పైననే అభివృద్ధి చెందదు. ఆర్థిక, నైతిక, న్యాయశాస్త్రాద అనేక విషయాలలో సోషలిజం ప్రపంచమంతటి పైనా తన ఘన విజయాల ద్వారా చరిత్రాత్మకమైన ప్రభావం కలుగజేసినా, ఏ వ్యవస్థనుండి సోషలిజం ఉద్భవించిందో ఆ పాత వ్యవస్థ ముద్ర దానిపైన యింకా వుంది. కమ్యూనిజం యింతకన్నా ఉన్నతమూ, పరిపూర్ణమూ

అయిన సాంఘిక జీవిత దశ. సోషలిస్టు వ్యవస్థ సంపూర్ణంగా పటిష్ఠవంతమైన తరువాతనే కమ్యూనిస్టు వ్యవస్థ అభివృద్ధి కాగలదు. పెట్టుబడిదారీ వ్యవస్థ అవశేషాలన్నీ కమ్యూనిజంలో పూర్తిగా నిర్మూలింప బడుతాయి.

కమ్యూనిజం దాని స్వంత పునాదుల పైననే అభివృద్ధి చెందుతుంది. దాని నిర్మాణ విధాన ప్రత్యేక లక్షణాలకు కారణమిదే. పెట్టుబడిదారీ విధానం నుంచి సోషలిస్టు వ్యవస్థకు జరిగే పరివర్తన, వర్గ పోరాటాలున్న పరిస్థితిలో కొనసాగుతుంది. సాంఘిక సంబంధాలను పూర్తిగా బద్దలు కొట్టడం, అంతటినీ ముంచెత్తే ఒక సాంఘిక విప్లవం, శ్రామిక వర్గ నియంతృత్వ స్థాపన—ఇందులో యిమిడి వున్నాయి. కమ్యూనిస్టు వ్యవస్థకు జరిగే పరివర్తన ఇందుకు విరుద్ధం. దోపిడీ వర్గాలేవీ లేని పరిస్థితుల్లో, సమాజంలోని ప్రతి ఒక్కరికీ, అంటే కార్మికులకూ, రైతులకూ, మేధావులకు కమ్యూనిస్టు వ్యవస్థా స్థాపన లాభదాయకమైన పరిస్థితుల్లో, వారు దానికై చైతన్యంతో కృషిచేసే పరిస్థితుల్లో ఈ పరివర్తన కొనసాగుతుంది.

కాబట్టి, అత్యంత ప్రజాస్వామిక పద్ధతులద్వారా, సాంఘిక సంబంధాలను మెరుగుపరచి, అభివృద్ధి చేయటంద్వారా, కమ్యూనిస్టు వ్యవస్థను నిర్మించడం సహజమే. జీవితరంగంలోని పాత రూపాలు అదృశ్యమై, నూతన రూపాలు అవతరిస్తాయి. ఈ నూతన రూపాలు ఒకదానితో ఒకటి పెనవేసుకొని వుంటాయి—ఒకదాని ప్రభావం మరొకదానిపై పడుతూ వుంటుంది. దేశం లోపల వర్గపోరాటం వల్ల రేకెత్తే కష్టనష్టాలకు సమాజం గురికాదు. వీటన్నిటి కారణంగా, కమ్యూనిస్టు వ్యవస్థకు పరివర్తన చెందే కాలంలో సామాజికాభివృద్ధి మరింత త్వరితగతితో సాగుతుంది.

ముసాయిదా కార్యక్రమానికి గల చారిత్రక పరిమితి 20 సంవత్సరాలు. ఈ గడవును ఎందుకు నిర్ణయించాము? కర్తవ్య నిర్వహణకు నిర్ణయించిన ఈ వ్యవధి చాలా ఎక్కువ కాదా అని ముసాయిదా కార్యక్రమాన్ని చర్చించిన సందర్భంలో కొంత మంది కామ్రేడ్స్ శంకించారు. లేదు కామ్రేడ్స్, కమ్యూనిస్టు వ్యవస్థా సూత్రాల కనుగుణంగా సమాజాన్ని ఆయ

త్త పంచాలంటే, ఉత్పాదక శక్తులను అపారంగా అభివృద్ధి చేయవలసి వుంటుంది; భౌతిక, ఆత్మిక విలువలను పుష్కలంగా పెంపొందించవలసి వుంటుంది. మరి, దానికి కొంతకాలం పడుతుంది. కమ్యూనిజం అనే పాత్ర సర్వదా పుష్కలంగా వుండవలసిన పాత్ర. దాన్ని నింపడానికి ప్రతి ఒకరూ తన శక్త్యానుసారం తోడ్పడాలి, ప్రతి ఒకరు అందులో నుండి తీసుకోవాలి.

కమ్యూనిస్టు వ్యవస్థను స్థాపించేందుకు తగిన పరిస్థితులు పరిపక్వం కాక ముందే దాన్ని స్థాపించేందుకు నిర్ణయించడం చాలా ప్రమాదకరం. పాత్ర యింకా నిండక ముందే కమ్యూనిజాన్ని ప్రవేశపెడుతున్నామని మనం ప్రకటిస్తే, మన అవసరాలనుబట్టి మనం దానిలోనుండి తీసుకోలేము. అటువంటప్పుడు కమ్యూనిజాన్ని గురించిన భావాలనే మనం అప్రతిష్ఠపాలు చేసినవారం మవుతాము. శ్రామిక ప్రజల చొరవను విచ్ఛిన్నంచేసి, కమ్యూనిజం వైపుకు సాగే పురోగతిని అరికట్టినవార మవుతాము. కాబట్టి కేవలం శాస్త్రీయమైన అంచనాలనే మనం ఆధారంగా చేసుకొంటాము. 20 సంవత్సరాలలో మనం స్థూలంగా కమ్యూనిస్టు వ్యవస్థను నిర్మించ గలమని యీ అంచనాలు సూచిస్తున్నాయి.

స్థూలంగా కమ్యూనిస్టు వ్యవస్థను నిర్మించడమంటే అర్థమేమి? దాని అర్థమిది:

ఆర్థిక రంగంలో, కమ్యూనిస్టు వ్యవస్థ భౌతిక, సాంకేతిక ప్రాతిపదిక నిర్మింప బడుతుంది. ప్రపంచంలోకెల్లా ఎక్కువ అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాల ఆర్థిక స్థాయిని సోవియట్ యూనియన్ అధిగమించుతుంది. తలసరి ఉత్పత్తిలో సోవియట్ యూనియన్ ప్రథమ స్థానం అలంకరిస్తుంది. ప్రపంచంలోకెల్లా ఉన్నతమైన జీవన స్థాయిని అందుకొంటాము. భౌతిక, సాంస్కృతిక విలువల సమృద్ధిని సాధించడానికి అవసరమయిన పరిస్థితులన్నీ ఏర్పడుతాయి;

సాంఘిక సంబంధాల విషయంలో, వర్గాల మధ్య నేటికీ వున్న

భేదాలు తొలగింపబడుతాయి. వర్గాలు లీనమై కమ్యూనిస్టు శ్రామిక ప్రజలవర్గ రహిత సమాజం ఏర్పడుతుంది. పట్టణ, గ్రామసీమల మధ్య, తరువాత శారీరక మేధశ్రమల మధ్య గల ముఖ్యమైన భేదాలు నిర్మూలన మవుతాయి. వివిధ జాతుల మధ్య ఆర్థిక సిద్ధాంత రంగాలలో ఇతోధిక సమైక్యతా భావం నెలకొంటుంది. కమ్యూనిస్టు సమాజానికి చెందిన వ్యక్తి, సైద్ధాంతిక పటిష్టత, విస్తృత విద్య, నైతిక విశుద్ధత, శారీరక సౌష్టవం ఉచిత రీతిని సమన్వయతతో అభివృద్ధి చెందుతాడు.

రాజకీయ రంగంలో పౌర వ్యవహారాల నిర్వహణలో పౌరులందరూ పాల్గొంటారు. సోషలిస్టు ప్రజాస్వామ్యం అత్యంత విస్తృతంగా అభివృద్ధి పరచడం ద్వారా, కమ్యూనిస్టు స్వపరిపాలనా సూత్రాలను పూర్తిగా అమలుజరిపేందుకై సమాజం సన్నద్ధమవుతుంది.

# III

# సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ నుండి కమ్యూనిస్టు ఆర్థిక వ్యవస్థకు

## 1. కమ్యూనిజానికి భౌతిక, సాంకేతిక ప్రాతిపదిక సంస్థాపన

కామ్రేడ్స్, ఇదివరకు కనీ వినీ ఎరుగనంతటి బలవత్తరమైన ఉత్పత్తి శక్తులను మన దేశంలో నిర్మించడానికీ, ప్రపంచంలో అగ్ర పారిశ్రామిక దేశంగా సోవియట్ యూనియన్‌ను అభివృద్ధి చేయడానికీ ముసాయిదా కార్యక్రమం ఒక మహోజ్జ్వల పథాన్ని నిర్దేశిస్తున్నది. "ఆర్థిక ప్రాతిపదిక ఏర్పడినప్పుడే కమ్యూనిజానికి సార్థకత ఏర్పడుతుంది" అన్నారు వి.ఐ. లెనిన్. ముసాయిదా కార్యక్రమం ఈ ఆర్థిక ప్రాతిపదికను ఏర్పరుస్తున్నది.

సోవియట్ యూనియన్‌లో రెండు దశాబ్దాలలో కమ్యూనిజానికి భౌతిక, సాంకేతిక ప్రాతిపదికను నిర్మిస్తాము. ఇదే ఆర్థిక రంగంలో ప్రధాన కర్తవ్యమూ, మన పార్టీ అనుసరించవలసిన విధానానికి మూలాధారమూ.

ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో నిర్వహించవలసిన కర్తవ్య పరంపరలో కమ్యూనిజాని కవసరమయిన భౌతిక, సాంకేతిక ప్రాతిపదిక నిర్మాణం అత్యంత ప్రధానాంశం. దీనికి ప్రాధాన్యత దేశ ఆంత

రంగిక, బాహిర పరిస్థితులవల్ల ఏర్పడుతున్నది. దీనిద్వారా అతి ముఖ్యమైన క్రింది కర్తవ్యాలను నెరవేర్చగలం.

ఒకటి: ఇదివరకు కనీ వినీ ఎరుగనంత బలవత్తరమైన ఉత్పత్తి శక్తులను నిర్మించడం, జనాభా తలసరి ఉత్పత్తిలో ప్రపంచంలో ప్రథమ స్థాన మందుకోవడం;

రెండు: కార్మికుల ఉత్పాదక శక్తిలో ప్రపంచంలోని అన్ని దేశాలనూ మించిపోవడం. తుదకు, ఇదే అన్నిటికన్నా ప్రధానమైన విషయం. నూతన సాంఘిక వ్యవస్థ విజయానికి, సోవియట్ ప్రజల సాంకేతిక నైపుణ్యం అత్యున్నత స్థాయినందుకొనేలా జేయడానికి, శ్రమను ఆనందోత్తేజ దాయకంగా, సృజనాత్మక కృషిగా మార్చడానికీ ఇది అత్యంతావసరం.

మూడు: సోవియట్ ప్రజల సర్వావసరాలను తీర్చగలగేలా భౌతిక వస్తూత్పత్తిని పెంపొందించడం, ప్రజలంతా అత్యున్నత జీవన స్థాయినందుకొనేలా చేయడం, అవసరాలనుబట్టి వినిమయం జరిగే తుది దశకు మారడానికి అనుగుణమైన అన్ని పరిస్థితులు సృష్టించడం;

నాలుగు: సోషలిస్టు ఉత్పత్తి సంబంధాలను క్రమంగా కమ్యూనిస్టు ఉత్పత్తి సంబంధాలుగా మార్చడం, వర్గరహిత సమాజాన్ని నిర్మించడం, పట్టణ, గ్రామీణ ప్రాంతాల మధ్య గల ప్రధాన వ్యత్యాసాలనూ, తరువాత మేధశ్శ్రమకూ కాయకష్టానికీ మధ్యగల వ్యత్యాసాలకూ నిర్మూలించడం.

తుది విషయం (అంతమాత్రాన ఇది తక్కువదని కాదు): కమ్యూనిస్టు వ్యవస్థకు అవసరమయిన భౌతిక, సాంకేతిక ప్రాతిపదికను నిర్మించడం ద్వారానే మనం పెట్టుబడిదారీ విధానంతో ఆర్థిక పోటీలో నెగ్గగలం; సోవియట్ యూనియన్ పైన, మొత్తం సోషలిస్టు శిబిరం పైన కత్తి దూయడానికి సాహసించే ఏ దురాక్రమణ దారుడైనా అణచివేయగల స్థాయిలో రక్షణ బలాన్ని ఉంచగలం.

కమ్యూనిజాని కవసరమయిన భౌతిక, సాంకేతిక ప్రాతిపదికను

రెండు దశాబ్దాలలో నిర్మించడానికి కావలసినవన్నీ మనకున్నాయా? ఉన్నాయి కామ్రేడ్స్. మనకు బ్రహ్మాండమైన సృజనాత్మక శక్తి గల సాంఘిక వ్యవస్థ వుంది; అపారమైన ఉత్పాదక శక్తులున్నాయి; అక్షయమైన సహజ వనరులున్నాయి. అగ్రశ్రేణికి చెందిన సాంకేతిక నైపుణ్యం, ప్రపంచంలోకెల్లా అత్యంతాభివృద్ధి చెందిన విజ్ఞాన శాస్త్రం మనకున్నాయి. కమ్యూనిస్టు వ్యవస్థా నిర్మాణ కర్తవ్యాలు నిర్వహించడానికి అర్హతలు గల అద్భుతమైన సిబ్బందిని సోవియట్ యూనియన్ తయారు చేసింది. విజ్ఞత గలిగి, పోరాటాలలో రాటుదేలిన పార్టీ సోవియట్ ప్రజలకు నాయకత్వం వహిస్తున్నది.

కమ్యూనిస్టు వ్యవస్థకు అవసరమయిన భౌతిక, సాంకేతిక ప్రాతి పదికను నిర్మించాలంటే, సహజంగా అపారమయిన ధనం కావాలి. సోవియట్ యూనియన్ జాతీయ ఆర్థిక వ్యవస్థలో వచ్చే 20 సంవత్సరాలలో, సుమారు రెండు లక్షల కోట్ల రూబుళ్ళ కేపిటల్ పెట్టుబడులను పెట్టవలసి వస్తుందని అంచనా. మన కాపిటల్ నిర్మాణం ఎంత పెద్ద ఎత్తున సాగింప దలిచామో ఆలోచించుకోండి కామ్రేడ్స్! లక్షల కోట్లలో లెక్క వేయ వలసి వస్తున్నది!

ఇంత పెద్ద ఎత్తున వనరులను సమీకరించడంవల్ల, దేశ పారి శ్రామికీకరణ కాలంలోలాగా, ప్రజలు త్యాగాలకు సిద్ధం కావలసి వస్తుందా? కానవసరం లేదని చెప్పడానికి ఎన్ని కారణాలు కావాలో అన్నీ వున్నాయి. ఎందుకంటే, ముఖ్యంగా మన దేశంలో, మహా శక్తివంతమయిన పారి శ్రామిక వ్యవస్థ నిర్మించబడివుంది.

ప్రజల సంక్షేమాభివృద్ధిలోనూ, పెట్టుబడి సేకరణ సమస్యను పరిష్కరించడంలోను భారీ పరిశ్రమలు నిర్వహించే పాత్ర ఒక కొత్త రూపంలో ప్రదర్శిత మవుతున్నది. భారీ పరిశ్రమలంటే రెండు రకాలయిన యంత్రాలని మనకు తెలుసు—ఒకటి, ఉత్పత్తి సాధనాలను తయారు

చేసే పరిశ్రమలకై ఉత్పత్తి సాధనాలను తయారు చేసేవి; రెండు, లఘు పరిశ్రమలకు, ఆహార పరిశ్రమలకు, వ్యవసాయ, గృహ నిర్మాణాలకు, సాంస్కృతిక, ప్రజా సేవా కార్యకలాపాలకు అవసరమయిన ఉత్పత్తి సాధనాలను తయారు చేసే యంత్రాలు. మన భారీ పరిశ్రమలు నిర్మింప బడుతూ వుండినప్పుడు, మొదటి రకానికి చెందిన యంత్రాల నిర్మాణానికే మన వనరులను ప్రధానంగా వినియోగించి, రెండవ రకానికి చెందిన యంత్ర సందోహంపై పెట్టుబడులను పరిమితం చేయవలసి వచ్చింది. ఇప్పుడు రెండవ తరగతికి చెందిన యంత్రాలపై సైతం యెక్కువగా మన కేపిటల్ పెట్టుబడులను పెంచగలుగుతున్నాము. ఇందువల్ల వినియోగ వస్తువుల ఉత్పత్తి రేట్లు హెచ్చుతాయి. 1960లో కన్నా 1980లో మొదటి తరగతి యంత్రాల ఉత్పత్తి సుమారుగా ఆరు రెట్లూ, రెండవ తరగతి యంత్రాలు 13 రెట్లూ పెరుగుతాయి. ఇంతే కాదు, మన భారీ పరిశ్రమలు సాంస్కృతిక గృహోపకరణ వస్తుజాలాన్ని, పెరుగుతోన్న గిరాకీకి తగి నట్లుగా, ఇతోధికంగా ఉత్పత్తి చేస్తాయి. భారీ పరిశ్రమలను అభివృద్ధి చేయటంలో, మనం లెనిన్ చేసిన క్రింది సూత్రీకరణను ఆధారంగా చేసు కొన్నాము.

"ఉత్పత్తి సాధనాలను...కేవలం వాటికోసమే తయారు చేయటం లేదు. వినియోగ వస్తువులను తయారు చేసే వివిధ పరిశ్రమల శాఖలలో యీ ఉత్పత్తి సాధనాల అవసరం అధికాధికం కావడం వల్లనే వీటిని తయారు చేస్తాము."

ఉత్పాదక సాధనాల ఉత్పత్తి రేట్లూ, వినియోగ వస్తువుల ఉత్పత్తి రేట్లూ దగ్గరదగ్గరకు వచ్చేలా చూడాలని 20 సంవత్సరాల జాతీయార్థికాభి వృద్ధి ప్రణాళిక నిర్దేశిస్తున్నది. 1929–1940 లో పరిశ్రమలో, ఉత్పాదక సాధనాల ఉత్పత్తి సాలు సగటు పెరుగుదల రేట్లు, వినియోగ వస్తువుల పెరుగుదల రేట్లకన్న సుమారు 70 శాతం ఎక్కువ. కాని 1961–80లో

ఈ రెంటి మధ్య తేడా ఇంచుమించు 20 శాతం మాత్రమే వుంటుంది.

భారీ పరిశ్రమలు విస్తృత పునరుత్పత్తిలో ఎల్లప్పుడూ అగ్రగామి పాత్ర నిర్వహిస్తూ వచ్చాయి; ఇకముందు కూడ నిర్వహిస్తాయి. వీటి అభివృద్ధికై ఇకముందు కూడ పార్టీ నిరంతరం శ్రద్ధ తీసుకొంటుంది. ఎందుకంటే భౌతిక, సాంకేతిక ప్రాతిపదిక నిర్మాణానికీ, సత్వర సాంకేతి కాభివృద్ధికీ భారీ పరిశ్రమల అత్యంతావసరమనీ, సోషలిస్టు దేశ రక్షణ శక్తిని పటిష్ఠం చేయడానికి ఇవి ప్రాతిపదిక అనీ పార్టీ భావిస్తున్నది. అదే సమయంలో వినియోగ వస్తూత్పత్తి కూడ క్రమక్రమంగా పెరిగేలా, భారీ పరిశ్రమల విషయంలో తీసుకోవలసిన చర్యలన్నీ తీసుకొంటుంది.

నిర్ణీత ప్రమాణంలో కేపిటల్ పెట్టుబడులు పెట్టగల శక్తి కూడా మనకుంది, ఎందుకంటే, సకల సామాజికోత్పత్తీ, జాతీయాదాయమూ సమధికంగా పెరుగుతాయి. మనం పురోగమించే కొద్దీ, పెట్టుబడి నిల్వలకై జాతీయాదాయంనుంచి కేటాయించే ప్రతిశతాంశం యొక్క పరిమాణం పెరుగుతూ వుంటుంది. ఫలితంగా కేపిటల్ పెట్టుబడులకై మనం కేటాయించగల నిధులు పెరుగుతూ వుంటాయి. మరొక ముఖ్యమయిన విషయం. సాంకేతిక నైపుణ్యాభివృద్ధి వల్లనూ, శ్రామికుల ఉత్పాదక శక్తి పెరుగుతూ వుండటం వల్లనూ, పెట్టుబడిలోని ప్రతి రూబుల్ ఉత్పత్తిని మరింత పెంచగలదు.

మన గతానుభవాన్ని బట్టీ, భవిష్యత్తును గూర్చి వాస్తవిక దృష్టితో మనం వేసిన అంచనాలను బట్టీ, ఏ స్థాయిలో ఉత్పత్తి చేయాలో ప్రణాళికలు వేయగలుగుతున్నాము; కమ్యూనిజానికి అవసరమైన భౌతిక, సాంకేతిక ప్రాతిపతిక నిర్మాణానికి కాలపరిమితులను గురించి మాట్లాడ గలుగుతున్నాము, నిర్దిష్టంగా అంకెలు ఇవ్వగలుగుతున్నాము. మన ప్రణాళికా సంస్థలు వేసిన కొన్ని అంచనాలిస్తున్నాను :

## 1960-80లో సోవియట్ పరిశ్రమల అభివృద్ధి

(1955 జూలై 1న వున్న ధరల ప్రాతిపదికపై)

| | 1960 | 1970 | 1980 | ఉత్పత్తి ఎన్నిరెట్లు 1960 కంటె 1980లో పెరిగేది |
|---|---|---|---|---|
| ఫాక్టరీ టోకు ధరలనుబట్టి మొత్తం పారిశ్రామికోత్పత్తి (వందకోట్ల రూబుళ్ళలో) | 155 | 408 | 970–1000 | **6.2–6.4** |
| పై ఉత్పత్తిలో చేరినవి : | | | | |
| ఉత్పాదక సాధనాల ఉత్పత్తి—గ్రూపు "ఏ" (వంద కోట్ల రూబుళ్ళలో) | 105 | 287 | 720–740 | 6.8–7.0 |
| వినియోగ సరుకుల ఉత్పత్తి—గ్రూపు "బి" (వంద కోట్ల రూబుళ్ళలో) | 50 | 121 | 250–260 | 5–5.2 |
| విద్యుచ్ఛక్తి (వంద కోట్ల కిలోవాట్ గంటలలో) | 292.3 | 900–1000 | 2700–3000 | 9.2–10.3 |
| ఉక్కు (పదిలక్షల టన్నుల్లో) | 65 | 145 | 250 | 3.8 |
| నూనె (పదిలక్షల టన్నుల్లో) | 148 | 390 | 690–710 | 4.7–4.8 |
| గ్యాసు (వంద కోట్ల క్యూబిక్ మీటర్లలో) | 47 | 310–325 | 680–720 | 14.4–15.2 |
| బొగ్గు (పదిలక్షల టన్నుల్లో) | 513 | 686–700 | 1180–1200 | 2.3–2.34 |
| ఇంజనీరింగ్, లోహకారక పరిశ్రమల ఉత్పత్తి (వంద కోట్ల రూబుళ్ళలో) | 34 | 115 | 334–375 | 9.8–11 |
| ఖనిజపు ఎరువులు సాంప్రదాయకమైన యూనిట్లలో (పదిలక్షల టన్నుల్లో) | 13.9 | 77 | 125–135 | 9–9.7 |

| | 1960 | 1970 | 1980 | ఉత్పత్తి ఎన్ని రెట్లు 1960 కంటె 1980లో పెరిగేది |
|---|---|---|---|---|
| సింథెటిక్ తారులు, ప్లాస్టిక్ సరకులు (వేల టన్నుల్లో) | 332 | 5,300 | 1,900_21,000 | 57_63 |
| కృత్రిమపు నూలు, సింథెటిక్ నూలు (వేల టన్నుల్లో) | 211 | 1,350 | 3,100_3,300 | 14.7_15.6 |
| సిమెంటు (10 లక్షల టన్నుల్లో) | 45.5 | 122 | 233_235 | 5.1_5.2 |
| వస్త్రాలు (వంద కోట్ల చదరపు మీటర్లలో) | 6.6 | 13.6 | 20_22 | 3_3.3 |
| తోలుతో చేసిన జోళ్ళు (పది లక్షల జతలు) | 419 | 825 | 900_1,000 | 2.1_2.4 |
| సంసార, గృహవస్తువులు ఇదితర పారిశ్రామిక సరకులు (వంద కోట్ల రూబుళ్ళలో) | 5.9 | 18 | 58_60 | 9.8_10.1 |

సమాజం ఉత్పత్తిచేసే మొత్తం వస్తువులు సామాజికోత్పత్తిలోని అన్ని శాఖలకు ఒక అత్యంత సాధారణ సూచిక. దీన్ని వచ్చే 20 సంవత్సరాలలో సుమారు అయిదింతలు హెచ్చించడానికి పథకాలు వేశారు. పారిశ్రామికోత్పత్తి ఆరు రెట్లకు తక్కువకాకుండా పెరుగుతుంది. మొత్తం వ్యావసాయకోత్పత్తి ఇంచుమించు 3.5 రెట్లు పెరుగుతుంది. అంటే, సౌభాగ్యవంతమయిన మన భూభాగంపై నేటి సోవియట్ యూనియన్ లాంటి పారిశ్రామిక దేశాలు మరి అయిదూ, వ్యావసాయక దేశాలు రెండింటికి పైగా సృష్టించబోతున్నామన్న మాట.

ప్రస్తుతం సోషలిస్టేతర ప్రపంచం అంతటిలో ఎంత ఉత్పత్తి అవుతున్నదో దానికి ఇంచుమించు రెండు రెట్లు, ప్రతి ఏడూ సోవి

యుటీ పరిశ్రమలు 20 సంవత్సరాలలో ఉత్పత్తి చేస్తాయి.

వచ్చే 20 సంవత్సరాలలో, మన పారిశ్రామిక రంగంలో ఉత్పాదక సాధనాల ఉత్పత్తి సుమారు ఏడు రెట్లు పెరుగుతుంది. మన దేశంలో మూల ఉత్పత్తి సంబంధించిన ఆస్తులు నేటికన్న ఐదు రెట్లు పెరుగుతాయి. అంటే, మన పరిశ్రమలన్నింటిలోనూ అత్యాధునికమైన కొత్త యంత్రాలను అమర్చనున్నామన్న మాట. సోవియట్ యూనియన్‌లోని ఉత్పత్తి యంత్రాంగం ప్రపంచంలోకెల్లా శక్తివంతమైనదీ, నూతనమైనదీ, అత్యాధునికమైనదీ అవుతుంది. నూతనోత్పత్తికి అవసరమయిన నిధులను సంపాదించడం క్రమక్రమంగా జరిగే పరిణామం. కాబట్టి, ప్రస్తుతం పనిచేస్తున్న అన్ని ఉత్పత్తి సాధనాలనూ, మనకుగల సాంకేతిక శాస్త్ర పరిజ్ఞానమంతటినీ, అత్యంతోపయోగకరమైన పద్ధతిలో వినియోగించడమూ, వాటి సామర్థ్యాన్ని అత్యధికంగా పెంచడమూ అవసరం.

సోవియట్ ఆర్థిక వ్యవస్థ శరవేగంతో అభివృద్ధి అవుటూ వుంటుంది. వచ్చే 20 సంవత్సరాలలో, మన పారిశ్రామికోత్పత్తి సంవత్సరానికి సగటున 9–10 శాతానికి తక్కువ కాకుండా పెరుగుతుంది. అంటే, ఇప్పటిలాగానే ఇక ముందు కూడా మన ఆర్థికాభివృద్ధి రేట్లు పెట్టుబడిదారీ దేశాల్లో కన్న చాలా ఎక్కువగా వుంటాయి.

కమ్యూనిజానికి అవసరమయిన భౌతిక, సాంకేతిక ప్రాతిపదిక నిర్మాణంలో ప్రధానధోరణులను సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ ముసాయిదా కార్యక్రమం సూచిస్తున్నది.

కమ్యూనిజానికి అవసరమయిన భౌతిక, సాంకేతిక ప్రాతిపదిక నిర్మించడమంటే, సాంకేతిక పరిజ్ఞానంలోనూ, సామర్థ్యంలోనూ, ఉత్పత్తి వ్యవస్థీకరణలోనూ ఒక నూతన స్థాయిని అందుకోవడమన్న మాట; ఉత్పత్తి కేంద్రీకరణ, వివిధ విషయాలలో ప్రత్యేక పరిజ్ఞాన సంపాదన, వివిధశాఖల మధ్య సహకారం, సమ్మేళనం—ఇవన్నీ క్రమక్రమంగా పెంపొందడమన్న మాట. శాస్త్రీయ విజ్ఞానం రాను రాను ప్రత్యక్ష ఉత్పత్తి శక్తిగా రూపొందు

తున్నది. ఉత్పత్తి, ఆధునిక శాస్త్రీయ విజ్ఞానాన్ని సాంకేతిక రంగానికి అన్వయించే విధానంగా రూపొందుతున్నది. లెనిన్ పలుమార్లు నొక్కి చెప్పినట్లు, ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం లేకుండా, శాస్త్రీయ రంగంలో కొత్త విషయాలను కనిపెట్టకుండా, కమ్యూనిజాన్ని ఎన్నటికీ నిర్మించ లేము.

మార్క్స్ మాటల్లో, ఏ కొత్త పనిముట్లు కమ్యూనిస్టు ఉత్పత్తికి జీవగర్ర? సమగ్ర యాంత్రీకీకరణకూ, స్వయంచోదిత యంత్ర వ్యవస్థకు వినియోగించే యంత్రాలే ఈ పనిముట్లు. కమ్యూనిస్టు నిర్మాణ పరిస్థితులలో స్వయంచలనంతో సాంకేతిక విజ్ఞానాభివృద్ధిలో ఒక నూతన శకం ప్రారంభమవుతుంది. రసాయనిక వస్తుజాలాన్నీ, అత్యంతోపయోగకరమయిన కొత్త సామగ్రినీ, అభివృద్ధిచేసి, వాటిని వినియోగించడం; నూతనమైన శ్రామిక లక్ష్యాలూ; విస్తృతంగా రసాయనిక పద్ధతులను అమలు జరపడం ఉత్పత్తి రంగంలో రాను రాను ఎక్కువవుతుంది. లోహాలు మొదలగు వస్తువుల మన్నికనూ, నాణ్యాన్ని, ముఖ్యంగా చాలా ఎక్కువ ఒత్తిడికి, ఉష్ణోగ్రతకు, వేగానికి తట్టుకొన వలసిన వస్తువుల మన్నికను, నాణ్యతను పెంచవలసిన అవసరం చాలా వుంది. సుదూర భవిష్యత్తు దృష్ట్యా, భూగర్భాన్ని ఇంకా లోతుకు తవ్వడం ద్వారానూ, ప్రపంచంలోని పెద్ద జలసాగరాలలోని జీవరాసిని, ఖనిజ వనరులను వినియోగించడం ద్వారానూ, మన ముడిపదార్థాల ఆధారాలను బాగా పెంపొందించు కొంటాము.

యావద్దేశ విద్యుదీకరణ ఎంత ప్రధానమయినదో ముసాయిదా కార్యక్రమం తెలియజేస్తున్నది. "సోవియట్ వ్యవస్థ ప్రాతిపదికపై విద్యుదీకరణ జరిగితే, కమ్యూనిజానికి అవసరమయిన పునాదుల నిర్మాణంలో తుది విజయం సాధించినట్లే" అని లెనిన్ అన్నారు. కమ్యూనిస్టు ఆర్థిక నిర్మాణ కార్యక్రమాని కంతటికీ, సంపూర్ణ విద్యుదీకరణ అనే లెనిన్ భావం మూల సూత్రం.

దేశ ఆర్థిక వ్యవస్థ అభివృద్ధికై లెనిన్ ప్రప్రథమంగా ఒక సమగ్ర

ప్రణాళికను సమర్పించారు. దానికే గొయెల్రో ప్రణాళిక అని పేరు. దీన్ని పార్టీ ద్వితీయ కార్యక్రమమని లెనిన్ అభివర్ణించారు. విద్యుచ్ఛక్తి ఉత్పత్తిని ఏడాదికి 880 కోట్ల కిలోవాట్ల గంటలకు పెంచాలనేది యీ ప్రణాళిక లక్ష్యం. దీన్ని అమలు జరపడం నిర్ణీత కాలం కన్న ముందే పూర్తి అయింది. విద్యుచ్ఛక్తి ఉత్పత్తి విషయంలో మన దేశం 1947వ సంవత్సరం నాటికే యూరోపు ఖండంలో ప్రథమ స్థానాన్నీ, ప్రపంచంలో ద్వితీయ స్థానాన్నీ అందుకొన్నది.

1960లో మన విద్యుదుత్పాదక కేంద్రాలు మొత్తంగా 66,700,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తిచేశాయి.

శక్తి ఉత్పత్తికి నూతన ఆధారాలూ, నూతన ఉత్పాదక మార్గాలూ, మనకు కరతలామలకం అవుతున్నాయి. ఇతర రూపాలలో వున్న శక్తిని నేరుగా విద్యుచ్ఛక్తిగా మార్చే సమస్యను పరిష్కరించటం, విద్యుదుత్పాదక యంత్రాల నిపుణతను బాగా పెంపొందించటం చాలా ముఖ్యం.

మన కార్యక్రమ నిర్వహణలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి ఎంతో ప్రాధాన్యత వుంది. విద్యుచ్ఛక్తి ఉత్పత్తిని 1980లో 270000-300000 కోట్ల కి.వా.గం.లకు, అంటే 1960లో కన్నా తొమ్మిది పదింతలు పెంచాలని మన లక్ష్యం.

నేడు మిగతా దేశాలన్నీ కలిసి ఉత్పత్తి చేసే విద్యుచ్ఛక్తికన్న యించుమించుగా 50 శాతం ఎక్కువ విద్యుచ్ఛక్తిని మనం 1980లో ఉత్పత్తిచేస్తాము. ఫలితంగా పరిశ్రమల నిర్వహణకై యిప్పటికన్నా పని ముట్లు, తొమ్మిది రెట్లు ఎక్కువ విద్యుచ్ఛక్తిని సరఫరా చేయగలము.

అప్పటికి, విద్యుచ్ఛక్తి ఉత్పత్తిలోనేకాక, తల ఒక్కటింటికి ఉత్పత్తి అయ్యే కిలోవాట్ గంటలలో కూడా సోవియట్ దేశం అమెరికాను మించి పోగలదు.

విద్యుదుత్పత్తిలో వచ్చే పెరుగుదల మూలంగా రవాణాకు, వ్యవసాయానికీ, పట్టణ గ్రామీణ ప్రాంతాలలో ప్రజలక సమిష్టి సౌర్యాలకు పెద్ద

ఎత్తున విద్యుచ్ఛక్తి సరఫరా కాగలదు.

జాతీయ ఆర్థిక వ్యవస్థలోని అన్ని శాఖలను అభివృద్ధి చేయటం లోనూ, సాంకేతిక పురోగతికి దోహదం చేయటంలోనూ యావద్దేశ విద్యుదీకరణ, ఈ విధంగా కీలక పాత్ర వహిస్తుంది.

ఎంతటి మహోజ్జ్వలమైన అద్భుతావహమయిన ప్రణాళికలు కామ్రేడ్స్! వాస్తవంగా, మన భూమిపై కమ్యూనిస్టు వ్యవస్థా భానూదయం జరుగుతోంది!

ఈ నిర్మాణ పథకాలను గట్టిగా అమలుజరపాలనే కృతనిశ్చయం పార్టీలోనూ ప్రజలలోనూ నెలకొని వుంది. దేశ సంపూర్ణ విద్యుదీకరణకు లెనిన్ రూపొందించిన కార్యక్రమం, ఇందువల్ల తప్పకుండా నెరవేర్చ గలదు.

ప్రధానమయిన థర్మల్, జల విద్యుత్ కేంద్రాల నిర్మాణానికి తాత్కాలిక పథకాన్ని మన ప్రణాళికా సంస్థలు తయారుచేశాయి. ఒక్కొక్క కేంద్రానికీ సంబంధించిన వివరాలన్నీ తీసుకొని, ఈ పథకాన్ని కూలంకషంగా చర్చించవలసివుంది. సాంకేతిక రంగంలో ఇతోధికాభివృద్ధి సాధించటంలో, ఈ పథకంలో అనేకమైన మార్పులు చేయవలసిరావచ్చు.

వచ్చే 20 సంవత్సరాలలో మనం బ్రహ్మాండమైన 180 జల విద్యుత్ కేంద్రాలనూ, ఒక్కొక్కటి 30 లక్షల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేసే సుమారు 200 జిల్లా విద్యుదుత్పాదక కేంద్రాలనూ, 260 పెద్ద ఉష్ణ-విద్యుచ్ఛక్తి కేంద్రాలనూ నిర్మించనున్నాము.

తూర్పు సైబీరియాలో బ్రాట్స్క్, క్రాస్నొయార్స్క్ జల విద్యుత్ కేంద్రాలను పూర్తిచేస్తాము. అంగారా, ఎనిసీలపై, సయాన్, ఉస్త్-ఇలిం, బొగుచన్, ఎనిసీస్క్, ఒసినొవ్కా విద్యుత్ కేంద్రాలకంటె పెద్ద విద్యుత్ కేంద్రాలను మరికొన్నింటినీ, దిగువ తుంగుస్కాపై ఒక విద్యుత్ కేంద్రాన్నీ 1980 పథకం నాటికి నిర్మించాలని తలపెట్టాము. ఈ కేంద్రాలలో ప్రతి ఒకటి 40 లక్షల కిలోవాట్లకు మించి విద్యుచ్ఛక్తి ఉత్పత్తిచేస్తుంది. వీటి

తోడు, ఇక్కడ చాలా సమర్థవంతమూ, శక్తివంతమూ అయిన రెండు థర్మల్ కేంద్ర సమూహాలను నిర్మిస్తాము—క్రాస్నొయార్క్స్ సమీపంలో నిర్మించే ఇటాట్-బొగొటోల్ సమూహమొకటి; రెండవది కాన్స్క్-టైషెట్ ప్రాంతంలో నిర్మించే ఇర్షా-బొరోడినో సమూహము. (ఇందులో ప్రతి ఒకటి 30 లక్షల కిలోవాట్లూ, దానికి మించీ విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేస్తుంది) ఈ కేంద్రాలకు అవసరమయిన బొగ్గు కాన్స్క్-అచిన్స్క్ లోయనుండి సరఫరా అవుతుంది.

విద్యుచ్ఛక్తి సరఫరాకూ, నీటి పారుదలకూ ఉపయోగపడే ముఖ్యమైన పెద్ద పెద్ద జల విద్యుత్కేంద్రాలు మధ్య ఆసియాలో నిర్మింపబడుతాయి. వీటిలో వాఖ్ష్ నదిపై నిర్మించే న్యూరెక్, రోగున్ కేంద్రాలూ, నారిన్‌పై నిర్మించే టోక్‌టోగుల్, కాగుస్తారుస్స కేంద్రాలూ చేరివున్నాయి. కజకస్తాన్‌లో ఇర్టిష్ విద్యుదుత్పాదక కేంద్ర సమూహంతోపాటు అనేక పెద్ద విద్యుచ్ఛక్తి కేంద్రాలను నిర్మించనున్నాము.

సారటోవ్, దిగువ వోల్గా, చెబొక్సరీ జలవిద్యుత్ కేంద్రాలను, కామా నదిపై రెండు విద్యుత్ కేంద్రాలను నిర్మించటంతో వోల్గా-కామా జలవిద్యుత్ కేంద్ర శ్రేణి పూర్తి అవుతుంది. ఓబ్ నది దిగువ భాగంలో అరవై లక్షల కిలోవాట్ల విద్యుత్తు ఉత్పత్తి చేసే జల విద్యుత్ కేంద్రాన్ని నిర్మించనున్నాము. ఇది దేశంలోని యూరోపు ఖండానికి చెందిన భాగానికంతటికీ గల గ్రిడ్‌కు విద్యుచ్ఛక్తి సరఫరా చేయగలదు. దీనికితోడు, సారటోవ్, వోల్గోగ్రాడ్, గోర్కీలవద్ద కుయిబిషెవ్-ఉఫా-ఓరెన్‌బర్గ్ ప్రాంతంలో శక్తివంతమైన అనేక థర్మల్ విద్యుత్ కేంద్రాలను నిర్మించాలని తలపెట్టాము.

సోవియట్ యూనియన్‌లో యూరోపు ఖండ భూభాగంలోని మధ్య ప్రాంతాలలోనూ, మధ్య-చెర్నోజియాం ప్రాంతాలలోను, మాస్కోకు దక్షిణ, ఈశాన్య దిశలలోను, ఉక్రెయిన్‌లో కీవ్, కిరోవొగ్రాడ్, నికొలయేవ్‌లవద్దా, డొనెట్జ్ లోయలోనూ, లాట్వియా, బైలోరష్యాలలోనూ

మహాశక్తివంతమైన థర్మల్ కేంద్రాలు స్థాపితమవుతాయి. నీటివనరులను, తదితర శక్తిజనకములైన వనరులను వినియోగించి, కాకసస్‌లో విద్యుచ్ఛక్తి పరిశ్రమ అభివృద్ధి చేయబడుతుంది

ప్రణాళిక లక్ష్యం సాధించడం ద్వారా, బృహద్వోల్గా, బృహన్నీపర్ ప్రధాన సమస్య పరిష్కారం అవుతుంది. దీనికి సహజంగా, చాలా పెట్టుబడి అవసరం. అయితే, ఈ పెట్టుబడి మొత్తాలు, స్వల్ప కాలం లోనే మనం తిరిగి రాబట్టుకోగలం. వోల్గా-కామా, నీపర్ జల విద్యుత్ కేంద్రాల ద్వారా చౌకగా ఉత్పత్తి చేసే విద్యుచ్ఛక్తి దమారము రెండు రెట్లు పెరుగుతుందని అంచనాలను బట్టి తెలుస్తున్నది. వోల్గాకు తూర్పునా, దక్షిణాదిలోనూ వర్షపాతం చాలా తక్కువగావున్న 2 కోట్ల హెక్టర్లకు పైగా భూమికి నీటి పారుదల సౌకర్యాలు కలుగుతాయి; పొరస్యే ప్రాంతం లోను, బాల్టిక్ రిపబ్లిక్కులలోనూ 40 లక్షల హెక్టర్లకు పైగా బురద నేలల్ని సాగు కిందికి తీసుకురావడం సాధ్యమవుతుంది.

దేశంలోని వాయవ్య, తదితర ప్రాంతాలనుండీ, బాల్టిక్ సముద్ర తీరం నుండీ, మధ్యధరా సముద్రానికి నౌకలలో సరకులను రవాణా చేయాలంటే, ప్రస్తుతం జిబ్రాల్టర్ మీదుగా వెళ్ళాలి. కాని, పైకార్యక్రమం అమలు జరిపిన తరువాత, నల్ల సముద్ర తీరంలోని రేవుల మీదుగానే వెళ్ళవచ్చు. ఇదేవిధంగా దక్షిణ ప్రాంతాలలోని సరకులను డ్రెస్యత్, నీమెన్‌ల ద్వారా నీపర్‌పై బాల్టిక్ సముద్రానికి రవాణాచేయవచ్చు. మధ్యధరాసముద్ర ప్రాచ్య భాగానికి గల దూరం సుమారు సగం తగ్గుతుంది.

యంత్ర నిర్మాణం విస్తృతంగా అభివృద్ధి చేయడం పార్టీ కార్యక్రమ లక్ష్యాలలో ఒకటి. సంపూర్ణ యాంత్రీకరణకూ, స్వయం చోదక విధానాన్ని ప్రవేశ పెట్టడానికీ పథకాన్ని అమలు జరపడానికి ఇదొకటే మార్గం. చాలా తక్కువ ఖర్చుతో, చాలా సమర్ధవంతంగా పనిచేసే అనేక రకాల యంత్రాలను, పరికరాలను, సాధనాలను, స్వయంచోదిత మయిన రేడియో-ఎలక్ట్రానిక్ ఉపకరణాలను పెద్ద ఎత్తున

ఉత్పత్తి చేయవలసి వుంది. పరిశ్రమలకు, వ్యవసాయానికీ, గృహనిర్మాణానికీ శ్రేష్ఠమయిన యాంత్రిక వ్యవస్థను మనం నిర్మించవలసివుంది.

20 సంవత్సరాలలో, 2800 కొత్త ఇంజనీరింగు కర్మాగారాలను, లోహకారక కర్మాగారాలను, ప్రధానంగా తూర్పు ప్రాంతాలలో నిర్మిస్తాము; 1900 పాత వాటిని పునర్నిర్మిస్తాము. ఇందు మూలంగా, యంత్ర నిర్మాణ పరిశ్రమలోనూ, లోహకారక పరిశ్రమలోనూ మొత్తం ఉత్పత్తిని 10-11 రెట్లు పెంచగలము. ఇంతేకాదు. స్వయంచోదిత, అర్ధ స్వయంచోదిత శ్రేణుల ఉత్పత్తిని 60 రెట్లకు పైగా పెంచగలము.

రసాయనిక పరిశ్రమకు ప్రత్యేక ప్రాధాన్యం కలదు. 20 సంవత్సరాలలో ఈ పరిశ్రమలో ఉత్పత్తి సుమారు 17 రెట్లు పెరుగు తుంది. ఉత్పత్తి అయ్యే వస్తువైవిధ్యమూ హెచ్చుతుంది. పాలిమర్ రసాయనిక శాస్త్రం బాగా పురోగమిస్తుంది. సింథెటిక్ తారుల, ప్లాస్టిక్ వస్తువుల ఉత్పత్తి సుమారు 60 రెట్లు హెచ్చుతుంది. కృత్రిమపు నూలు, సింథెటిక్ నూలు ఉత్పత్తి సుమారు 15 రెట్లు ఎక్కువవుతుంది. ఈ నూలు వినియోగ వస్తుఉత్పత్తికి అతి ముఖ్యం. ఖనిజపు ఎరువులు 9-10 రెట్లు ఎక్కువ ఉత్పత్తి అవుతాయి.

భారీ పరిశ్రమలలో ఇంధన, లోహ పరిశ్రమల వంటి ముఖ్యమైన శాఖలకు ప్రణాళిక తగినంత ప్రాముఖ్య మిస్తున్నది. అన్ని రకాల ఇంధనాల ఉత్పత్తి రమారమి 4 రెట్లు పెరుగుతుంది. 20 ఏళ్ళలో గ్యాసు ఉత్పత్తి 14-15 రెట్లు పెంచవలసి వుంది. బొగ్గు ఉత్పత్తి 1960 లో 51.3 కోట్ల టన్నులుండగా, 1980 నాటికి 120 కోట్ల టన్నులకు పెరుగుతుంది. 1980 లో 69-71 కోట్ల టన్నుల నూనె ఉత్పత్తి అవుతుంది. 1960 లో సోవియట్ యూనియన్‌లో 14.8 కోట్ల టన్నులూ, అమెరికాలో 34.8 కోట్ల టన్నులు నూనె ఉత్పత్తి అయిందని తారతమ్య పరిశీలన కొరకు నేను తెలుపుతున్నాను.

మన ఇనుము ఉక్కు పరిశ్రమ ఏటా సుమారు 25 కోట్ల టన్నుల

ఉక్కు ఉత్పత్తి చేయనున్నది. 1960లో సోవియట్ యూనియన్‌లో 6.5 కోట్ల టన్నులూ, అమెరికాలో 9 కోట్ల టన్నులూ ఉక్కు ఉత్పత్తి అయింది. తొమ్మిది సంవత్సరాలలోనే సోవియట్ యూనియన్ అమెరికా ఇప్పటి ఉత్పత్తికన్నా సుమారు 5.5 కోట్ల టన్నులు ఎక్కువ ఉక్కు ఉత్పత్తి చేస్తుంది. ఇంతకన్నా ఎక్కువ స్థాయిలోనే ఉక్కు ఉత్పత్తి చేయగల మని ఆర్థికవేత్తల అంచనా. అయితే ప్రస్తుతానికి రమారమి 25 కోట్ల టన్నులనే మనం సాధించవలసిన లక్ష్యంగా నిర్ణయించుకొన్నాము. ఫెర్రస్ లోహాల స్థానే ఉపయోగించదగిన వస్తువులను సత్వరంగా అభివృద్ధి చేయడం, లోహాల నాణ్యతను పెంచడం, లోహాలను మరింతపొదుపుగా వాడటం, యంత్రాలు రూపొందించటంలోనూ, ఉత్పత్తి చేయటంలోనూ నూతన విజయాలు సాధించడం—వీటన్నిటి మూలంగా తక్కువ ఉక్కుతోనే పని సాగించే అవకాశ మేర్పడవచ్చు. ఆ పక్షంలో, లోహ పరిశ్రమాభివృద్ధికి సంబంధించిన ప్రణాళికలలో తగిన మార్పులు చేస్తాము.

విద్యుచ్ఛక్తి ఇంజనీరింగు, రసాయనిక శాస్త్రం, ఎలెక్ట్రానిక్స్, పరికరాల ఉత్పత్తి, అణు, అంతరిక్షాలకు సంబంధించిన ఇంజనీరింగు, మహా వేగంగా వెళ్ళే రవాణా సాధనాలు, నాన్-ఫెర్రస్ లోహాలు మొదలగు పారిశ్రామిక విభాగాలు సత్వరంగా అభివృద్ధి చెందుతున్నాయి. ఉత్పత్తి అయ్యే మొత్తం లోహంలో యిప్పటికన్నా ఎక్కువ భాగం వీటికి కేటాయించవలసి వుంటుంది. నాన్-ఫెర్రస్ మిశ్రమ లోహాలను, అపురూపమైన లోహాలను, అర్ధ-ఉష్ణ వాహక సామగ్రినీ, యిప్పటికన్నా ఎక్కువగా ఉత్పత్తి చేయవలసి వుంటుంది. అల్యూమినియం వాడకం విపరీతంగా పెరుగుతుంది.

గృహనిర్మాణ వస్తువుల పరిశ్రమను చాలా త్వరితగతిలో అభివృద్ధి చేయాలి. 1980లో సిమెంటు ఉత్పత్తి 23.5 కోట్ల టన్నులకు పెరుగుతుంది. అంటే 20 సంవత్సరాలలో సిమెంటు ఉత్పత్తి 400 శాతం పైగా హెచ్చుతుందన్న మాట.

వచ్చే 20 సంవత్సరాలలో, అన్ని వినియోగ సరకుల పరిశ్రమల ఉత్పత్తి రమారమి అయిదింతలు పెరుగుతుంది. ఉదాహరణకు, 1980 నాటికి వస్త్రాల ఉత్పత్తి మూడు రెట్లకు పైగా పెరుగుతుంది. అంటే, ఏటా 20_22 వందల కోట్ల చదరపు మీటర్ల వస్త్రాలు ఉత్పత్తి అవుతాయన్న మాట. ఏటా దాదాపు పంద కోట్ల చర్మపు జోళ్ళు తయారవుతాయి. సాంస్కృతిక రంగానికి సంబంధించిన వస్తువులకూ, గృహోపకరణాలకూ గిరాకీ విపరీతంగా పెరుగుతున్నది. వీటి ఉత్పత్తి పదింతలు పెరుగుతుంది.

ఇందువల్ల, లఘు, ఆహార పరిశ్రమల్లో కేపిటల్ పెట్టుబడులను మరింత త్వరత్వరగా, సమర్థవంతంగా వినియోగించడం అవసరం. వందల కొలదీ కొత్త ఫాక్టరీలను నిర్మించడం అవసరం. లోహ పరిశ్రమకు అవసరమయిన పరికరాల ఉత్పత్తి పట్ల మనం ఎంత శ్రద్ధ వహిస్తామో అంత శ్రద్ధా వినియోగ సరకుల పట్ల, గృహోపకరణాల పట్ల, సోవియట్ ప్రజల జీవితాన్ని మరింత సుఖప్రదంగా, ఆనందదాయకంగా చేసే వస్తువుల పట్ల చూపాలి.

కామ్రేడ్స్, కమ్యూనిస్టు ఉత్పత్తి స్థాయిని అందుకోవడానికి అన్నిటి కన్నా ముఖ్యంగా కార్మికుల ఉత్పాదక శక్తి పెరగడం అవసరమనే విషయాన్ని మనం మరువరాదు. సామాజిక శ్రమ యొక్క ఉత్పాదక శక్తి పెరుగుదల మన పురోగమనానికి ఒక కొలబద్ద. జీవన ప్రమాణాభివృద్ధికి మూలకందం. ఇంకే యితర మార్గమైనా వ్యర్థ ఆలోచన.

సమస్త వస్తువులు సమృద్ధిగా ఉండేలా ఉత్పత్తిని పెంచడమనే గురుతర కర్తవ్యాన్ని మనం నిర్వహించవలసి వుంది. పనిచేసేవారి సంఖ్య పెరుగుదల పరిమితంగా వున్నప్పుడు ఈ కర్తవ్యం ఎలా నెరవేర్చడం? వచ్చే 20 సంవత్సరాలలో యీ పెరుగుదల యించుమించు 40 శాతం వుంటుందని అంచనా; అందులో గణనీయమైన భాగం వస్తూత్పత్తికి సంబంధం లేని రంగాలకు, ముఖ్యంగా విద్య, ప్రజారోగ్య రంగాలకు కేటా

యించవలసి వుంటుంది. పైపెచ్చు పని గంటలను కూడా తగ్గించనున్నాము. ఈ సమస్యకు ఒకే పరిష్కార మార్గ ముంది. మన లక్ష్య సిద్ధికి అనుగుణంగా శ్రామికుల ఉత్పాదక శక్తిని పెంచాలి. 1961-80 మధ్య కాలంలో పెరిగే జాతీయాదాయంలో పదింట తొమ్మిది పాళ్ళకు పైగా, శ్రామికుల ఉత్పాదక శక్తి హెచ్చిన మూలంగా రాబట్టాలని మన ప్రణాలికా సంస్థలు అంచనా వేశాయి. వచ్చే పది సంవత్సరాలలో సోవియట్ పరిశ్రమల్లో శ్రామికుల ఉత్పాదక శక్తి సుమారుగా రెండు రెట్లూ, ఇరువై సంవత్సరాలలో 4 నుండి 4.2 రెట్లూ పెరుగుతుంది. పని గంటలను తగ్గించనున్నాము కాబట్టి, గంటకు జరిగే ఉత్పత్తి యింకా ఎక్కువ నిష్పత్తిలోనే పెరుగుతుంది.

ఉత్పత్తి శక్తులను విభజించే విధానం, వచ్చే 20 సంవత్సరాలలో యింకా మెరుగు కావాలి. ఇందుమూలంగా, సామాజిక శ్రమను సాధ్యమయినంతవరకు పొదుపు చేయగలం; ఉత్పత్తిని మరింత శీఘ్రగతితో పెంపొందించగలం, అపారంగా వున్న నూతన సహజ సంపద మానవ సమాజానికి ఉపయోగ పడేలా చేయగలం.

ఉత్పత్తి శక్తుల విభజన విషయంలో మనం తలపెట్టిన కర్తవ్యాలు యివి :

చౌకగా లభ్యమయ్యే నేల బొగ్గునూ, అంగారా, ఏనిసీ నదీ ప్రవాహాల మూలంగా జల విద్యుదుత్పత్తికిగల అవకాశాలనూ వినియోగించుకొని సైబీరియాలో శక్తివంతమైన ఇంధన, విద్యుదుత్పాదక కేంద్రాలను నిర్మించడం;

గ్యాసు, జల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయడానికి మధ్య ఆసియాలో గల అపారావకాశాలను వినియోగించుకొని, ఆ ప్రాంతాన్ని కీలకమయిన పవర్ ఉత్పాదక ప్రాంతంగా మార్చడం;

1980 నాటికి క్రింది అయిదు ప్రాంతాలలో అఖిల యూనియన్ లోహ పారిశ్రామిక స్థావరాలు ఏర్పడేలా బలీయమైన కొత్త లోహ పరి

శ్రమలను నిర్మించడం : ఉరల్స్, ఉక్రెయిన్, సైబీరియా దూరప్రాచ్య ప్రాంతం, కజకస్తాన్, సోవియట్ యూనియన్‌లో యూరోపు భూభాగ మధ్య ప్రాంతాలు;

సహజమైన గ్యాసులు, పెట్రోలియం గ్యాసులు చౌకగా ఉత్పత్తి చేయడానికి విస్తారమయిన వనరులున్న ప్రాంతాలలో పెద్ద పెద్ద రసాయనిక పారిశ్రామిక కేంద్రాలను స్థాపించడం. నూనె శుద్ధి కర్మాగారాలను, ప్రధానంగా ఉరల్స్, ఓల్గా ప్రాంతం, ఉక్రెయిన్, ఉత్తర కాకసస్, సైబీరియా మధ్య ఆసియాలో నిర్మించడం;

ఉరల్స్‌కు తూర్పున గల ప్రాంతాలకు అవసరమయిన యంత్రాలను, యంత్ర పరికరాలను ఉత్పత్తి చేయడానికై, ఆ ప్రాంతంలో బలమైన యంత్ర నిర్మాణ పరిశ్రమలను స్థాపించడం;

సోవియట్ యూనియన్‌లోని యూరోపు భూభాగంలోని ఉత్తర ప్రాంతాల నీటిని పెద్ద ఎత్తున ఓల్గా మైదానానికి తరలించడం: మధ్య కజకస్తాన్, త్సెలినీ ప్రాంతం, డానెట్స్ మైదానం, ఉరల్స్—ఈ ప్రాంతాలకు నీరు సరఫరా చేయడం; ఓల్గా, నీపర్, బగ్, నీస్టర్ నదుల పైన మధ్య ఆసియాలో, జల ప్రవాహాన్ని క్రమబద్ధం చేసే జలాశ్రయాలను నిర్మించడం; వ్యవసాయంలో అభివృద్ధికరమైన మార్పులు తేవడం, నీటి పారుదల సౌకర్యాలను విస్తారంగా అభివృద్ధి చేయడం.

మన పరిశ్రమల అభివృద్ధికి గల అవకాశాలను స్థూలంగా పేర్కొన్నాము. ఇవి నిజంగా మహత్తరమైనవి. ఈనాటి ప్రణాళిక రేపు వాస్తవ రూపం ధరిస్తుందనే విషయం మనకు బాగా తెలుసు. ఇది వాస్తవ స్వరూపం ధరిస్తుందనేందుకు మన పార్టీ దృఢదీక్షే, మహా శక్తి సంపన్నులయిన మన ప్రజల దృఢ దీక్షే హామీ.

# 2. గ్రామీణ ప్రాంతాలలో వ్యావసాయిక, సామాజిక సంబంధాల అభివృద్ధి.

కామ్రేడ్స్, సమిష్టి వ్యవసాయ విధానం జయప్రదమైనందువల్లనూ, వ్యవసాయరంగంలో సోషలిస్టు వ్యవస్థ పటిష్ఠంగా నెలకొన్నందువల్లనూ, గ్రామీణ ప్రాంతంలో సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాలలో వచ్చిన మార్పులను, ముసాయిదా కార్యక్రమం ఆమూలాగ్రంగా విశ్లేషించి వివరిస్తున్నది. సోవియట్ యూనియన్‌లో వ్యవసాయ రంగంలో సోషలిస్టు వ్యవస్థ నెలకొనడం, మన పార్టీకి, సోవియట్ ప్రజలందరికి చరిత్రాత్మక విజయం.

లెనిన్ పార్టీ నాయకత్వాన కార్మికవర్గం విప్లవాన్ని జయప్రదంగా కొనసాగించినప్పుడు, బోల్షివిక్కులు రైతాంగ సమస్యను పరిష్కరించ లేరులెమ్మనీ, రైతు తన కొంచ్రికను వదులుకోవడానికి ఎన్నటికీ అంగీకరించడనీ, భూఖామందుగా వున్న రైతును సమిష్టి వ్యవసాయదారునిగా మార్చడం అసాధ్యమనీ మన శత్రువులు తమ్ము తాము సంతృప్తి పరచుకొన్నారు.

కాని మన శత్రువుల ఆశలన్నీ అడియాసలయ్యాయి. లెనిన్ అద్భుతమైన తన సహకార ప్రణాలికను రూపొందించారు. దాన్ని మార్గదర్శకంగా ఉంచుకొని పార్టీ, కోటానుకోట్ల రైతులను నవజీవన నిర్మాణానికి సంఘటితపరచింది. సోషలిజం అనే నాగలి చాలు రైతుల కమతాల మధ్య గల సరిహద్దులను పూర్తిగా తుడిచివేయడమేకాక, వ్యక్తిగత యాజమాన్యంపై రైతుకు గల మమతను పోగొట్టి అతని మనస్తత్వాన్ని మార్చివేసింది. నేడు, వ్యవసాయ పునర్వ్యవస్థీకరణా, కోటాను కోట్ల రైతులు కమ్యూనిస్టు నిర్మాణంలో భాగస్వాములు కావటం, లెనిన్ భావాల విజయానికి ప్రతీకలుగా వెలుగొందుతున్నాయి. వీర లక్షణ లక్షితులైన కార్మిక వర్గంతో చెట్టపట్టాలు పట్టుకొని ముందుకు నడుస్తూ నవజీవన

నిర్మాణంలో చొరవతో పాల్గొంటూన్న ఒక కొత్త రకం రైతును సృష్టించినందుకు మన పార్టీ గర్వపడుటలో తప్పులేదు.

పరిశ్రమలూ, దాని మూల శక్తి అయిన భారీ పరిశ్రమలూ, సోవియట్ యూనియన్ వ్యవసాయమూ కలిసి నేడు, సంక్షోభాలూ, కల్లోలాలు ఎరుగని ఒక బలీయమైన సోషలిస్టు ఆర్థిక వ్యవస్థగా రూపొందాయి.

సమిష్టి వ్యవసాయ క్షేత్ర మార్గంలో రైతాంగాన్ని నడిపించడం ద్వారా, దేశం నలుమూలలా ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలను స్థాపించడం ద్వారా, సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలను పదిలపరచడం ద్వారా, లెనిన్ సహకార ప్రణాళికలోని మొదటి భాగాన్ని అమలుజరిపాము. మనం నేడు మరొక పెద్ద అడుగు ముందుకు వేయవలసి వున్నది; అన్ని సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలను అభివృద్ధి పరచి, వాటి ఉత్పత్తిని కమ్యూనిస్టు వ్యవస్థకు తగిన స్థాయికి పెంచవలసి వున్నది.

ప్రస్తుత కమ్యూనిస్టు నిర్మాణ దశలో సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ యీ దిగువ వాటిని వ్యవసాయ రంగంలో ముఖ్య కర్తవ్యాలుగా పరిగణిస్తుంది:

ప్రజల కొరకు పెద్ద నాణ్యంగల సరకులనూ, పరిశ్రమ కొరకు ముడి పదార్థాలనూ సమృద్ధిగా అందజేయడం;

సోవియట్ గ్రామసీమలలో క్రమక్రమంగా కమ్యూనిస్టు సాంఘిక సంబంధాలు నెలకొనేటట్టుగా చేసి, వ్యవసాయంలో ఉత్పాదక శక్తులు ఎంతో అధికం చేయడం ద్వారా నగరానికీ, గ్రామానికీ మధ్య స్థూలంగా తేడాలను తొలగించడం.

జీవితం, కమ్యూనిస్టు నిర్మాణమూ ముందుంచుతోన్నటువంటి, పార్టీ ముసాయిదా కార్యక్రమంలోని అత్యంత ముఖ్య సిద్ధాంతాలైనటువంటి వ్యవసాయాభివృద్ధి మూల సమస్యలను ప్రస్తావిస్తాను.

కమ్యూనిస్టు పార్టీ ఉజ్జ్వలమైన, ఉదాత్తమైన లక్ష్యాన్ని ప్రకటించింది—మానవుని వృద్ధిచెందుతోన్న భౌతిక, సాంస్కృతికావసరాలను

పూర్తిగా యీడేర్చడం యీ లక్ష్యం. ఈ లక్ష్యసాధనకు అపూర్వమైన భౌతికోత్పత్తి ఉన్నత స్థాయి అవసరం. అందుచేతనే పార్టీ ముసాయిదా కార్యక్రమం వ్యవసాయాభివృద్ధికొరకు బృహత్తరమైన పథకాన్ని ప్రజల ముందుంచింది. ఈ కార్యక్రమాన్ని మనం చర్చించేటప్పుడు, మన ఉద్రిక్త కాలం గురించీ, సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ భవిష్యత్తు గురించీ విస్పష్టంగా మాటాడుతాము. కమ్యూనిస్టు నిర్మాణ కర్తవ్యాలను యీ విధంగా పరిశీలించాలని లెనిన్ మనకు బోధించారు. 1920 వసంతకాలంలో లెనిన్ 9వ పార్టీ మహాసభా సన్నాహాల గురించి పార్టీ సంస్థలకు ఒక లేఖలో యిలా వ్రాశారు: "మనం ముందుకు వెళ్ళాలి, మనం ముందుకు చూడాలి, ఆర్థికాభివృద్ధికి సంబంధించిన విశ్లేషింపబడిన అనుభవాన్ని మహాసభకు మనం తీసుకరావాలి; అది సంయుక్త కృషిచే, అందరు పార్టీ సభ్యుల ఉమ్మడి శ్రమచే తూచబడి, ఎంతో జాగ్రత్తగా సంకలనం చేయబడినదిగా వుండాలి."*

మన ఆర్థిక ప్రణాళికలలో, మన వ్యవసాయ లక్ష్యాలలో యిటువంటి ఆర్థికాభివృద్ధి ప్రత్యక్షానుభవం పెట్టబడింది. ముసాయిదా కార్యక్రమం, యిరవై ఏళ్ళలో మొత్తం వ్యవసాయ ఉత్పత్తి సుమారు 3.5 రెట్లూ, ధాన్యపు మొత్తం ఉత్పత్తి రెండు రెట్లకు పైగానూ, మాంసం సుమారు నాలుగు రెట్లూ, పాలు సుమారు మూడు రెట్లూ పెరుగుతుందని అంచనా కడుతున్నది.

అనుకున్నట్టుగా సోవియట్ సమాజం అభివృద్ధి అయితే, ప్రజావసరాలను పూర్తిగా సంతృప్తి పరచడానికి ఏ ఏ సరకులు, ఏ ఏ మొత్తాలలో మనం ఉత్పత్తి చేయాలి? పార్టీ కేంద్ర కమిటీ ఆజ్ఞానుసారంగా ప్రభుత్వ ఆర్థిక సమితి రానున్న 20 ఏళ్ళలో మన దేశం సాధించవలసిన మొత్తం

* వి. ఐ. లెనిన్, రచనల సంకలనం, 4 వ రష్యన్ ముద్రణ, సంపుటి 30, పుట 379.

ఉత్పత్తి గురించి అంచనాలను నివేదించింది. ఆ అంచనాలను మీకు నివేదిస్తాను.

1960–80లో వ్యవసాయ సరుకుల ఉత్పత్తి

| | 1960 | 1970 | 1980 |
|---|---|---|---|
| ధాన్యం (పది లక్షల టన్నులలో) | 134 | 230 | 290_310 |
| మాంసం (పది లక్షల టన్నులలో) | 8.7 | 25 | 30_32 |
| పాలు (పది లక్షల టన్నులలో) | 61.7 | 135 | 170_180 |
| కోడి గుడ్లు (వంద కోట్లలో) | 27.4 | 68 | 110_116 |
| ఉన్ని (వేయి టన్నులలో) | 357 | 800 | 1,045_1,155 |
| ముడి పత్తి (పది లక్షల టన్నులలో) | 4.3 | 8 | 10_11 |
| పంచదార ఉత్పత్తికి వినియోగించే బీటు దుంపలు (పంచదార ఫాక్టరీల వద్ద, పది లక్షల టన్నులలో) | 57.7 | 86 | 98_108 |
| నూనె విత్తులు (పది లక్షల టన్నులలో) | 4.3 | 8 | 9_10 |
| బంగాళా దుంపలు (పది లక్షల టన్నులలో) | 84.4 | 140 | 156 |
| కూరగాయలు, పుచ్చకాయలు (పది లక్షల టన్నులలో) | 19.2 | 47 | 55 |
| పళ్ళు (పది లక్షల టన్నులలో) | 4.9 | 28 | 51 |

పార్టీ తలపెట్టిన ప్రణాళికలు పెద్దవనే విషయం పై అంకెలను బట్టి స్పష్టమే. ఇంత పెద్ద ఎత్తున వ్యావసాయక సరకులను ఉత్పత్తి చేయాలనడం కొంతమందికి అవాస్తవికంగా కనపడవచ్చు. ఈ లెక్కలు దిగ్భ్రమ కలిగించే మాట నిజం. వాస్తవంలో, 1954 వరకు అనేక దశాబ్దాలుగా మన దేశంలో మొత్తం ధాన్యం రాలుబడి సుమారు 8.2 కోట్ల టన్నులు. బీడు భూములను అభివృద్ధిచేసి సాగులోనికి తీసుకొనిరావడం వల్లనూ, మొక్కజొన్న పంట ప్రవేశపెట్టడం ద్వారానూ, మనం సాలుకు 13_13.8 కోట్ల టన్నుల ధాన్యం ఉత్పత్తి చేయడం ప్రారంభించి కొద్ది సంవత్సరాలే

అయింది. చాలాకాలంగా సుమారు 3.3 కోట్ల టన్నుల ధాన్యం సేకరించేది. గత కొద్ది సంవత్సరాలుగానే ధాన్యసేకరణను 4.91–5.73 కోట్ల టన్నులకు పెంచగలిగాము. 1980 నాటికి ధాన్యం ఉత్పత్తిని 29–31 కోట్ల టన్నులకు, ప్రభుత్వం కొనుగోళ్ళను 11.5 కోట్ల టన్నులకు పెంచవలసి వుంది.

మన బృహత్ప్రణాళికలను రూపొందించేటప్పుడు, వీటిని జయప్రదంగా అమలు జరపగలమనే దృఢ విశ్వాసం మనకున్నది. వాస్తవిక దృష్టితో వేసుకొన్న యీ అంచనాలూ, సోషలిస్టు ఆర్థిక వ్యవస్థలోని అగణిత శక్తి సంపత్తీ, సోవియట్ ప్రజలు దీక్షా బద్ధులై చేసే కృషీ, వారికి గల చక్కని నిర్మాణబలమూ, మనకీ విశ్వాసాన్ని కలిగిస్తున్నాయి.

మన రిపబ్లిక్కులలో ముఖ్యమయిన రష్యన్ ఫెడరేషన్, ఉక్రెయిన్, కజక్క్ రిపబ్లిక్కులలో ధాన్యం ఉత్పత్తి ఎలా పెరుగగలదో చూద్దాం.

బైలో రష్యన్లతో బైలో రష్యాలోనే మాట్లాడుదాం. ఒకరిచెవులో ఒకరు మెల్లగా చెపుకొందాం. అలా చెవిలో చెప్పవలసిన విషయాలున్నాయి.

ముసాయిదా కార్యక్రమంలో నిర్ణయించిన కర్తవ్యాలను నెరవేర్చడానికి రష్యన్ ఫెడరేషన్ శ్రామిక ప్రజలు చేసే కృషి ఏమిటి? రష్యన్ ఫెడరేషన్‌లోని సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో 1960లో 7.8 కోట్ల టన్నుల ధాన్యం ఉత్పత్తి అయింది. ఇందులో 2.95 కోట్ల టన్నులు ప్రభుత్వానికి విక్రయించారు. 1980లో యీ క్షేత్రాలు 19.6 కోట్ల టన్నులను పండించాలి. అందులో ప్రభుత్వానికి 6.6–8.2 కోట్ల టన్నులను అమ్మాలి.

వ్యవసాయోత్పత్తి ప్రణాళికలను గురించి కృశ్చేవ్ ఎలాంటి కలలు కంటున్నాడో చూడారా—అని బహుశా బూర్జువా పత్రికలు యీ సందర్భంలో వ్రాస్తాయి! ఈ పెద్దమనుష్యులు అలానే వ్రాయనీండి. అయితే నేనీ విషయం పార్టీ మహాసభలో, కేంద్ర కమిటీ తరపున చెప్తున్నాననే సంగతి వీళ్ళు మరవరాదు. ఈ మహాసభ పార్టీకీ, ప్రజలకూ పిలుపునిస్తుంది; ప్రజలు కొండలను కూడ పిండికొట్టగలరు.

చెప్పవచ్చిందేమంటే, రష్యన్ ఫెడరేషన్‌లో ధాన్యోత్పత్తినీ, ధాన్యసేకరణను 150 శాతం పెంచవలసి వుంది.

దీన్నిబట్టి ఒక్క విషయం స్పష్టం. ఇప్పుడు పండిస్తున్న పంటలతో, యీ కర్తవ్యాన్ని నెరవేర్చడం సాధ్యంకాదు. అంటే, లక్షలాది హెక్టర్ల భూమిలో రాలుబడి తక్కువగా వుండే ఓట్, తదితర పంటలు పెట్టడం, చెమ్మ ప్రాంతాలలో విస్తారమయిన భూములను వృధాగా బీడుపెట్టడం కొనసాగుతున్నంత కాలం ధాన్యం ఉత్పత్తిని మనం అనుకొన్న రీతిగా పెంచలేము.

నేను హాస్యానికి ఒక విషయం చెప్పుతాను: కొంతమంది రాము ఓట్ ధాన్యమే పండిస్తామని మొండిగా పట్టుబడితే, వాళ్ళకు ఓట్ ధాన్యపు పిండే తింటానికి యిస్తాము. పిల్లలకిచ్చేలాంటి పిండిగాదు సుమా! ఓట్ ముడి నూకలు యిస్తాము. అంతర్యుద్ధంలో ఎర్ర సైనికులు తమకిస్తున్న ఓట్ ధాన్యం నూకలు చూచి "మాకు తిండి పెడుతున్నారో గడ్డి పెడుతున్నారో తెలియకుండా వుంది, ఛీ!" అని అనేవారు. అయితే బాగా పురోగమించిన మన వ్యవసాయ క్షేత్రాల, పరిశోధనా సంస్థల అనుభవాన్ని ఆధారంగా చేసుకొని, మన పంటలను మార్చినట్లయితే, తక్కువ రాలుబడి ఇచ్చే పంటలకు మారుగా పట్టుదలతో, ధైర్యంతో కొత్త పంటలు వేస్తే, ఎక్కువ ధాన్యం పండించడానికి మనకుగల అవకాశాలను బాగా వినియోగించుకొన్నట్లయితే 1980కు ముందే మనము నిర్ణయించిన మేరకు ధాన్యం ఉత్పత్తి చేయగలం.

ఏ వనరులను వినియోగించుకొని యీ కర్తవ్యం నెరవేర్చనున్నాము? ప్రస్తుతం నిరుపయోగంగా పడివున్న భూములను సాగులోనికి తీసుకొని రావడం ద్వారా కొంత ధాన్యం పండిస్తాము. అయితే మనం అదనంగా పండించనున్న ధాన్యంతో ఎక్కువ భాగం, రాలుబడి తక్కువగా వుండే పంటలకు మారు మంచి రాలుబడిగల పంటలను పెట్టడం ద్వారానూ, అన్ని పంటల రాలుబడినీ బాగా హెచ్చించడం ద్వారానూ సాధించగలము.

రష్యన్ ఫెడరేషన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ బ్యూరో, రష్యన్ ఫెడరేషన్ మంత్రి మండలీ, శాస్త్రజ్ఞులతోనూ, నిపుణులతోనూ కలిసి పంటలకు సంబంధించిన ఒక నూతన విధానాన్ని రూపొందించాయి. ఈ విధానం వల్ల ధాన్యం ఉత్పత్తిని పెంచేందుకు చక్కటి అవకాశాలు ఏర్పడుతున్నాయి. ఈ విధానంలోని విశేషమేమిటి? లాభసాటి కాని పంటలనూ, రాలుబడి తక్కువగా వున్న పంటలనూ బాగా తగ్గించివేస్తారు. ఓట్ ధాన్యం పండించే భూమి విస్తీర్ణాన్ని 60 లక్షల హెక్టర్లూ, పశుగ్రాసం పండించే భూమి విస్తీర్ణాన్ని 90 లక్షల హెక్టర్లూ తగ్గిస్తారు. చెమ్మ ప్రాంతాలలోని బీడు భూములలో 90 లక్షల హెక్టర్లను సాగులోనికి తీసుకొని వస్తారు.

మొత్తంపైన అదనంగా 2 కోట్ల 40 లక్షల హెక్టర్ల భూమిలో ఎక్కువ విలువైన పంటలు పండించ గలుగుతారన్నమాట. ఈ భూముల్లో మొక్కజొన్న, బటాణీ, పశుగ్రాసానికి ఉపయోగించే చిక్కుడు తదితర విలువైన పంటలను పండించగలుగుతారు.

మొక్కజొన్న వేసే భూమి విస్తీర్ణాన్ని ధాన్యం కొరకు 24 లక్షల హెక్టర్లనుండి 70లక్షల హెక్టర్లకు పెంచాలని సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల నిర్వాహకులు తలపెట్టారు. హెక్టరుకు 40 సెంట్నర్ల మొక్కజొన్న పండుతుందనే లెక్కనుబట్టి, ఈ భూమి నుండి **2** కోట్ల **80** లక్షల టన్నుల ధాన్యం వస్తుంది.

రష్యన్ ఫెడరేషన్‌లో కాయధాన్యాలు పండించే భూమి విస్తీర్ణం 26 లక్షల హెక్టర్లనుండి కోటి 90 లక్షల హెక్టర్లకు పెరుగుతుంది. ఇందులో కోటి 65 లక్షల హెక్టర్లలో బటాణీ, పశుగ్రాసానికి ఉపయోగించే చిక్కుడు పండిస్తారు. ఈ భూమిలో హెక్టరుకు సుమారు 20 సెంట్నర్ల పంట పండుతుందన్న లెక్కప్రకారం, మొత్తం **3** కోట్ల **80** లక్షల ధాన్యం పండుతుంది.

గోధుమ, తదితర తృణధాన్యాలు పండించే భూమి విస్తీర్ణం

6 కోట్ల 80 లక్షల హెక్టార్లు వుంటుంది. హెక్టరుకు 20 సెంట్నార్ల చొప్పున యీ పంటల ద్వారా వచ్చే ధాన్యం 13 కోట్ల టన్నులకు పైబడు తుంది.

ఈ విధంగా ధాన్యానికి బదులు మొక్కజొన్న, బటానీ, మేత చిక్కుడు పంటలను ప్రవేశపెట్టినందు వల్లనూ, అన్ని పంటల రాలుబడిని పెంచినందువల్లనూ, రష్యన్ ఫెడరేషన్‌లోని సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో ఏటా 19 కోట్ల 60 లక్షల టన్నులకు పైగానే ధాన్యం పండించ వచ్చు. అందులో ప్రభుత్వానికి 6.6–8.2 కోట్ల టన్నుల ధాన్యం అమ్మడానికి వీలుకలుగుతుంది. ఇంత ధాన్యం విక్రయించడానికి వీలుపడేలా, ధాన్యో త్పత్తిని పెంచవచ్చుననే విషయం మరింత స్పష్టం చేయడానికి క్రింది అంకెలు యిస్తున్నాము. ప్రణాలికను బట్టి రష్యన్ ఫెడరేషన్ 1961లో ప్రభుత్వానికి అమ్మే ధాన్యం 3.44–3.6 కోట్ల టన్నులు. ప్రస్తుతం పశువుల కోసం లాభసాటిగాని గడ్డి పెంచుతున్న 90 లక్షల హెక్టర్ల భూమిలోనూ, ఏమీ పండించకుండా బీడుగా వుంచిన 90 లక్షల హెక్టర్ల భూమిలోనూ కాయ ధాన్యాలు పండిస్తే, హెక్టారుకు 20 సెంట్నార్ల చొప్పున 3 కోట్ల 60 లక్షల టన్నుల ధాన్యం వస్తుంది. ఈ భూముల నుండి సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలకు ప్రస్తుతం ఏమీ ఆదాయం రావటం లేదు కాబట్టి, యీ ధాన్యమంతా విక్రయించవచ్చు. అందువల్ల ప్రణాలికలో నిర్దేశించిన ధాన్యం అమ్మకాలకు తోడు, మరో 3 కోట్ల 60 లక్షల టన్నుల ధాన్యం అమ్మడానికి వీలవుతుంది. ప్రభుత్వం కొనే ధాన్యం 6 కోట్ల 60 లక్షలకు పైగా హెచ్చు తుంది. కాబట్టి, ప్రభుత్వానికి 6.6–8.2 కోట్ల టన్నుల ధాన్యం విక్రయించ డం రష్యన్ ఫెడరేషన్‌లోని ప్రభుత్వ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకు పెద్ద సమస్య కాదు.

ఇందుకు మనమంతా అభినందనలు తెలియజేస్తాం కామ్రేడ్స్.

ఈ నిర్ణయం ఆమోదింపబడినప్పుడు, రష్యన్ ఫెడరేషన్ కార్మి కులు తమ శక్తుల నన్నింటినీ సమీకరిస్తారనీ, యీ కర్తవ్యం తప్పకుండా

నిర్వహిస్తారనీ మనకు సంపూర్ణమైన విశ్వాసముంది!

రష్యన్ ఫెడరేషన్‌లో గోధుమ, తదితర తృణధాన్యాలు, కాయ ధాన్యాలు హెక్టరుకు 20 సెంట్నార్ల చొప్పున పండుతాయని అంచనా.

కామ్రేడ్స్, 20 సంవత్సరాలుగా హెక్టరుకు సగటున 20 సెంట్నార్ల చొప్పున పండిస్తున్నాము. మన శక్తి యింతేకాదు! ఇంతకన్నా ఎక్కువ పండించగల శక్తి మనకున్నది.

అంతర్జాతీయ ధాన్యం మార్కెట్టులో సోవియట్ యూనియన్ అదృ తన భావిలోనే అలంకరించనున్న స్థానం చూచినప్పుడు మన వ్యవసాయం ఎలా అభివృద్ధి చెందుతున్నదో సామ్రాజ్యవాద మహాశయులకు తెలిసి వస్తుంది!

20 సంవత్సరాలకు మనం వేసిన యీ అంచనా పెద్దదేమీ కాదు. మన దేశంలో అనేక సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో గోధుమ తదితర తృణధాన్యాలను హెక్టారుకు యిరవై అయిదు, ముప్పై సెంట్నర్లు, 40 సెంట్నర్లు చొప్పున కూడా యిప్పటికే పండిస్తున్నారు. ఉత్పత్తి ఏర్పాట్లు, వ్యావసాయక శాస్త్రం, సాంకేతిక విజ్ఞానం ప్రస్తుత మున్న స్థాయిలో మన పంటల రాలుబడి యిది. మరి, విజ్ఞానశాస్త్రం ఏడాదికేడాదికీ పురోగమిస్తూ వుంటుంది. ఫలితంగా కార్యాచరణలో కొత్త కొత్త ప్రయోగాలకు మహదవకాశాలు ఉత్పన్న మవుతాయి. వ్యవసాయ రంగంలో మిశ్రమ జాతికి చెందిన కొత్తరకం మొక్కలు, మేలిరకమయిన మొక్కలు లభ్యమవుతాయి. పశు, వృక్షాదుల నుండి లభ్యమయ్యే ఎరువుల, ఖనిజ ఎరువుల ఉత్పత్తి, పంట తెగుళ్ళను నిర్మూలించే మందుల, తదితర రసాయనిక పదార్థాల ఉత్పత్తి అపారంగా పెరుగుతుంది. సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలకు యిప్పటికన్నా మేలయిన వ్యావసాయక యంత్ర సామగ్రి సరఫరా అవుతుంది. వీటన్నిటి మూలంగా, ధాన్యం ఉత్పత్తి, ప్రభుత్వం కొనుగోళ్లూ మనం నిర్ణయించిన స్థాయిని అందుకోవడమే కాక, దాన్ని సైతం మించగలవు కూడా.

ఉక్రేనియన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ, మంత్రి మండలి సమర్పించిన అంచనాలను తీసుకొందాం. మొక్కజొన్న పంట విస్తారంగా ప్రవేశపెట్టడం ప్రారంభించక ముందు ఉక్రెయిన్‌లో పండే ధాన్యం సుమారు 2.1-2.5 కోట్ల టన్నులనీ, ప్రభుత్వం సేకరించే ధాన్యం 66-82 లక్షల టన్నులనీ మీకంతా తెలుసు.

రాబడి బాగావుండే మొక్కజొన్న, బటాణీ, మేతచిక్కుడు విస్తారంగా పండిస్తున్నందువల్ల, ధాన్యం ఉత్పత్తిని 6 కోట్ల 20 లక్షల టన్నులకూ ప్రభుత్వం కొనుగోళ్ళను 2 కోట్ల 50 లక్షల టన్నులకూ పెంచగలమనే గట్టి నమ్మకం ఉక్రెయిన్ శ్రామిక ప్రజల కేర్పడింది.

ఉక్రెయిన్‌లోని సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో పండించే పంటల్లో వచ్చే మార్పు ఏమిటి? 65 లక్షల హెక్టర్ల భూమిలో శీతకాలం గోధుమ పంట, 50 లక్షల హెక్టర్ల (అంటే, ధాన్యం పండించే భూమిలో 28 శాతం) భూమిలో మొక్కజొన్న పంట, సుమారు 40 లక్షల హెక్టర్లలో (అంటే ధాన్యం పండించే భూమిలో 21 శాతం) కాయ ధాన్యాల పంటలు పెడతారు. అన్నిటికన్నా మొక్కజొన్న, కాయ ధాన్యం పంటల రాబడి ఎక్కువగా వుంటుంది కాబట్టి ఉక్రెయిన్‌లో ధాన్యం పండించే భూమిలో రమారమి సగం ఈ పంటలకే కేటాయిస్తారు. మొత్తం ధాన్యం ఉత్పత్తిలో 60 శాతం యీ పంటల మూలంగానే లభ్యమవుతుంది.

హెక్టరుకు క్రింద పేర్కొన్న విధంగా పంట తీయాలని మన లక్ష్యం.

| | |
|---|---|
| ధాన్యం పంటలు | 35 సెంట్నర్లు |
| ధాన్యం పంటలలో చేరినవి: | |
| శీతాకాలం గోధుమ | 30 సెంట్నర్లు |
| మొక్కజొన్న | 50 సెంట్నర్లు |
| బటాణీలు | 30 సెంట్నర్లు |
| మేత చిక్కుడు | 32 సెంట్నర్లు |

ఈ సంవత్సరం మన అనుభవాన్ని బట్టి చూస్తే, యీ లక్ష్యాలు వాస్తవిక దృష్టితో నిర్ణయించినవేనని తేలుతున్నది. ఎందుకంటే అనేక సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో హెక్టరుకు 70-80 సెంట్నర్ల మొక్కజొన్నలు, 30-40 సెంట్నర్ల గోధుమ, చిక్కుడు పండించారు.

ధాన్యం ఉత్పత్తిని హెచ్చించే కార్యక్రమంలో కజకస్తాన్ గొప్ప పాత్ర నిర్వహించాలని పార్టీ నిర్ణయించింది. ఈ రిపబ్లిక్‌కు కొన్ని విశిష్ట లక్షణాలున్నాయి. దక్షిణ ప్రాంతాలలో తప్ప, అక్కడ మొక్కజొన్న ప్రధానంగా పశుగ్రాసం కోసమే వేస్తున్నారు. కాబట్టి, ఎక్కువ ధాన్యం పండించాలంటే, కాయ ధాన్యాలు విస్తృతంగా పండించటం, కొత్త భూమిని సాగులోనికి తీసుకొనిరావటం అవసరం. ఇప్పటికన్నా తక్కువ కాలంలో చేతికందే మొక్కజొన్న జాతిని శాస్త్రజ్ఞులు సృష్టించ గలిగితే, కొత్తగా సాగుచేస్తున్న బీళ్ళలో కూడా, బహుశా, మొక్కజొన్న పండించ వచ్చును.

నేను యీ నివేదికను తయారు చేయడానికి సమాయత్త మవుతున్నప్పుడు అజర్‌బైజాక్‌లోని ఒక వృక్ష ప్రజననకారుడు నాకొక జాబు వ్రాశాడు: ఇంచుమించు 60 రోజుల్లో పంట చేతికి వచ్చే కొత్త రకం మొక్కజొన్నను తాను సృష్టించ గలిగానని అతను తెలియ జేశాడు. ఇదే నిజమయితే, మొక్కజొన్న పంట ఉత్తర ప్రాంతాలలో కూడా పండించడానికి అపారావకాశాలు కలుగుతాయి.

అమెరికాలో కూడా యిలాంటి రకం మొక్కజొన్న వున్నట్లు వియన్నాలో మిస్టర్ రస్క్ నాతో చెప్పారు. దీన్ని రుజువు చేస్తానని కూడా వాగ్దానం చేశారు. కాని ఆయన చెప్పినది నిజమని యింకా ధృవపడలేదు. మొక్కజొన్న సంగతి బాగా తెలిసిన అమెరికన్లు, ఉదాహరణకు గార్స్ట్, యిలాంటి మొక్కజొన్న అమెరికాలో లేదని అన్నారు. అమెరికాలో యిటువంటి రకం మొక్కజొన్న లేకపోతే, సోవియట్ యూనియన్‌లో దీన్ని గురించి బాగా ప్రచారం చేయడం మంచిది.

అయితే యిది చాలా కష్ట సాధ్యమయిన పని అని మనమంతా గుర్తించాలి. ఈ సమస్యా పరిష్కారం పైననే మన వ్యవసాయాభివృద్ధి ఆధారపడేలా చేయము. అటువంటి రకం మొక్కజొన్నను మనం అభివృద్ధి చేయలేకపోయినా, యిప్పుడున్న రకాలతోనే మన ప్రణాళికల లక్ష్యాలను సాధించడమే కాక వాటిని మించి ఉత్పత్తి చేయగలము.

కజకస్తాన్‌లోని అభివృద్ధి చేయబడుతోన్న బీడు భూముల్లో ఏ విధమైన పంటలు పెడుతున్నాము? మొత్తంపైన, అంటే కొత్తగా అభివృద్ధి చేసే భూమిని కూడా కలుపుకొని, కజకస్తాన్ రిపబ్లిక్‌లో 3 కోట్ల 20 లక్షల హెక్టర్లలో గోధుమ, యితర ధాన్యాలు, కాయ ధాన్యాలు, పశువుల మేతకు ఉపయోగించే మొక్కజొన్న విత్తాలి. ఇందులో 50_55 శాతం విస్తీర్ణం గోధుమ, తదితర ధాన్యం పంటలకు, 30_35 శాతం విస్తీర్ణం బటాణీ, మేత చిక్కుడు పంటలకూ, [illegible] శాతం విస్తీర్ణం మొక్కజొన్న మేతకూ, పంచదార దుంపకూ కేటాయించవలసి వుంది. ఇవి ముఖ్యమైన పంటలకు సంబంధించిన అంచనాలు. మన ఆర్థిక వ్యవస్థకు సహజంగా, యింకా రకరకాల పంటలు పండించటం అవసరం. బంగాళా దుంపలు, కూరగాయలు, నూనె విత్తులు పండించవలసి వుంటుంది. అయితే కొత్త భూమిని సాగులోనికి తెచ్చే ప్రాంతాలలో క్రింది పంటలకు ప్రాధాన్య మివ్వవలసి వుంటుంది: గోధుమ, బటాణీ, మేత చిక్కుడు, మొక్కజొన్న (ధాన్యానికీ, పశుగ్రాసానికీ), పంచదార దుం[illegible] (మేతకోసం)

ఈ విధమైన పంటలవల్ల చేతికందే ధాన్యం వివరాలివి :

గోధుమ తదితర ధాన్యపు పంటలకు [illegible] విస్తీర్ణం 1 కోటి 76 లక్షల హెక్టర్లు. హెక్టరుకు 20 సెంట్నర్ల ప్రకారం, 3 కోట్ల 52 లక్షల టన్నుల ధాన్యం పండుతుంది. దీనితో ప్రభుత్వ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు ప్రభుత్వానికి సుమారు 2కోట్ల 46 లక్షల టన్నుల ధాన్యం అమ్మగలవు.

బటాణీ, మేత చిక్కుడు పంటలకు కోటి 10 లక్షల హెక్టర్లు

కేటాయిస్తారు. హెక్టరుకు 20 సెంట్నర్ల చొప్పున, మొత్తం 2 కోట్ల 20 లక్షల టన్నుల ధాన్యం పండుతుంది. దీనిలో ప్రభుత్వానికి అమ్మే ధాన్యం సుమారు కోటి టన్నులు.

కాబట్టి, కజక్‌స్తాన్‌లో మొత్తం ధాన్యం ఉత్పత్తిని 5 కోట్ల 73 లక్షల టన్నులకు పెంచవచ్చు. అందులో 3 కోట్ల 30 లక్షల టన్నులకు పైగా ధాన్యాన్ని ప్రభుత్వానికి అమ్మవచ్చు.

ఇతర రిపబ్లిక్కులలోవలెనే, కజక్‌స్తాన్‌లో కూడా హెక్టారుకు పండే పంటలను పెంచడానికి బ్రహ్మాండమయిన అవకాశాలున్నాయి. బీడు భూమిని అభివృద్ధి చేయాలనే కర్తవ్యాన్ని పార్టీ చేపట్టినప్పుడు అందులో హెక్టారుకు 8 సెంట్నర్ల చొప్పున పంట తీయవచ్చునని అంచనా వేశాము. మనం అనుభవం సంపాదించినకొద్దీ, వ్యవసాయ రంగలో సాంకేతిక నైపుణ్యము పెంపొందినకొద్దీ, అనేక వ్యవసాయ క్షేత్రాలలో ఉత్పత్తి బాగా పెరిగింది. కొత్తగా అభివృద్ధి చేసిన ప్రాంతాలలోని ప్రభుత్వ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో ప్రస్తుతం హెక్టారుకు 20 సెంట్నర్లు ఆ పైగానూ ధాన్యం, ముఖ్యంగా గోధుమలు పెద్ద ప్రాంతాల్లో పండిస్తున్నాము.

ఉత్తర-కజక్‌స్తాన్ ప్రాంతంలోని మామ్లయుత్‌స్కీ ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రంలో ఏటా హెక్టరుకు 20-22 సెంట్నర్ల ధాన్యం పండిస్తున్నారు. కుస్తనాయిస్కీ, పెత్రొపావ్లొవస్కీ, కియలిన్‌స్కీ, చండక్‌స్కీ, తదితర ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలలో పంట రాబడి బాగా పెరిగింది. వసంత రుతువు గోధుమ పంటకు ముందు భూమిలో కాయధాన్యం పంటలు పెట్టడం మంచిది. ఇలా పంటలు పెడుతున్న వ్యవసాయ క్షేత్రాలు మంచి పంట తీస్తున్నాయి. కుస్తనాయ్ ప్రాంతంలో ఫ్యొదొరొవస్కీ ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రంలో యీ సంవత్సరం మొక్కజొన్న వేసినతరువాత వసంత రుతువు గోధుమ వేశారు. 3వ నంబరు పొలంలో హెక్టరుకు 26 సెంట్నర్లు. 7వ నంబరు పొలంలో 22 సెంట్నర్లు గోధుమ పండింది.

ఇలాంటి ఉదాహరణలు కజకిస్తాన్ లోనే కాక ఇతరచోట్ల కూడ కనిపిస్తాయి. ఆల్తాయ్ వ్యవసాయ పరిశోధన సంస్థను గురించి మీలో చాలామందికి తెలుసు. మొక్కజొన్న, కాయధాన్యపు పంటలూ, యితర అక్కడి పంటలూ విస్తారంగా పెట్టడం ద్వారా, ఈ సంస్థ కొద్ది సంవత్సరాలుగా ఏటేటా చాలా మంచి పంట తీస్తున్నది. 1961లో 6,359 హెక్టార్లలో, హెక్టరుకు 20 సెంట్నర్ల చొప్పున ధాన్యం పండించింది. ఇందులో 5,140 హెక్టర్లలో గోధుమ విత్తారు. హెక్టరుకు 20.4 సెంట్నర్ల చొప్పున గోధుమ పండింది. కొత్తగా వచ్చిన బర్నాల్కా—32 రకం గోధుమ హెక్టరుకు 44 సెంట్నర్ల చొప్పున పండింది. ఆల్తాయ్ ప్రాంతంలోని సోవియట్ భూమి సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో, గత అయిదు సంవత్సరాలుగా హెక్టరుకు సగటున 20.5 సెంట్నర్ల ధాన్యం పండుతున్నది. మన మహాసభ ప్రతినిధుల్లో ఒకరయిన అలెగ్జాండర్ బెక్కెర్ నాయకత్వాన గల బృందం హెక్టారుకు సగటున 23 సెంట్నర్ల ధాన్యం పండించింది.

కొత్త భూముల్లో వ్యవసాయాన్ని ఎలా అభివృద్ధి చేయాలో, సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల అనుభవం నుండి మనం తెలుసుకొనగలుగుతున్నాము. ఈ భూముల్లో వసంత ఋతువు గోధుమ పంటను మాత్రమే విత్తి, అంతటితో ఊరుకోరాదు. గోధుమతో పాటు, మొక్కజొన్న, బటానీ, మేత చిక్కుడు, మేత పంచదార దుంప పంటలను కూడా పండించాలి. వ్యవసాయాన్ని సమర్థవంతంగా సాగించడానికీ, ఎక్కువ పంట పండించడానికీ, పశుసంపద యితోధికాభివృద్ధికీ, కొత్త భూములపై స్థాపించిన ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలను మంచి పంటలు పండించే వ్యవసాయ క్షేత్రాలుగా అభివృద్ధి చేయడానికీ, యీ పంటలు పండించడం చాలా ముఖ్యం.

ధాన్యం సమస్యను, పశు సంపద సమస్యను పరిష్కరించడంలో మొక్కజొన్నకు, కాయధాన్యం పంటలకు పార్టీ ఎందుకింత ప్రాముఖ్యమిస్తున్నది? పంట రాబడిలోనూ, యితర సుగుణాలలోనూ యీ పంటలకు

సమానమయినవి లేవని ఒక సంవత్సరాల అనుభవం ద్వారా మనం తెలుసు కొన్నాము. ఉక్రెయిన్, క్రాస్నొడార్ ప్రాంతం మొదలగు చోట్ల ధాన్యం ఉత్పత్తిని పెంచడానికి మొక్కజొన్న పంట ఎంత తోడ్పడిందో కేంద్ర కమిటీ నివేదికలో ముందరే పేర్కొనబడింది.

మొక్కజొన్నకు ఎంత ప్రాధాన్యం యిస్తున్నామో, కాయ ధాన్యపు పంటలకు కూడా అంత ప్రాధాన్యం యివ్వడం సరియైనదేమో. బటాణీ, చిక్కుడు పాత పంటలే. వాటిని గురించి శతాబ్దాలుగా రైతులకు తెలుసు. మంచి బటాణీ పంట పండించలేని రైతు రష్యన్ ఫెడరేషన్, ఉక్రెయిన్, బైలో రష్యాలలో గాని, బాల్టిక్ రిపబ్లిక్కులలోగాని ఒక్కడు కూడా లేడు. దురదృష్టవశాత్తూ సోవియట్ యూనియన్ వ్యవసాయ మంత్రిత్వ శాఖకు చిరకాలంగా ఆధిపత్యం వహించినవారు కాయ ధాన్యపు పంటలు పనికిరానివనే అభిప్రాయం వ్యాపింప జేశారు.

అయితే, ఈ పంటలను ఎంతో శ్రద్ధతో పండించి, ఎక్కువ ధాన్యం ఎలా ఉత్పత్తి చేయాలో సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల కన్నిటికీ తెలియజెప్పిన ఉత్సాహపరులూ ఉన్నారు.

విన్నిత్సా ప్రాంతంలోని స్టాలిన్ సమిష్టి వ్యవసాయ క్షేత్ర అధ్యక్షుడు వాసిలి మిహాయిలొవిచ్ కిపున్ 22వ పార్టీ మహాసభ ప్రతినిధులలో ఒకరు. కాయ ధాన్యం పంటలను గురించి అనేకుల కీయన చక్కగా తెలియ జెప్పారు. ఈయన సమిష్టి వ్యవసాయ క్షేత్రం ఏటేటా మంచి బటాణీ పంటను తీస్తూ వుంది. 1960లో యీయన 520 హెక్టర్ల పొలంలో హెక్టారుకు 27 సెంట్నర్ల చొప్పున బటాణీ పండించారు. 1961లో 708 హెక్టర్లలో యీ పంట పెట్టి, హెక్టరుకు 31 సెంట్నర్ల చొప్పున పంట తీశారు. ఈ సమిష్టి వ్యవసాయ క్షేత్రం మొక్కజొన్న పంట విషయంలో కూడా తగు శ్రద్ధ వహిస్తున్నది. 900 హెక్టర్ల విస్తీర్ణంలో వేసిన యీ పంట హెక్టరుకు 60 సెంట్నర్ల చొప్పున పండింది. మొత్తం ధాన్యపు పంటలు పెట్టే భూమిలో 21 శాతం విస్తీర్ణంలో బటాణీ, 30 శాతం విస్తీర్ణంలో మొక్క-

జొన్న వేస్తున్నారు. అంటే ధాన్యపు పంటలు వేసే విస్తీర్ణంలో సగానికి పైగా పై రెండు పంటల క్రింద వుందన్న మాట.

దీనివల్ల యీ సముష్టి క్షేత్రంలో సగటు ధాన్యం రాలుబడి హెక్టారుకు 38 సెంట్నార్లయ్యింది.

మొత్తంపై యీ సంవత్సరం విన్నిత్సా ప్రాంతంలో 180,000 హెక్టర్లలో బటాణీ పంట పెట్టి, హెక్టరుకు 20.7 సెంట్నర్ల చొప్పున పండించారు. చెర్కాస్సీ ప్రాంతంలో 89,000 హెక్టర్లలో హెక్టరుకు 21.5 సెంట్నర్ల చొప్పున బటాణీలు పండించారు.

బటాణీ బాగా పండుతున్నది ఒక్క ఉక్రెయిన్‌లోనే కాదు. లిపెట్‌స్క్ ప్రాంతంలోని పెత్రొవస్కీ ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రంలో 110 హెక్టర్లలో, హెక్టరుకు 36 సెంట్నర్ల చొప్పున బటాణీలు పండించారు. ఈ వ్యవసాయ క్షేత్రానికి కామ్రేడ్ ఒలొవ్‌చంకో అధ్యక్షుడు. ఆయన 22వ పార్టీ మహాసభకు ప్రతినిధిగా వచ్చారు. విత్తే పద్ధతినిబట్టి వినియోగించిన విత్తనం ధాన్యం పరిమాణాన్నిబట్టి రాలుబడి యిలా వుంది

| | |
|---|---|
| వెడల్పయిన వరుసలు; వరుసలమధ్య దూరం 45 సెంటిమీటర్లు; హెక్టరు 1 కి వాడిన విత్తనపు గింజలు 110 కిలోగ్రాములు | హెక్టరుకు 22 సెంట్నర్లు |
| మామూలు వరుసలు; వరుసలకుమధ్య దూరం 15 సెంటిమీటర్లు; హెక్టరు 1 కి వాడిన విత్తనపు గింజలు 270 కిలోగ్రాములు | హెక్టరుకు 33 సెంట్నర్లు |
| ఇరుకైన వరుసలు; వరుసలకు మధ్య దూరం 7.5 సెంటిమీటర్లు: హెక్టరు 1 కి వాడిన విత్తనపు గింజలు 270 కిలోగ్రాములు | హెక్టరుకు 42.2 సెంట్నర్లు |

దీన్నిగురించి శ్రద్ధగా గమనించాలి. కీర్తిశేషుడైన అకడమిషియన్ ఏ. ఐ. లిసిట్స్‌న్, షటిలోవ్ కేంద్రంలో పనిచేసేవారు. వరుసలు దగ్గరగా వుండేలా విత్తడం ద్వారా తమ కేంద్రంలో చాలా యెక్కువ పంట తీసేవారమని ఆయన యుద్ధానికి ముందు నాతో చెప్పారు. మనం నేడు చేయ

వలసిన పనేమంటే, అన్నిటికన్న శ్రేష్ఠమయిన పద్ధతులను ఆమూలా గ్రంగా పరీక్షించి, వాటి మంచి చెడ్డలను నిర్ణయించడం. అలాచేసినప్పుడు ఆ పద్ధతులనుబట్టి దేశమంతటా ఉత్పత్తి ప్రారంభం కాగలదు.

విస్తారమయిన భూభాగాలపై బటాణీ పంట పెట్టి, పెద్ద పంట తీసే సమష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు అనేకం రష్యన్ ఫెడరేషన్‌లోని మధ్య ప్రాంతాలలో, బైలో రష్యా, లాట్వియా, లిథుయానియా, ఇస్టోనియా సైబీరియా, కజక్‌స్తాన్‌లలో వున్నాయి.

బహుశా వచ్చే ఒకటి రెండు సంవత్సరాలవరకు మనకు అవసర మయినంత చిక్కుడు విత్తనాలుండవు. అయితే బటాణీ విత్తనాలు అవసర మయిన దానికన్నా ఎక్కువే వుంటాయి. కాబట్టి మేత చిక్కుడుకు మారు బటాణీ వేయవచ్చు. ఇదికూడ చాలా విలువైన ధాన్యం పంట.

కాయధాన్యపు పంటలను విస్తారంగా వేయడంవల్ల వ్యవసాయం బ్రహ్మాండంగా అభివృద్ధి చెందే అవకాశాలు ఏర్పడుతున్నాయి. కాయ ధాన్యపు పంటలవల్ల ఒకేసారి మూడు లాభాలు కలుగుతాయి.

మొదటిది, ఇవి మంచి రాలుబడి ఇచ్చే పంటలు; ఆహారానికీ, పశుపోషణకూ ఉపయోగపడే ధాన్యం ఇతోధికంగా ఉత్పత్తి చేయడానికి యీ పంటలు చాలా తోడ్పడుతాయి. తక్కిన పంటలకన్న ఇవి త్వరగా చేతికిందుతాయి. వసంత రుతువులోని మంచుకు తట్టుకోగలవు. అందువల్ల సైబీరియా కజక్‌స్తాన్‌లో ఇవి లాభదాయకమైన పంటలు. కాయధాన్యం పంటలు త్వరలోనే పక్వానికొస్తాయి కాబట్టి కోత పని అంత కష్టంగా వుండదు. పొలాలను త్వరగా దుక్కిచేసి తరవాత పంటకు సిద్ధం చేయవచ్చు.

బటాణీని పెందరాడే విత్తవచ్చు. దక్షిణ ఉక్రెయిన్, ఓల్గా ప్రాంతా లకూ, వేడి గాడ్పులు వీచే యితర ప్రాంతాలకూ ఇది చాలా ఉపకరిస్తుంది. ఇక్కడ బటాణీ పంట త్వరగా కోతకు వస్తుంది కాబట్టి వేడిగాడ్పుల బెడద వుండదు. పెందరాడే విత్తనం వల్లనూ, స్వల్పకాలంలోనే గింజ

పట్టి పంటచేతికిందడం వల్లనూ, క్రస్నొడార్, స్టవ్రొపోల్ ప్రాంతాలలో మొదటి కారుకు బటాణీకన్న శ్రేష్ఠమయిన పంట లేదు. కబర్దినో-బల్కారియాన్, ఉత్తర-ఒసెటియా, చెచెన్-ఇంగుష్ రిపబ్లిక్కులలో రెండు కారులు పండించడానికి దీనికి మించింది లేదు.

నేల ఉష్ణోగ్రత 10-12 డిగ్రీలు ఉన్నప్పుడు మొక్కజొన్న విత్తుతారనే విషయం మీకు తెలుసు. బటాణీ అంతకంటేముందే, అంటే సుమారు రెండు మూడు వారాలకు మునుపే విత్తవచ్చు. బటాణీ 70-80 రోజుల పంట. మార్చి చివరిలోనో, లేక ఏప్రిల్ నెల ప్రారంభంలోనో విత్తితే, అది జూన్ మధ్యలో కోతకందుతుంది. బటాణీ నూర్పిళ్ళు పూర్తి అయిన తరువాత (మొక్కజొన్నకు ముందు బటాణీ పంట పెట్టడం మంచిది) అదే పొలంలో, జూన్ నెల చివరి పది రోజుల్లో మొక్కజొన్న విత్తవచ్చు. ఆ తరువాత నాలుగు నెలల వ్యవధి వుంటుంది. ధాన్యం కోసం వేసే మొక్కజొన్న ఎదిగి కోతకందడానికి యీ వ్యవధి చాలు. ఈ విధంగా మన దేశం దక్షిణ ప్రాంతాలలో బటాణీ మూలంగా ఏడాదికి రెండు పంటలు పండించవచ్చు.

రెండవది. కాయధాన్యాలలో మాంసపు కృత్తులు దండిగా వుంటాయి. అందువల్ల, పశువులకు మాంసపు కృత్తులు గల ఆహారం సరఫరా చేసే సమస్యను కాయధాన్యం పంటలు బాగా పరిష్కరించగలవు.

మూడవది. కాయధాన్యం పంటలు పెట్టడంవల్ల భూమికి లాభం ఎక్కుతుంది. ఈ పంటలు నైట్రొజిన్ తయారు చేసే బాక్టీరీల వంటివి. వాతావరణంలోని నైట్రొజిన్ను ఇవి సేకరించి భూమికి అందిస్తాయి. ఇతర పంటలు, గాలినుండి నైట్రొజిన్ను గ్రహించటానికి మారు, భూమిలోని నైట్రొజిన్ను పీల్చి పెరుగుతాయి. నిపుణులు పేర్కొన్న కొన్ని అంకెలు యీ సందర్భంలో ఉదహరిస్తాను.

హెక్టరుకు 20 సెంట్నర్లచొప్పున బటాణీ పంట పండుతున్నదనుకోండి. అప్పుడు హెక్టరు విస్తీర్ణం గల భూమిలోని బటాణీ మొక్కలు

105 కిలోగ్రాముల నైట్రొజిన్‌ను గాలినుండి గ్రహించి, నూర్పిళ్ళయ్యేసరికి అందులో 47 కిలోగ్రాముల నైట్రొజిన్‌ను భూమి కందిస్తాయి. హెక్టరుకు 30 సెంట్నర్ల పంటపండితే, ఆ మొక్కలు 160 కిలోగ్రాముల నైట్రొజన్‌ను గాలినుండి తీసుకొని, 70 కిలోగ్రాముల నైట్రొజన్ భూమికి అందిస్తాయి.

ఇక మేత చిక్కుడు విషయం. ఈ పంట, హెక్టరుకు 20 సెంట్నర్లు పండితే గాలినుండి 142 కిలోగ్రాముల నైట్రొజిన్‌ను గ్రహించి 63 కిలోగ్రాములను భూమి కందిస్తుంది. హెక్టరుకు 30 సెంట్నర్లు పండినప్పుడు, 213 కిలోగ్రాముల నైట్రొజిన్‌ను వాతావరణంనుండి తీసుకొని, 95 కిలోగ్రాములను భూమి కందిస్తుంది,

భవిష్యత్తులో సుమారు 3 కోట్ల హెక్టర్లలో, ఇంకా అంతకుమించీ, కాయధాన్యం పంటలు మన దేశంలో పెట్టనున్నాము. ఫలితంగా ఎరువుల్లో చాలా విలువైనటువంటి నైట్రొజిన్ ఉచితంగా మన భూములకు అపారంగా లభ్యమవుతుంది. ఈ ఎరువును ఉత్పత్తి చేయాలంటే, మన రసాయనిక పరిశ్రమ పెద్ద పెద్ద ఫాక్టరీ లనేకం నిర్మించవలసి వుంటుంది. ఇందుకు కోటానుకోట్ల రూబుళ్ళను పెట్టుబడి పెట్టవలసి వుంటుంది.

"ఎంతబాగుంది! ఈ మొక్కలు తమకవసరమైన ఎరువును అవే గాలినుండి సేకరిస్తాయి; కాబట్టి మనం నిర్మించే రసాయనిక ఫాక్టరీల సంఖ్యను తగ్గించుకోవచ్చు" అని కొంతమంది ప్రణాళికా శాఖాధికారులు బహుశా అనుకోవచ్చు.

లేదు. కామ్రేడ్స్, రసాయనిక పరిశ్రమను అభివృద్ధి చేయడం, నైట్రొజిన్ ఎరువులతోపాటు అన్ని ఖనిజ ఎరువుల ఉత్పత్తిని హెచ్చించడం, వాటితోపాటు తెగుళ్ళను, కలుపు మొక్కలను అదుపులో పెట్టగల రసాయనిక పదార్థాలను ఇతోధికంగా ఉత్పత్తి చేయడం నేడు మనం నిర్వహించవలసిన అతి తక్షణ కర్తవ్యాలలో ఒకటి. ఎరువుల ఉత్పత్తిని, వ్యవసాయ యాంత్రికీకరణతో సమానంగా పరిగణించి తీరాలి. ఇందులో అతిశయోక్తి లేదు. ఎందుకంటే, ఈ రెండూ వ్యవసాయోత్పత్తిని పెంచడానికి అత్యవసరం.

గత సంవత్సరం కోటి 40 లక్షల టన్నుల ఖనిజ ఎరువులు ఉత్పత్తి చేశాము. వీటి ఉత్పత్తిని 12.5_13.5 కోట్ల టన్నులకు పెంచాలని పార్టీ తలపెట్టింది. ప్రస్తుత సప్తవర్ష ప్రణాళికా కాలంలో వ్యవసాయానికి ఎరువుల సరఫరా సాధ్యమయినంత పెంచటానికి మనం కృషి చేయాలి.

ఖనిజ ఎరువులను విస్తారంగా ఉత్పత్తి చేసే కార్యక్రమం, కాయ ధాన్యం పంటల విస్తీర్ణాన్ని బాగా పెంచడం, పశు సంపద బాగా పెంపొందడం, పశు వృక్షాదుల నుండి లభించే ఎరువు నిల్వచేయడం—వీటన్నిటి మూలంగా మన పంటల రాలుబడి బాగా పెరుగుతుంది.

పంట రాలుబడి త్వర త్వరిగా పెంచడానికి ఫలానా సందర్భంలో ఫలానా పద్ధతు లవలంబించాలని నిరూపించిన సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు ప్రతి ప్రాంతంలోనూ వున్నాయి. ప్రతి ప్రాంతంలోని వ్యవసాయ క్షేత్రాలను నేను పేర్కొనలేను. ఒక్క ఉదాహరణ మాత్రం ఇస్తున్నాను.

కుర్స్క ప్రాంతంలోని కలినొవ్కా గ్రామంలో గల సమిష్టి వ్యవసాయ క్షేత్రాన్ని గురించి మీలో చాలా మందికి తెలుసు. ఈ వ్యవసాయ క్షేత్రం అధ్యక్షుడు వి.వి. గ్రచొవ్ 22వ పార్టీ మహా సభకు ప్రతినిధి. ఈ సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో 6 వేల హెక్టర్ల సాగు లాయకీ పొలముంది. 1961లో యీ వ్యవసాయ క్షేత్రంలో పండిన పంటల వివరాలివి:

| | | | |
|---|---|---|---|
| శీతకాలం గోధుమ | హెక్టరుకు | 32.6 | సెంట్నర్లు |
| రై | .. | 24.3 | .. |
| బార్లీ | .. | 21.6 | .. |
| జొన్నలు | .. | 20 | .. |
| బటాణీ హెక్టరుకు 320 కి. గ్రా. విత్తారు | .. | 28 | .. |
| మేతచిక్కుడు (చాళ్ల వెడల్పుగా విత్తారు) | .. | 25.6 | .. |
| పంచదార దుంప | .. | 350 | .. |
| మేత కుపయోగించే మొక్కజొన్న | .. | 700 | .. |
| పశువుల మేతకు ఉపయోగించే గడ్డి | .. | 39 | .. |

ఒకే నేలలో యింత పంట ఏలా తీయగలిగారు? వీరికి దండిగా పశువులున్నందువల్ల ఎరువుకు కొదవ లేదు. అందువల్ల యింత పంట తీయగలిగారు. కొన్ని సంవత్సరాల క్రితం ఎలినోవ్కా వ్యవసాయ క్షేత్రంలో (దానితో లీనమైన యితర సమిష్టి వ్యవసాయ క్షేత్రాలతోబాటు) 91 ఆవులుండేవి. ఇప్పుడు 1050 ఆవులున్నాయి. అప్పుడు యీ వ్యవసాయ క్షేత్రంలో ధాన్యం, హెక్టరుకు 8-10 సెంట్నర్లు పండేది. యీనాడు హెక్టరుకు 25-30 సెంట్నర్లు పండుతోంది.

ఈ వ్యవసాయ క్షేత్రంలో పశు సంపద ఎలా పెరిగింది? సమిష్టి వ్యవసాయదారులు మొక్కజొన్న పండించ నారంభించారు. బంజర్లను దున్నారు. వాటిలో విలువైన పంటలు పెట్టారు. ఇందువల్ల ఎక్కువ మేత లభించింది; పశువులు వృద్ధి అయినాయి. ఎరువు దండిగా వచ్చింది. పంటలు బాగా పండాయి.

దేశంలో యితరత్రా కూడా యిలాంటి వ్యవసాయ క్షేత్రాలున్నాయి. అవి మంచి పంటలు తీయడానికి దారి చూపాయి. దేశంలోని అన్ని సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలను వీటి స్థాయికి తీసుకొని రావలసిన కర్తవ్యం మనపైన ఉన్నది.

అయితే వీటిని పెంచడమంటే ఉత్త ఉపన్యాసాలు చేయడం కాదు. వెనకబడిన వాటిని అగ్ర క్షేత్రాల స్థాయికి మనం నిజంగా తీసుకు వెళ్ళాలి. విషయాలు అర్థం చేసుకోక తమ ఉత్పత్తి సామర్థ్యాన్ని దిగవేసుకుంటున్నవారిని, సమిష్టి, ప్రభుత్వ క్షేత్రాల నాయకత్వం నుండి తొలగించటమైనా చేయాలి.

ధాన్యం ఉత్పత్తి పెరిగితే, త్వరగా పశువులు వృద్ధి అవుతాయి. ధాన్యం, మేత, ఇతర పశుగ్రాసం పుష్కలంగా వుంటే, పశు సంపదను బాగా పెంపొందించవచ్చు; మాంసం, పాలు, ప్రజలకు కావలసిన యితర ఆహార పదార్థాల ఉత్పత్తికి లోటు లేకుండా చేయవచ్చు.

వ్యవసాయాభివృద్ధి ప్రణాళికను రూపొందించటంలో, మన పార్టీ

నీటి పారుదల సదుపాయాలకు ప్రత్యేక ప్రాముఖ్య మిస్తున్నది. నీటి పారుదల సౌకర్యాలు లెనిన్ విద్యుదీకరణ పథకంలో భాగమే. విద్యుదుత్పాదక కేంద్రాల నిర్మాణం, నీటి పారుదల సౌకర్యాల అభివృద్ధి అవినాభావ సంబంధం గల ఒకే కార్యక్రమమని లెనిన్ అభిప్రాయం. ట్రాన్స్ కాకేషియా, మధ్య ఆసియా భూములకు నీటి పారుదల సౌకర్యాలు ఏర్పాటు చేయవచ్చుననీ, వర్షపాతం బహు తక్కువగా వున్న ఓల్గా స్టెప్పీలకు నీరందించవచ్చుననీ, సోవియట్ పరిపాలన తొలిరోజుల్లోనే లెనిన్ కలలుగన్నాడు.

ఇప్పుడు మనకు శక్తివంతమైన పరిశ్రమలున్నాయి. కాబట్టి ఎట్టి పరిస్థితులలోనైనా వ్యవసాయోత్పత్తి నిరాటంకంగా కొనసాగించటానికి తగిన ప్రాతిపదికను ఏర్పరచేందుకై విస్తృతమైన నీటి పారుదల పథకాన్ని తయారుచేసి, దాన్ని అమలు జరిపే సమయం నేడు ఆసన్నమయింది.

పార్టీ కేంద్ర కమిటీ ఆదేశంపై, ప్రభుత్వ ఆర్థిక సమితి, నీటి పారుదల సౌకర్యాల అభివృద్ధికై ఒక దీర్ఘకాలిక ప్రణాళికను తయారు చేసింది. ప్రస్తుతం దేశంలో 90 లక్షల హెక్టర్ల భూమికి నీటి పారుదల సౌకర్యాలు వున్నాయి. ఈ సౌకర్యాలు గల భూమిని రెండు కోట్ల 80 లక్షల హెక్టర్లకు పెంచవలసి వున్నది.

దీనికై మనం చేయవలసిన పనులివి:

సిర్-దర్యా నదీ మైదానంలో పత్తి పండించటానికై విస్తార ప్రాంతాన్ని అభివృద్ధి చేయడం. ప్రాథమిక అంచనాలను బట్టి, ఈ నదీ మైదానంలో ఉజ్బెకిస్తాన్, కజకస్తాన్, తజక్ రిపబ్లిక్కులలోగల 800-850 వేల హెక్టర్ల ఎండు స్టెప్పీకి నీటి సౌకర్యాలు ఏర్పరచవచ్చు;

పత్తి, వరి, తదితర పంటలు పండించటానికై ఉజ్బెక్, తజిక్ రిపబ్లిక్కులలో 1,200,000 హెక్టర్ల భూమికి నీరందించేందుకు న్యూరెక్ పై ఒక జల విద్యుచ్ఛక్తి కేంద్రం నిర్మించడం;

పత్తి పంటను పెంచేందుకు కారా-కుం కాల్వ ద్వారా టర్క్మేనియాలో 600 వేల హెక్టర్లకు నీటి పారుదల సౌకర్యాలు కలిగించి అభివృద్ధి చేయడం;

అమూ-దర్యా, సిర్-దర్యా నదులకు దిగువ భాగంలో సుమారుగా 900 వేల హెక్టర్ల భూమికి నీటి సరఫరా ఏర్పాట్లు చేసి, అందులో కొత్తగా వరి పండించడం;

ఓల్గా-అక్టుబా వరద ప్రాంతం, ఓల్గా డెల్టాలలోని భూమి, నీటి వనరులను పూర్తిగా వినియోగించి, అక్కడి భూమిని వ్యవసాయానికి అభివృద్ధి చేయడం; కూరగాయలు, వరి, మొక్కజొన్న పండించడం; చేపలు, నీటి కోళ్లు పెంచేందుకు తగిన పరిస్థితులు కల్పించడం;

ఓల్గాపై గల లెనిన్ విద్యుదుత్పాదక కేంద్రం ద్వారానూ, 22వ మహాసభ జల విద్యుదుత్పాదక కేంద్రం ద్వారానూ, ఓల్గా ప్రాంతంలోని పంట పొలాలకు నీరందించడం;

రష్యన్ ఫెడరేషన్‌లోని యూరోపు ఖండ భూభాగంలో దక్షిణాన గల డాన్, క్యూబన్ తదితర నదీ జలాలతో పది లక్షల హెక్టర్ల భూమిని మాగాణీగా మార్చి, తద్వారా వరి, ద్రాక్ష, కూరగాయల, పారిశ్రామిక పంటల ఉత్పత్తిని పెంపొందించడం:

నీపర్, బిగ్, నీస్టర్, డాన్యూబ్ నదీ జలాలతో క్రిమియాలోనూ, ఉక్రెయిన్‌కు దక్షిణాన గల యితర ప్రాంతాలలోనూ, మాల్దేవియాలోనూ, 45 లక్షల హెక్టర్ల భూమిలో బియ్యం, మొక్కజొన్న, పంచదార దుంప, ద్రాక్ష, పళ్లు, కూరగాయలు పండించడం; పశు సంపదను అభివృద్ధి చేయడం;

ట్రాన్స్‌కాకేషియాలో పెద్ద నీటి పారుదల ప్రాజెక్టుల నిర్మాణాన్ని సాగించడం.

నీటి వనరుల అభివృద్ధి కార్యక్రమం పూర్తిగా అమలు జరిగిన తరువాత మన దేశంలో పత్తి, మొక్కజొన్న, బియ్యం, పంచదార దుంప లక్షలాది టన్నులు అదనంగా ఉత్పత్తి అవుతుంది.

మన పార్టీ, ఈతిబాధలనుండి మానవుని విముక్తిచేసి, ప్రకృతిపై మానవుని ఆధిపత్యం నెలకొల్పుతుంది.

క్రామేడ్స్, మన పరిశ్రమలు ఏ మార్గంలో అభివృద్ధి చెందాలో నేను విశ్లేషించి చూపిన సందర్భంలో, శ్రమ ఉత్పత్తి శక్తిని పెంచడం కమ్యూనిస్టు నిర్మాణానికి అతి ప్రధానమయిన సమస్యగా పేర్కొన్నాను. ఇది వ్యవసాయానికి కూడ సమానంగా అన్వయిస్తుంది.

వ్యవసాయ రంగంలో శ్రమ ఉత్పత్తి శక్తి మొదటి పది సంవత్సరాలలో 150 శాతానికి తక్కువ కాకుండా పెరుగుతుందనీ, 20 సంవత్సరాలలో ఇది అయిదారు రెట్లు పెరుగుతుందనీ కమ్యూనిస్టు ముసాయిదా కార్యక్రమంలో అంచనా వేశాము. ఇది కష్టమైన పని. అయితే యీ సమస్య పరిష్కారం కావడానికి దారి ఏర్పడింది. వ్యవసాయ రంగంలోని వివిధ శాఖలలో కమ్యూనిస్టు సమాజానికి తగినటువంటి ఆదర్శప్రాయులైన శ్రామికులున్నారు.

వ్యవసాయ రంగంలో ప్రధాన శాఖల్లోని ప్రముఖ సమిష్టి వ్యవసాయదారుల ఉత్పాదక శక్తిని పరిశీలించి చూద్దాం.

ధాన్యం ఉత్పత్తి దేశంలోని ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో 1 సెంట్నరు ధాన్యం పండించడానికి సగటున పట్టే కాలం 2.1 గంటలు. అందుకయ్యే వ్యయం 4 రూబుళ్ళ 10 కోపెక్కులు.

రొస్తొవ్ ప్రాంతంలోని గిగాంట్ ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రంలో 1 సెంట్నరు ధాన్యం ఉత్పత్తికి పట్టేకాలం 38 నిమిషాలే. అంటే మూడింట ఒకపాలన్నమాట. ఇందుకయ్యే వ్యయం 1 రూబుల్ 53 కోపెక్కులు.

పంచదార దుంప ఉత్పత్తి ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో 1 సెంట్నరు దుంపలు ఉత్పత్తి చేయడానికి దేశం మొత్తం పై పట్టే సగటు కాలం 3.2 గంటలు; ఇందుకయ్యే వ్యయం 1 రూబుల్ 80 కోపెక్కులు. పంచదార బీటు దుంపలను సంపూర్ణంగా యంత్రాల సహాయంతో ఉత్పత్తి చేస్తున్న క్రాస్నొదార్ ప్రాంతంలో పనిచేస్తున్న వి. ఎ. సెట్లిచ్నీ బృందం 1 సెంట్నరు దుంపలు ఉత్పత్తి చేయడానికి వెచ్చించే కాలం 17 నిమిషాలు

మాత్రమే. ఇది దేశం మొత్తంపై పట్టే శ్రమకాలంలో 1/11వ భాగం. ఇందుకై ఈ బృందం వెచ్చించే డబ్బు 30 కోపెక్కులు. ఇది దేశం మొత్తంపై అయ్యే సగటు వ్యయంలో 1/6వ భాగం.

పత్తి ఉత్పత్తి: ఉజ్బెకిస్తాన్‌లోని ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో ఒక సెంట్నరు పత్తి పండించడానికి సగటున 52 గంటల కాలం పడుతుంది. ఇందుకయ్యే ఖర్చు 25 రూబుళ్లు 30 కోపెక్కులు. ఈలోగా. తాష్కెంట్ ప్రాంతంలోని మారెక్ ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రంలోని కామ్రేడ్స్ కుబీవ్ బృందం అన్ని పనులూ యంత్రాలతో చేసి ఒక సెంట్నర్ పత్తి పండించడానికి 7 రూబుళ్ళు 30 కోపెక్కుల వ్యయంతో. 10 గంటల శ్రమకాలం వెచ్చించారు.

పశు సంబంధమైన పరిశ్రమలు: ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో 10-12 ఆవుల కొక్క పాల పనికత్తె చొప్పున, కాయకష్టం ద్వారా ఏడాదికి, తలా 30-40 టన్నుల పాలు పిండుతున్నారు. ఇవనోవో ప్రాంతం లోని షుయిస్కీ ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రంలో జినైదా జబోటినా అనే పాల పనికత్తె సాధించిన ఫలితాలు వేరువిధంగా వున్నాయి. ఈమె వున్న వ్యవసాయ క్షేత్రంలో పని యావత్తూ యంత్రాల సహాయంతో సాగుతున్నది. ఇక్కడ హెర్రింగ్‌బోన్ పద్ధతి నిర్మాణాలున్నాయి. 1960లో కామ్రేడ్స్ జబోటినా 150 ఆవులను పెంచుతూ, 307 టన్నుల పాలు పిండింది. 1961లో ఆమెతోపాటు ఆమె భర్త డిమిత్రీ జబోతిన్ కూడా (ఇతనొక మెకానిక్) ఈ పనిలో చేరాడు. ఇద్దరూ కలిసి 300 ఆవులను పెంచుతున్నారు. ఈ ఆవులనుండి 650 టన్నుల పాలు తీయాలని నిశ్చయించుకొన్నారు. ఇప్పటికే 510 టన్నుల పాలు తీశారు. వీరు సెంట్నరు పాలు తీయడానికి వెచ్చించిన శ్రమకాలం 4.8 గంటలు. దేశం మొత్తంపై ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో, సెంట్నరు పాలు ఉత్పత్తికి సగటు శ్రమ కాలం 14 గంటలు.

ఈ ఉదాహరణల నుండి మనం ఏం నిర్ధారణ చేయవచ్చు? దేశంలో

అగ్రస్థానంలో వున్న ప్రభుత్వ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోని శ్రామికుల ఉత్పాదక శక్తి యిప్పటికే అనేక ప్రభుత్వ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోని శ్రామికుల ఉత్పాదక శక్తికన్న అయిదారు రెట్లు. ఆపైగానూ ఎక్కువ. శ్రామికుల ఉత్పాదక శక్తి విషయంలో యీ పురోగమనం సాధించటానికి యీ వ్యవసాయ క్షేత్రాలకు దశాబ్దాలు పట్టలేదు. గత కొద్ది సంవత్సరాల లోనే యీ అభివృద్ధి సాధించాయి. దేశంలోని అన్ని సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలోనూ శ్రామికుల ఉత్పాదక శక్తి అద్యతన భవిష్యత్తు లోనే యీ స్థాయి అందుకొనేలా. ఉత్పత్తి కార్యక్రమాలను నిర్వహించడం మన కర్తవ్యం.

ఇది కష్టమయిన పనే. ఇది నెరవేర్చటానికి పార్టీ, ప్రజలూ గొప్ప కృషి చేయవలసి వుంటుంది. ప్రభుత్వం డబ్బు రూపంలోనూ, వస్తురూపం లోనూ చాలా పెట్టుబడి పెట్టవలసి వుంటుంది. ఇంతేకాదు. ప్రవాహం ఎలా యీడిస్తే మనం అలా కొట్టుకొని పొయ్యే ధోరణి ఆగాలి. ఎందుకంటే యిది అనేక సందర్భాలలో మన వ్యవసాయాభివృద్ధిని అరికడుతున్నది. నేటికీ కొన్ని పార్టీ సంస్థలు వ్యవసాయోత్పత్తి విషయంలో చొరవతో జోక్యం కలిగించుకొని దాన్ని సమర్థవంతంగా నడిపించేందుకు పూనుకోవడం లేదు. ఈ రంగంలో గత కాల ప్రభావం యింకా పోలేదు. గతంలో వ్యవసాయ రంగంలో పనివారికి కొరత వుండేది. ఉత్పత్తి అవసరాలకు తగినంత మంది లేక, ఉన్నవారితోనే సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను నిర్వహించవలసి వచ్చేది.

ఇప్పుడు పరిస్థితి మారింది. వ్యవసాయాన్ని యంత్రాలతో నిర్వహించడం రానురాను ఎక్కువవుతూ వుంది. వ్యవసాయ రంగం అవసరాలు పెరుగుతూ వున్నాయి. వ్యవసాయ రంగానికి సంబంధించిన పాత పద్ధతులూ, కాలదోషం పట్టిన అభిప్రాయాలూ పోవాలి. సాధ్యమయినంత తక్కువ మందితో సాధ్యమయినంత ఎక్కువ ఉత్పత్తి జరిగేలా చూడటం అన్నిటికన్నా ప్రధానమయిన విషయం.

కాబట్టి వ్యవసాయ రంగంలోని ప్రతి శాఖలోనూ యాంత్రీకీకరణా, విద్యుదీకరణా మరింత ఎక్కువగా జరగాలి. వ్యావసాయక యంత్రాలను మరింత బాగా వినియోగించాలి. మనం నిర్వహించవలసిన ప్రధాన కర్తవ్యాలలో యిదొకటి. ఇదంతా మన సిబ్బంది యొక్క, అంటే ఎవరికైతే యీ వ్యావసాయక యంత్రాలను అప్పజెప్పామో వారియొక్క అనుభవం పైనా, కార్య నిర్వహణ శక్తి పైనా ఆధారపడి వుంది. సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో శ్రామికుల ఉత్పాదక శక్తి పెంచడానికై, వారితో యితోధిక కాయకష్టం చేయించరాదు: వారికి యితోధికంగా అధునిక యంత్రాలను సరఫరా చేయాలి.

వ్యవసాయోత్పత్తికి సంబంధించిన ఆధునిక సాంకేతిక పద్ధతులకు అనుగుణమైన యంత్రాలను, సాధ్యమయినంత త్వరలో, అన్ని సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలకు సరఫరా చేయాలి. ధాన్యం పంటల నూర్పిళ్లు ఆధునిక పద్ధతులలో కొనసాగించేందుకు తగిన యంత్రాలను అభివృద్ధి చేయడం, మొక్కజొన్న, పత్తి, నార, పంచదార దుంప, బంగాళాదుంప, మొదలగు పంటలను సాగుచేయడం, పశు పోషణకు సంబంధించిన పనులకు పూర్తిగా యంత్రాలను వినియోగించడం—వీటిని గురించి మనం ప్రత్యేక శ్రద్ధ వహించవలసి వుంటుంది.

ఇప్పటికన్న బాగా పనిచేసే యంత్రాలను, ముఖ్యంగా ట్రాక్టర్లను, కోత యంత్రాలను, రవాణా సాధనాలను ప్రవేశ పెట్టాలి. ఉదాహరణకు 200-220 అశ్వశక్తి గలిగి, వేగంగా పోగల కొత్తరకం ట్రాక్టర్లనూ, వాటిని మన దేశంలోని స్టెప్పీలలో ఉపయోగించడానికి అవసరమయిన పరికరాలనూ మనం, ఉత్పత్తి చేయవచ్చు; చేయాలి కూడ. ఈ సమస్యపై పార్టీ కేంద్రకమిటీ, సోవియట్ మంత్రిమండలి ఇదివరకే ఒక నిర్ణయం చేశాయి. ఇటువంటి ట్రాక్టర్లు, ఇప్పుడు మనం ఉపయోగిస్తున్న డి.టి-54 రకం ట్రాక్టర్లకన్న 3, 4 రెట్లు బాగా పని చేస్తాయి. ఇవి ఆర్థికంగాకూడ చాలా లాభదాయకమయినవి. పదిలక్షల హెక్టర్ల సాగులాయికీ భూమిని దున్నడంలో

శక్తివంతమైన ట్రాక్టర్లను ఉపయోగించటం వల్ల కలిగే లాభాలను గురించి నిపుణులు సమర్పించిన అంచనాలను ఉదహరిస్తున్నాము :

| | డి.టి_54 | 200_220 హెచ్.పి. ట్రాక్టరు |
|---|---|---|
| రోజుకు సగటున చేసే పని | 7.6 హెక్టర్లు | 21.2 హెక్టర్లు |
| అకురాలు కాలంలో దున్నటానికి వినియోగించే ట్రాక్టర్ల సంఖ్య (20 రోజులు, రోజూ రెండు షిఫ్టులు) | 6,600 | 2,400 |
| ట్రాక్టర్ చోదకుల సంఖ్య | 13,200 | 4,800 |

ఇది పది లక్షల హెక్టర్ల దున్నకానికి సంబంధించిన అంచనా. ఈ శక్తివంతమైన ట్రాక్టర్లను ఉపయోగించటానికి వీలైన భూమి దేశంలో 8 కోట్ల హెక్టర్ల వరకూ వుంది. కాబట్టి, యీ ట్రాక్టర్ల మూలంగా కలిగే ఆర్థిక లాభాలు యింతకన్నా అనేక రెట్లు హెచ్చుతాయి.

ట్రాక్టర్ల, తదితర వ్యావసాయక యంత్రాల ఉత్పత్తిని మరింత పెంపొందించడానికి మనం గట్టి చర్యలు తీసుకోవలసి వున్నది. ట్రాక్టర్లనూ తదితర వ్యావసాయక యంత్రాలను ఉత్పత్తి చేసే ఫాక్టరీల విస్తరణకు పూనుకోవాలి. ఈ ఫాక్టరీలలో ఆధునిక యంత్రాలను సమకూర్చాలి. నూతన సాంకేతిక విధానాల అభివృద్ధికి సంబంధించిన సమస్యలను పరిష్కరించగల శక్తీ, అనుభవమూ గల సిబ్బందిని యంత్రాల నమూనాలు తయారు చేసే కార్యాలయాల్లో నియమించాలి.

కామ్రేడ్స్, గ్రామీణ ప్రాంతాలలో ఉత్పత్తి శక్తుల అభివృద్ధికీ, కమ్యూనిస్టు సామాజిక సంబంధాలను నెలకొల్పడానికీ మధ్య అవినాభావ సంబంధ మున్నదని మన పార్టీ కార్యక్రమ ముసాయిదా భావిస్తున్నది. ఇది సహజమే. ఎందుకంటే, పని సాగే క్రమంలో, ఉత్పత్తి అభివృద్ధి అయ్యే పరిణామంలో, కమ్యూనిస్టు వ్యవస్థా నిర్మాణానికై దేశ వ్యాప్తంగా జరిగే పోరాటంలో కమ్యూనిస్టు సామాజిక సంబంధాలు రూపొందుతాయి.

కమ్యూనిజం వైపుకు మన పల్లె పట్టులు పురోగమించేటప్పుడు వాటిలో పొడసూపే విశిష్ట లక్షణమేమి? సాంకేతిక పరికరాల విషయం లోనూ, ఉత్పత్తి నిర్వహణలోనూ, మన సోషలిస్టు వ్యవసాయం పరిశ్ర మల స్థాయిని సమీపిస్తుంది. అంటే, పని స్వభావంలో గుణాత్మకమైన మార్పులు వస్తాయి.

సమిష్టి వ్యవసాయదారుల, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్ర కార్మికుల సాం స్కృతిక, సాంకేతిక నైపుణ్య స్థాయి పెరుగుదలతోనూ, వ్యవసాయంలోని అన్ని శాఖలకూ ఆధునిక యంత్రాలు సమకూరడంతోనూ, వ్యవసాయ క్షేత్రాలలోని పనివారు ఒక రకమైన పారిశ్రామిక కార్మికులుగా అభివృద్ధి అవుతారు.

గ్రామీణ ప్రాంతాలలో కమ్యూనిస్టు వ్యవస్థను నిర్మించడానికై మనం, సోషలిస్టు వ్యవసాయ విధానం అభివృద్ధి చేయడంలో ఆర్జించిన అనుభవాన్ని ఆధారంగా చేసుకోవాలి. ఈ అనుభవం తెలియజేస్తున్న దేమిటి? సోవియట్ వ్యవసాయంలో రెండు రకాల సోషలిస్టు సంస్థలు అవతరించాయి—ఒకటి ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు; రెండు సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు.

లెనిన్ చొరవ మూలంగా, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు, ప్రభుత్వం నిర్వహించే సోషలిస్టు వ్యవసాయ సంస్థలుగా స్థాపించబడ్డాయి. చిన్న చిన్న భూకమతాలను రైతులు ఎవరంతకు వారు సాగు చేయడంకన్నా పెద్ద పెద్ద వ్యవసాయ క్షేత్రాలను సోషలిస్టు ప్రాతిపదికపై సమిష్టిగా సాగు చేయడం ఎలా లాభదాయకమో చూపడం, వ్యవసాయ క్షేత్రాలు ఎలా నిర్వహింప బడాలో చుట్టూరా గల రైతులకు ప్రత్యక్షంగా చూపడం వీటి ఉద్దేశం.

ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల అభివృద్ధికై లెనిన్ రూపొందించిన ప్రణాళికను మన పార్టీ జయప్రదంగా అమలు జరిపింది. ప్రభుత్వ వ్యవ సాయ క్షేత్రాలు నేడొక మహా శక్తిగా రూపొందాయి. అవి, ఆధునిక యంత్రాలను, విజ్ఞానశాస్త్రం సాధించిన సరికొత్త విజయాలను విస్తారంగా వినియోగించే గొప్ప ఉత్పత్తి సంస్థలుగా అభివృద్ధి చెందాయి. వీటిలో శ్రామి

కుల ఉత్పాదక శక్తి ఎక్కువ పెరిగింది. ఇందువల్ల చవకగా వ్యవసాయ వస్తువులను ఉత్పత్తి చేస్తున్నాము. 1960లో, ఒక్క సెంట్నర్ ధాన్యం (మొక్కజొన్నను మినహాయించి) పండించేందుకు ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో 2.1 గంటలు శ్రమించవలసివస్తే, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో అందుకు పట్టిన శ్రమకాలం 7.2 గంటలు. ఒక సెంట్నరు పాలు ఉత్పత్తికి ప్రభుత్వ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో పట్టిన శ్రమకాలం వరుసగా, 14.2 గంటలు, 20.8 గంటలు. పశువుల బరువు ఒక సెంట్నరు పెంచేందుకు ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో 66 గంటల మానవ శ్రమ అవసరమయితే, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో 118 గంటల మానవ శ్రమ అవసరమయింది. అదేవిధంగా పందుల బరువులో ఒక సెంట్నరు పెరుగుదలకు యీ రెండు రకాల వ్యవసాయ క్షేత్రాలలో పట్టిన శ్రమకాలం వరుసగా 57 గంటలూ, 133 గంటలు.

కేంద్ర కమిటీ నివేదికలో పేర్కొన్నట్లు, వ్యవసాయ సరకుల ఉత్పత్తిలో ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల పాత్ర గత కొద్ది సంవత్సరాలలో చాలా హెచ్చింది. బీడు భూములను సాగులోనికి తీసుకొని రావడంలోనూ, పెద్ద పెద్ద నగరాలకు, పారిశ్రామిక కేంద్రాలకు పాలు, బంగాళా దుంపలు, కూరగాయలు సరఫరా చేసే సమస్యను పరిష్కరించడంలోనూ ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో గల లాభాలు బాగా వ్యక్తమయ్యాయి.

అయితే దేశంలోని ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలన్నీ నేడు ఆదర్శప్రాయమైన వ్యవసాయ సంస్థలని చెప్పడం లేదు. తమకు గల శక్తి నంతటిని ఉపయోగించుకోవడానికీ, భారీ యాంత్రిక వ్యవసాయానికి గల అవకాశాలను మరింత చక్కగా, సంపూర్తిగా వినియోగించుకోవడానికీ ప్రతి ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రంలోనూ చేయవలసిన పని చాలా వుంది.

సోషలిస్టు వ్యవసాయం యొక్క రెండవ రూపం సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు. కోట్లాది చిన్న చిన్న కమతాలపై జరిగే రైతుల వైయ్యక్తిక వ్యవసాయాన్ని సోషలిస్టు వ్యవస్థకు పరివర్తన చేయడానికై లెనిన్

సూచించిన రూపమిది. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు సోవియట్ రైతులను కమ్యూనిజానికి తయారు చేసే పాఠశాలలుగా పనిచేస్తున్నాయి. వ్యక్తిగత యాజమాన్యానికి సంబంధించిన అలవాట్లు రైతులలో శతాబ్దాలుగా నెలకొని వున్నాయి. వీటిని పోగొట్టి, వీరు సమిష్టిగా పనిచేయడానికీ, భారీ ఎత్తున సమిష్టి వ్యవసాయం కొనసాగించటానికీ అలవాటుపడేలా యివి చేశాయి. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు చాలా పురోగమించాయి. ఇవి ఏర్పడిన తొలి రోజుల్లో వీటికున్నదల్లా పురాతన కాలపు వ్యవసాయ పరికరాలే. ఆనాడు పనికి సంబంధించిన నిర్మాణమూ చాలా తక్కువ స్థాయిలో వుండేది. రైతులు తమ కుటుంబ సభ్యుల సంఖ్యను బట్టి ఆదాయాన్ని పంచుకొనే వారు. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో తేడా అప్పటికీ యిప్పటికీ హస్తిమ శకాంతర ముంది. నేటి సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో వ్యవసాయం యంత్రాలతో భారీ ఎత్తున సాగుతున్నది. పార్టీ తీసుకొన్న చర్యల మూలంగా గత కొద్ది సంవత్సరాలుగా సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు చాలా పురోగమించాయి. వ్యవసాయ క్షేత్రాల ఉమ్మడి ఆస్తులు చాలా పెరిగాయి. వాటి వ్యవసాయోత్పత్తి హెచ్చింది. సమిష్టి వ్యవసాయదారుల జీవన ప్రమాణం హెచ్చింది.

కొంతమంది కామ్రేడ్స్ ఏమని ప్రశ్నిస్తున్నారంటే, వ్యవసాయ రంగంలో భవిష్యత్ పురోగమనం ఏ మార్గంలో సాగుతుంది? సమిష్టి వ్యవసాయ క్షేత్రం మార్గంలోనా, లేక ప్రభుత్వ వ్యవసాయ క్షేత్ర మార్గంలోనా? ఈ రెండు సోషలిస్టు ఉత్పత్తి రూపాలనూ అభివృద్ధి చేయడం ద్వారా, గ్రామీణ ప్రాంతాలలో కమ్యూనిస్టు వ్యవస్థ నిర్మాణం కొనసాగుతుందని పార్టీ భావిస్తున్నది. ఈ రెండు సోషలిస్టు వ్యావసాయక రూపాలను ఒక దానికొకటి పోటీ పెట్టరాదు. ప్రభుత్వ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు రెండూ భారీ సోషలిస్టు సంస్థలే. సాంకేతిక, శాస్త్రీయ రంగాలలోని విజయాలను సమర్థవంతంగా వినియోగించుకోవడానికీ, సామాజికోత్పత్తి సత్వరంగా పెంపొందడానికి రెంటిలోనూ అపారావకాశాలున్నాయి. భౌతిక వనరులు

సమానంగా ఉంటే, ఉత్పత్తికి సంబంధించిన నిర్మాణం చక్కగా వుంటే, పని నిర్వహణ సమర్థవంతంగా సాగితే యీ రెండు రూపాలూ సత్ఫలితాలిస్తాయి.

ప్రస్తుతం ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో కన్నా అనేక సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో శ్రామికుల ఉత్పాదక శక్తి తక్కువగానూ, ఉత్పత్తి వ్యయం ఎక్కువగానూ ఉన్నదంటే, యిందుకు కారణం, సమిష్టి వ్యవసాయ క్షేత్ర స్వరూపానికి కాలదోషం పట్టడం కాదు; ఈనాటి ఉత్పాదక శక్తుల అభివృద్ధికి యీ రూపం అనుగుణంగా లేకపోవడం కాదు. దీనికి కారణం వేరు. ఉత్పత్తికి సంబంధించిన నిర్మాణంలోనూ, నిర్వహణలోనూ, ప్రస్తుత సాంకేతిక స్థాయిలోనూ గల లోట్లు దీనికి ప్రధాన కారణం.

అనుభవం గల సిబ్బందీ, మంచి ఆర్గనైజర్లు, నిపుణులూ ఎక్కడైతే వున్నారో, ఎక్కడైతే ఉత్పత్తి యాంత్రికీకరణకు తగినంత ప్రాధాన్యమిస్తున్నారో, బాగా పనిచేసేవారికి తగిన ప్రతిఫలం ముట్టజెప్పి ప్రోత్సహించాలనే సూత్రాన్ని ఎక్కడైతే ఉచిత రీతిని వర్తింప చేస్తున్నారో అక్కడల్లా ప్రభుత్వ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు రెండూ సమానంగా అభివృద్ధి చెందుతున్నాయి. సమిష్టి వ్యవసాయ క్షేత్ర ఆర్థిక వ్యవస్థ సత్వరాభివృద్ధికి అవసరమయిన భౌతిక పరిస్థితులు ప్రతి చోటా వున్నాయని, యీ సందర్భంలో నొక్కి చెప్పడం అవసరం.

ఉత్పత్తికి సంబంధించిన నిర్మాణాన్ని మెరుగుపరుచుకొనేందుకు, ఆధునిక యంత్రాలను, శాస్త్రీయ పురోగమనాన్ని సంపూర్ణంగా వినియోగించుకొనేందుకు, తద్వారా శ్రామికుల ఉత్పాదక శక్తిని పెంపొందించుకొనేందుకు అవసరమయిన సహాయం సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకు యివ్వడం అవసరం. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో బలహీనంగా వున్నవాటికి సమర్థవంతమైన సిబ్బందిని, అంటే సమిష్టి వ్యవసాయ క్షేత్ర అధ్యక్షుల్ని, శ్రామిక బృంద నాయకుల్ని, క్షేత్ర నిపుణులను నియమించాలి. అన్ని సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను అగ్ర ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల స్థాయికి తీసుకరావటం కర్తవ్యం.

సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను అభివృద్ధి చేయటానికీ, వాటిని పటిష్ఠం చేయటానికి ప్రభుత్వం ఎంతో శ్రద్ధ తీసుకొంటున్నది. ప్రభుత్వ ప్రణాలిక లను తు.చ. తప్పకుండా అమలు జరపటం, ఉత్పత్తినీ, యితర ఉమ్మడి ఆస్తులనూ పెంపొందించటం, సమిష్టి వ్యవసాయదారుల ఉత్పాదక శక్తి పెరుగుదలతోపాటు వారి ఆదాయం కూడా పెరిగేలా జాగ్రత్త వహించడం తమ పవిత్ర కర్తవ్యాలుగా ప్రతి సమిష్టి వ్యవసాయ క్షేత్రం కూడా భావించాలి.

అగ్ర సోషలిస్టు వ్యవసాయ సంస్థలైన ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు వ్యవసాయ రంగంలో ప్రముఖ స్థానం అలంకరిస్తున్న సంస్థలు. వ్యవసా యాన్ని మరింత అభివృద్ధి చేసి, దేశంలో వ్యవసాయ సరుకులను సమృద్ధిగా ఉత్పత్తి చేయటంలో యివి యింకా ముఖ్యమైన పాత్ర నిర్వహిస్తూ వస్తాయి. ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలను, ధాన్యం, పత్తి, మాంసం, పాలు, ఉన్ని, కూరగాయలూ, పళ్లు, టీ ఉత్పత్తి చేసే మేలిరకం ఫాక్టరీ లుగా మార్చాలి. ఉత్పత్తికి సంబంధించిన నిర్మాణంలోనే కాక, జీవన పరిస్థితులు, సంస్కృతి, చైతన్యాభివృద్ధి మొదలగు విషయాలలో కూడా ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు యితర సంస్థలకు ఆదర్శప్రాయంగా వుండాలి.

సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో ఉత్పత్తీ, సామాజిక సంబంధాలూ పురోగమించేకొద్దీ వ్యవసాయం యిప్పటికన్నా ఉన్నత స్థాయి నందుకొంటుంది. ఉత్పత్తి, వినియోగాలలో మనం కమ్యూనిస్టు రూపాలు చేపట్టేందుకు అవకాశాలేర్పడుతాయి. తగిన ప్రతిఫలం ముట్టజెప్పడం ద్వారా బాగా పనిచేసే వారిని ప్రోత్సహించాలనే సూత్రం, యీ లక్ష్య సాధనలో ముఖ్యమైన పాత్ర వహిస్తుంది. సమాజం కోసం ఎక్కువ సరకులను ఉత్పత్తి చేసేవారిని ప్రోత్సహించేందుకు నైతిక, భౌతిక ప్రేరణ శక్తులు రెండూ కలసి వుండేలా చూడాలి. పనిలో యితరులకు ఆదర్శప్రాయంగా వున్నవారిని గురించి తగిన ప్రచారం యివ్వటం ద్వారా చక్కని క్రమశిక్షణను, కమ్యూనిస్టు చైతన్యాన్ని పెంపొందించాలి.

కామ్రేడ్స్, వ్యవసాయాభివృద్ధికి మన పార్టీ మహత్తరమైన ప్రణాళికను తయారు చేసింది. ఎంత క్లిష్టమయిన పరిస్థితుల్లో మనం వ్యవసాయ రంగంలో సోషలిస్టు వ్యవస్థను నిర్మించామో మన కందరికీ జ్ఞాపక ముంది. లెనిన్ ఆదేశాలను అనుసరించి, కమ్యూనిస్టు పార్టీ తానెదుర్కొన్న కష్టాలను నేర్పుతో అధిగమించి, రైతాంగాన్ని సోషలిస్టు పథంలో నడిపించింది. నేడు మనం కమ్యూనిస్టు నిర్మాణ మనే రాజ పథంలో సాగిపోతున్నాము. మనకు అద్భుతమైన అవకాశాలు కనిపిస్తున్నాయి. అయితే మన పురోగమనం అప్రయత్నంగా, సులభంగా, నిరాటంకంగా సాగుతుందని అనుకోవద్దు.

వ్యవసాయ సరకులు పుష్కలంగా వుండేలా వాటిని ఉత్పత్తి చేయాలంటే ఎన్నో పెద్ద అవరోధాలను ఎదుర్కొనవలసి వుంటుంది; ఎన్నో క్లిష్టమైన సమస్యలను పరిష్కరించవలసి వుంటుంది. చరిత్రాత్మకమైన తన అపారానుభవాన్ని ఆధారంగా చేసుకొని పార్టీ ధైర్యంతో, ఆత్మ విశ్వాసంతో రైతాంగాన్ని కమ్యూనిజం వైపుకు నడిపిస్తుంది.

## 3. ప్రజల సంక్షేమాభివృద్ధి; శ్రామికులకు అత్యున్నత జీవన ప్రమాణాల సాధన

కామ్రేడ్స్, అన్ని పెట్టుబడిదారీ దేశాల్లో కన్న ఉన్నతమయిన జీవన ప్రమాణాన్ని వచ్చే 20 సంవత్సరాలలో సాధించడం; భౌతిక, సాంస్కృతిక సంపత్సమృద్ధిని సాధించేందుకు అవసరమయిన పరిస్థితులను సృష్టించడం అనే మహత్తర కర్తవ్యాన్ని సోవియట్ దేశ కమ్యూనిస్టు పార్టీ ముందుంచుతున్నది.

మొదటి పది సంవత్సరాలలోనే సోవియట్ ప్రజలలోని అన్ని తరగతుల వారికీ, ఏ లోటు లేకుండా, కావలసినవన్నీ సమకూడుతాయి, వీరువారనకుండా ప్రతిమనిషికీ సంబంధించిన విషయంలో పెట్టుబడిదారీ విధానంపై తనదే ఖండితంగా పైచేయి అని, కమ్యూనిజం యీ

విధంగా నిరూపిస్తుంది. చరిత్రలో మొట్టమొదటి సారిగా వస్తువుల కొరత అనేది ఎన్నటికీ లేకుండా చేస్తున్నాము. ఇది కొత్త సమాజం సాధించుకున్న అద్భుతావహమయిన విజయం. ఏ పెట్టుబడిదారీ దేశం కూడ యీ కర్తవ్యాన్ని నిర్వహించడానికి పూనుకోజాలదు.

మన ప్రజలు అత్యున్నతమయిన జీవన ప్రమాణాన్ని అందుకొనేలా చేయగల ప్రధానమయిన అంశాలు రెండు. ఒకటి, శ్రామికుల ఉత్పాదక శక్తి, సమస్త సామాజిక ఉత్పత్తి, జాతీయాదాయం, పెట్టుబడిదారీ విధానమెన్నటికీ అందుకోలేని స్థాయికి పెంపొందడం రెండవది, వర్ధమాన ఉత్పాదక శక్తులను, సామాజిక సంపదను సమస్త ప్రజల శ్రేయస్సుకు వినియుక్తం కావడం. కాబట్టి, "ప్రజాసంక్షేమం" పేరుతో ప్రచారమవుతున్న అనేక బూర్జువా పథకాలు ప్రజలను మోసం చేయటానికి సాగుతున్న నూతన ప్రయత్నాలుకాగా, సర్వసమృద్ధి సాధనకై రూపొందించబడ్డ కమ్యూనిస్టు కార్యక్రమం సుస్థిరమైన పునాదిపై నెలకొనివుంది.

ఒక వైపు భారీ పరిశ్రమలను, జాతీయ ఆర్థిక వ్యవస్థలోని ఇతర శాఖలను అభివృద్ధి చేస్తూనే, మరోవైపు ప్రజల జీవన ప్రమాణాన్ని అద్యతన భావిలోనే అధికాధికంగా పెంచగలమనీ, అలా పెంచి తీరాలనీ పార్టీ భావిస్తున్నది. వచ్చే పది సంవత్సరాలలో ప్రజల తలసరి వాస్తవాదాయం రెండు రెట్లు పెరుగుతుంది; 20 సంవత్సరాలలో 250 శాతాన్ని మించి పెరుగుతుంది. ప్రజల వాస్తవాదాయాల పెరుగుదలకు మూలం, సోవియట్ యూనియన్ జాతీయాదాయం పెరుగుదలే. సోవియట్ యూనియన్ జాతీయాదాయం 1980 నాటికి 72_75 వేలకోట్ల రూబుళ్ళకు పెరుగుతుంది. ఇది 1960లో కన్న సుమారు అయిదు రెట్లు ఎక్కువ.

ప్రజల జీవన ప్రమాణాలను పెంచడంలో మనం అనుసరించవలసిన ప్రధాన మార్గాలేవి ?

వచ్చే కొద్ది సంవత్సరాలలో, అన్ని తరగతులకు చెందిన ప్రజలకు అతి నాణ్యమైన మంచి ఆహారం లభిస్తుంది. వచ్చే పది సంవత్స

రాలలో ప్రజలు తినే తిండి తలసరి పెరుగుదల ఇలా ఉంటుంది: మాంసం, మాంసంనుండి తయారయిన ఆహార పదార్థాలు—2.5 రెట్లు; పాలు, పాలనుండి తయారయ్యే పదార్థాలు—2 రెట్లు; వెన్న—1.5 రెట్లు; వనస్పతి నూనె—2 రెట్లు; గుడ్లు—2.2 రెట్లు; చేపలు, చేపలనుండి తయారయిన పదార్థాలు—1.5 రెట్లు; పంచదార—1.5 రెట్లు; కూరగాయలు, పుచ్చకాయలు—2.3 రెట్లు; పళ్లు, బేరీపళ్లు—సుమారు 5 రెట్లు; రొట్టె, బంగాళా దుంపల వాడకం మాత్రం కొద్దిగా తగ్గుతుంది. దీనినిబట్టి, మనం తినే తిండిలో చాలా విలువైన, పుష్టికరమైన, పదార్థాల వంతు ఎక్కువవుతుందనేది స్పష్టం. భోజనం హోటళ్ళను బాగా అభివృద్ధి చేస్తాము. ఇవి, వచ్చే పది సంవత్సరాలలో మూడు రెట్లకు పైగా, వచ్చే 20 సంవత్సరాలలో సుమారమి 13 రెట్లూ పెరుగుతాయి. ఇంట్లో వండుకోవడం తగ్గిపోయి, ఆహారపానాలకు ప్రజలు హోటళ్ళకు వెళ్ళడం క్రమక్రమంగా పరిపాటి అవుతుంది. హోటళ్ళలో రేట్లు క్రమంగా తగ్గించబడుతాయి.

వచ్చే పది సంవత్సరాలలో సోవియట్ ప్రజలందరికీ తగినన్ని వినియోగ సరకులు లభ్యమవుతాయి. ఆ తరువాత పది సంవత్సరాలలో ఇవి గిరాకీకి తగినన్ని సంపూర్ణంగా లభ్యమవుతాయి. ప్రణాళిక ప్రకారం వచ్చే 20 సంవత్సరాలలో మనిషి 1కి సగటున వస్త్రాల, జోళ్ళ వినియోగం 3.5 రెట్లూ, గృహావసరాలూ తదితర వినియోగ సరకుల వాడకం 5.5 రెట్లూ పెరుగుతుంది. కుర్చీలూ, బల్లలూ మొదలగు సామానుల ఉత్పత్తి 6-8 రెట్లు పెరుగుతుంది. గృహావసరాలకు ఉపయోగించే ఆధునిక విద్యుచ్ఛక్తి యంత్రాలు, పరికరాలవల్ల గృహాల విద్యుదీకరణ అమలు జరుగుతుంది.

ప్రభుత్వమూ, సహకార సంఘాలు పట్టణాల్లోనూ, గ్రామాలలోనూ నిర్వహించే చిల్లర వ్యాపారం పదేళ్ళలో 2.5 రెట్లూ, 20 సంవత్సరాలలో 5 రెట్లూ పెరుగుతుంది (ధరలనుబట్టి). లాండ్రీలు, బట్టలు, జోళ్ళు, గృహోపకరణాలు మొదలైనవాటి మరమ్మత్తు కొట్లు తగినన్ని నెలకొల్ప

బడుతాయి. పైనబడిన జీవితంలో ఇంట్లో చేసుకొనే చిల్లరమల్లర పనులను బయట చేయించుకోగోరే వారికోసం మనం రకరకాల పబ్లిక్ సర్వీసులను ఏర్పాటు చేయవలసి వుంటుంది.

గృహ నిర్మాణ సమస్య శాశ్వత పరిష్కారానికి కమ్యూనిస్టు పార్టీ, సోవియట్ ప్రభుత్వమూ ప్రత్యేక ప్రాముఖ్య మిస్తున్నవి. ఏ సామాజిక వ్యవస్థా ఈ సమస్యను పరిష్కరించలేకపోయింది. నేడు మన దేశంలో గృహ నిర్మాణం ఇదివరకెన్నడూ జరుగనంత పెద్ద ఎత్తున సాగుతున్నది. గత 5 సంవత్సరాలలోనే సుమారు 5 కోట్ల ప్రజలకు నివాస సౌకర్యాలు ఏర్పాటు చేశాము. వచ్చే పది సంవత్సరాలలో ఇళ్ళ కొరత అనేది లేకుండా చేయాలి. రెండవ దశాబ్దం పూర్తి కాగానే ప్రతి కుటుంబానికి అన్ని వసతులు గల ప్రత్యేకమైన వాటా ఉంటుంది. ఇందుకై 20 సంవత్సరాలలో దేశంలో నివాస సౌకర్యాలను సుమారు 200 శాతం పెంచవలసి వుంటుంది. 1961_65 మధ్యకాలంలో ఏటా సగటున 13.5 కోట్ల చదరపు మీటర్ల వైశాల్యం గల ఇళ్ళను నిర్మిస్తాము. 1976_80 మధ్య కాలంలో యిది 40 కోట్ల చదరపు మీటర్లకు పెరుగుతుంది. ఇది నిజంగా బ్రహ్మాండమైన కార్యక్రమం!

మన పెద్ద నగరాలు మరీ పెరిగిపోకుండా నిరోధిస్తూనే, అవి నేటి వలెనే పారిశ్రామిక, సాంస్కృతిక కేంద్రాలుగా వెలుగొందేలా జాగ్రత్త వహించాలి. అదే సమయంలో దేశంలో చక్కని చిన్న చిన్న మధ్యరకం పట్టణాలను అభివృద్ధి చేయటానికీ, కొత్తగా నిర్మించడానికి పూనుకోవాలి. మన ఊళ్ళన్నీ "పచ్చని పట్టణాలు"గా, లేక "ఉద్యానవన పట్టణాలు"గా రూపొందాలి. ఆధునిక నగరాలలోని అన్ని మంచి లక్షణాలు_అంటే, సౌకర్యమయిన ఇళ్లూ, విశాలమైన వీధులూ, పౌర సౌకర్యాలు, పిల్లల సాంస్కృతిక, క్రీడా సంస్థలు, జనపదాలలోని అన్ని మంచి లక్షణాలు, ఎక్కడచూచినా పచ్చని చెట్లూ, కొలనులు, పరిశుభ్రమైన గాలి మిళితమై_వుండాలి.

రోజువారీ పని గంటలను యింకా తగ్గించాలని మన ముసాయిదా

కార్యక్రమం నిర్దేశిస్తున్నది. ఇందువల్ల, ప్రజల సాంస్కృతిక, సాంకేతిక స్థాయి సత్వరంగా పెంపొందడానికి, వారికి తగినంత విశ్రాంతి లభించడానికీ అవకాశం ఏర్పడుతుంది. మనం యిప్పటికే, శ్రామికులు రోజూ పని చేయవలసిన కాలాన్ని 7 గంటలకు, కొన్ని పరిశ్రమలు 6 గంటలకు తగ్గించాము. మొదటి పదేళ్ళలో రోజువారీ పని కాలాన్ని ఆరు గంటలకు, లేదా వారంలో పనిచేయవలసిన కాలాన్ని 35 గంటలకు తగ్గిస్తాము. ఇది శ్రామిక ప్రజలలో అత్యధిక సంఖ్యాకులకు అన్వయిస్తుంది. మిగతావారి విషయంలో వారానికి పనిచేయ వలసిన కాలాన్ని 30 గంటలకు తగ్గిస్తాము. కమ్యూనిస్టు వ్యవస్థను నిర్మించే దేశంలో పని గంటలు ప్రపంచంలోని యితర దేశాలలోకన్నా తక్కువగా వుంటాయి. శ్రామికుల ఉత్పాదక శక్తి పెరుగుదల మూలంగా పని గంటలను మరింత తగ్గించడానికి వీలవుతుంది.

అదే సమయంలో, పారిశ్రామిక కార్మికులకు, ఆఫీసుల్లో పని చేసే సిబ్బందికి జీతంతో మంజూరుచేసే సెలవు రోజులను మూడు వారాలకు హెచ్చిస్తాము. ఉత్తరోత్తరా, ఈ సెలవు నెలరోజులకు పెంచబడుతుంది. క్రమంగా జీతంతో సెలవు మంజూరుచేసే పద్ధతి సమిష్టి వ్యవసాయ దారులకు కూడా వర్తింపజేస్తాము.

కామ్రేడ్స్, పనిని బట్టి ప్రతిఫలం అనే సోషలిస్టు సూత్రం నుండి అవసరాలను బట్టి ప్రతిఫలం అనే కమ్యూనిస్టు సూత్రానికి మనం క్రమంగా పురోగమిస్తాము. ఇందుకు భౌతిక, సాంస్కృతిక సంపద పుష్కలంగా ఉండాలి. రెండవ విషయ మేమంటే (మొదటి దెంత ముఖ్యమో ఇదీ అంత ముఖ్యమే), ప్రతి ఒకరికి, పనిచేయటమనేది జీవిత ప్రాథమికావసరంగా పరిణమించాలి. ఇది సిద్ధించే వరకు, ఏ పౌరుడెంత పనిచేశాడనే విషయం లెక్కలోకి తీసుకోకుండా కమ్యూనిస్టు వినిమయ విధానాన్ని "ప్రవేశపెట్టడానికి" చేసే ప్రయత్నం, అందరినీ ఒకే గాట కట్టివేయడమవుతుంది. అది ఉత్పత్తిని విచ్ఛిన్నం చేస్తుంది. ఇటువంటి 'విధానాని'కి

పార్టీ పూర్తిగా వ్యతిరేకం.

ప్రజలు తమ భౌతిక, సాంస్కృతికావసరాలు తీర్చుకొనేందుకు, వచ్చే 20 సంవత్సరాలలో వేతనం పైననే ఆధారపడవలసి వుంటుందని పార్టీ భావిస్తున్నది. పనిని బట్టి వేతనం చెల్లించడం అనే సూత్రం ఇతోధికోత్పత్తికి దోహదకారిగావుంటుంది. తమ సాంస్కృతిక,సాంకేతిక స్థాయిని పెంపొందించుకోవడానికి శ్రామిక ప్రజలను ప్రోత్సహిస్తుంది. తద్వారా కాయకష్టానికి మేధశ్శ్రమకు మధ్యగల భేధాలను క్రమంగా తొలగించడానికి యిది తోడ్పడగలదు. ప్రజల వాస్తవాదాయాల పెరుగుదలకు ఇదొక ముఖ్యాధారంగా వుంటుంది. ఈ కారణం వల్ల సామాజిక సంపత్తి వృద్ధి పొందే కొద్దీ, ఎక్కువ జీతాలవారికీ, తక్కువ జీతాలవారికీ మధ్యగల వ్యత్యాసాలను క్రమంగా తగ్గించేందుకు వీలుకలుగుతుంది. కమ్యూనిస్టు వ్యవస్థా నిర్మాణానికి ప్రజలను నైతికంగా ప్రోత్సహించడానికి అన్ని మార్గాలు అవలంబించిస్తూనే, పనిని బట్టి ప్రతిఫలమనే సూత్రాన్ని సంపూర్ణంగానూ, నిస్సంకోచంగానూ అమలు జరిపి, కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి దాన్ని ముఖ్యమైన దోహదకారిగా చేయాలి.

వచ్చే పది సంవత్సరాలలో సోవియట్ యూనియన్ ఒక చరిత్రాత్మకమైన కర్తవ్యం పూర్తిచేయ నున్నది: తక్కువ జీతం వచ్చే పారిశ్రామిక కార్మికులూ, ఆఫీసు పనివారు వుండరు. వేతన ప్రమాణాలను సుమారుగా ఒకే స్థాయికి తీసుకరావటమంటే, అందరికీ ఒకే జీతం నిర్ణయించడమని అర్థంకాదు. ఎందుకంటే దీనికి, మామూలు కార్మికులస్థానే సాంకేతిక నైపుణ్యం గల కార్మికులను నియమించటానికీ అవినాభావ సంబంధమున్నది. శ్రామికుల ఉత్పాదక శక్తి పెరుగుదలకు అనుగుణంగా, సాంకేతిక నైపుణ్యం గల కార్మికుల వేతనాలు పెరగాలి. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో శ్రామికుల ఉత్పాదక శక్తి మరింత వేగంగా పెరుగుతుంది కాబట్టి, వచ్చే 20 సంవత్సరాలలో సమిష్టి వ్యవసాయక్షేత్రాలలో శ్రామికుల సగటు ఆదాయాలు పారిశ్రామిక కార్మికుల ఆదాయాలకన్న త్వరత్వరగా

పెరుగుతాయి. సోవియట్ మేధావి వర్గంలో, ఇంజనీయర్లు, సాంకేతిక నిపుణులు, వ్యవసాయ శాస్త్రజ్ఞులు, వైద్యులు, ఉపాధ్యాయులు, సాంస్కృతిక రంగంలో పనిచేసేవారు మొదలయినవారికి వేతనాలూ పెరుగుతాయి.

జీవన ప్రమాణాన్ని పెంచేందుకు మరోమార్గం ప్రజా వినియోగ నిధుల విస్తరణ. దీని ప్రాముఖ్యం కూడ రానురాను పెరుగుతుంది. సమాజంలోని వ్యక్తులు నిర్వర్తించిన పని ఎంత, ఎలాంటిది అనే విషయంతో నిమిత్తం లేకుండా, అంటే, ఉచితంగా, వారికి యీ నిధుల నుండి పంపకం జరుగుతుంది. ఈ నిధులు వేతనాలకన్న త్వరగా పెరుగుతాయని ముసాయిదా ప్రణాళిక అంచనా. ఎందుకంటే ఇవి కమ్యూనిస్టు వినిమయానికి ప్రత్యక్షంగా దారితీస్తాయి. సాంవత్సరిక ప్రజావినియోగ నిధులను 900 శాతానికి పైగా పెంచాలనేది మన ప్రజారిక లక్ష్యం. 1960లో యీ నిధులు మొత్తం 2450 కోట్ల రూబుళ్లు. ఇది 1980లో 225-265 వందల కోట్ల రూబుళ్ళకు పెరుగుతుంది. 20 సంవత్సరాలు ముగిసేసరికి ఇవి ప్రజల మొత్తం ఆదాయంలో సుమారు సగముంటాయి.

ప్రజా నిధుల పెరుగుదలతో, తగిన ప్రతిఫలం ముట్టజెప్పి బాగా పనిచేసే వారిని ప్రోత్సహించడం, పనినిబట్టి వినిమయం అనే సూత్రాలను ఉచితరీతిని మేళవించడం చాలా ముఖ్యం. వచ్చే 20 సంవత్సరాలలో ప్రజా వినియోగ నిధుల అభివృద్ధి క్రింది మార్గాలను, అనుసరించాలని ముసాయిదా కార్యక్రమం నిర్దేశిస్తున్నది. పిల్లలనూ అశక్తులయిన వారినీ పోషించదానికి అయ్యే వ్యయం ప్రజల ఖర్చుతో భరించడం; ఉచిత విద్య; ఉచిత వైద్యం; ఇంటి అద్దెల రద్దు; ఉచిత సామాజిక, రవాణా సౌకర్యాలు—ఇందుకు క్రమంగా సాగిపోవడం. పిల్లల, అశక్తుల పోషణ ప్రజల ఖర్చుతో భరించడం నూతన సమాజం యొక్క మహోన్నతాశయాలకు అనుగుణమైన కర్తవ్యం. ఇది మహత్తరమయిన మానవతా ధర్మం. దీనిని త్వరలోనే నిర్వహించ గలుగుతున్నందుకు, కామ్రేడ్స్ మనం గర్విస్తున్నాము.

పాఠశాలల్లో పిల్లల కందరికీ ఉచితంగా వేడివేడి భోజనం ఏర్పాట్లు

చేయడం. వారికి అవసరమయిన పాఠ్య పుస్తకాలు, స్కూలు యూనిఫారాలు ఉచితంగా సరఫరా చేయటం త్వరలోనే జరుగుతుంది. ఇది జరిగిన తరవాత శిశు సంరక్షక కేంద్రాలలోనూ, కిండర్ గార్డన్లలోనూ చిన్న పిల్లలకు విద్యాబుద్ధులు చెప్పే పగటి పాఠశాలలోనూ ఫీజు రద్దుచేస్తాము. ప్రస్తుతం పిల్లల పోషణకయ్యే ఖర్చు ఎక్కువ భాగం శ్రామిక ప్రజలే భరిస్తున్నారు. 20 సంవత్సరాలకు పిల్లల పోషణకు విద్యకు అయ్యే ఖర్చులో 75–80 శాతం ప్రభుత్వమే భరిస్తుంది. పిల్లల, తరుణ వయస్కుల పోషణకై ప్రభుత్వం కేటాయించే డబ్బు 1961–1980లో పదిరెట్లుకు పైగా పెరుగుతుంది.

పిల్లల పోషణ, వారి విద్యాబోధ, సామాజిక సేవా సౌకర్యాలు——వీటికయ్యే వ్యయం అధికాధికంగా సమాజమే భరించడం ద్వారా సమాజంలో మహత్తర పరిణామాలు వస్తాయి. దైనందిన జీవితంలో స్త్రీ పురుషుల మధ్యగల వ్యత్యాసాల అవశేషాలను తొలగించడానికిది తోడ్పడుతుంది. బహు కుటుంబీకులకు కలిగే ఇబ్బందులు కూడా యీ చర్యల మూలంగా క్రమంగా పోతాయి.

పనిచేసే శక్తి లేనివారందరి పోషణ భారం అంతా ప్రభుత్వమే వహిస్తుంది. పెన్షన్లను క్రమంగా పెంచుతాము. వృద్ధులకు, అశక్తులకు ఇతోధికంగా వసతులను ఏర్పాటుచేస్తాము. ఇలాంటి వసతులకు కొరత లేకుండా చేస్తాము. రెండవ దశాబ్దిలో అశక్తులకందరికీ ఒకే రకమైన పెన్షన్ విధానాన్ని క్రమంగా ఏర్పాటుచేయగలము.

ఈ చర్యల మూలంగా సోవియట్ ప్రజల ఆయురారోగ్యాలు ఇతోధికంగా వృద్ధికాగలవు. ఈ విషయంలో ప్రజారోగ్య సంస్థల విస్తరణ గొప్ప పాత్ర నిర్వహిస్తుంది. పట్టణ, గ్రామీణ ప్రజానీకానికి అన్ని విధములైన వైద్య సదుపాయాలు సంపూర్ణంగా ఏర్పాటు చేస్తాము. వ్యాధి నిరోధక వైద్య విధానం పట్ల ప్రత్యేక శ్రద్ధ వహిస్తాము. ఆసుపత్రుల, ఆరోగ్య కేంద్రాల, విశ్రాంతి గృహాల, బోర్డింగ్ హౌస్‌ల సంఖ్య విస్తారంగా పెరుగు

తుంది. మన దేశంలో ఉచిత వైద్యం చాలా సంవత్సరాల క్రితమే ఏర్పాట యింది. ఉచిత వైద్యానికి తోడు, రోగులకు ఆరోగ్య కేంద్రాలలో ఉచితంగా వసతి కల్పించి మందులు ఉచితంగా యివ్వడం కూడా జరుగుతుంది.

ఉచితంగా ఆధునాతన గృహ వసతి, సామాజికా సేవా సౌక ర్యాలను ప్రతి కుటుంబానికీ ఏర్పాటు చేయటం కమ్యూనిస్టు వ్యవస్థా నిర్మాణం సాధించె మహద్భుత విజయం. రెండవ దశాబ్దిలో మరొక ప్రధానమైన సామాజిక పథకం ప్రారంభిస్తాము — పరిశ్రమల్లోనూ, ఆఫీసు ల్లోనూ, సమిష్టి వ్యవసాయదారులు వ్యవసాయ క్షేత్రాలలో పనిచేసే సమ యాల్లోనూ ఉచిత భోజనం ఏర్పాట్లు చేస్తాము.

పెట్టుబడిదారీ దేశాల్లోని శ్రామిక ప్రజలకెన్నటికి అందుబాటులో వుండడానికి వీలులేని సాంఘిక సౌకర్యాలు సోవియట్ ప్రజలు యిప్పటికే అనుభవిస్తున్నారు. దోపిడీ, నిరుద్యోగమూ, ఆర్థిక సంక్షోభాలు, జాతి, వేతన విచక్షణలు అంటే ఏమిటో సోవియట్ ప్రజలెరుగరు. తమకు ఉజ్వలమయిన భవిష్యత్తు గలదనే విశ్వాసం వారికున్నది.

అయితే, తలసరి సగటు వస్తు వినియోగంలోనూ, ప్రజల తలసరి వాస్తవాదాయం స్థాయిలోనూ సోవియట్ యూనియన్ యింకా అమెరికా కన్న వెనుకబడి వున్నది. రెండు విషయాలు యీ సందర్భంగా జ్ఞాపకం పెట్టుకోవాలి. అవి: మనం నిర్మాణం మొదలుపెట్టినప్పటి స్థాయి; అమెరికా లాగ కాకుండా యుద్ధంలో మనం పడిన నష్టం. 1980 నాటికి మన దేశంలో తలసరి వాస్తవాదాయం, అమెరికాలో ప్రస్తుతం శ్రామిక ప్రజల ఆదాయం కన్నా సుమారు 75 శాతం ఎక్కువగా ఉంటుంది.

అయితే యిక్కడొక్క విషయం మనం జ్ఞప్తియందుంచుకోవాలి. అమెరికాలో సగటు తలసరి ఆదాయాన్ని గురించిన లెక్కల వెనుక, చాలా తక్కువ వేతనాలు వచ్చే సాంకేతిక నైపుణ్యం లేని లక్షలాది కార్మికులూ, నిరుద్యోగులూ, మురికి పేటల్లో నివసిస్తూ జీవితావసరాలు కూడా లేకుండా బాధపడుతున్నారనే సత్యం దాగివున్నది. మన దేశంలో ప్రతి కుటుంబా

నికి తగిన సౌకర్యాలను ఏర్పాటు చేస్తాము. ఉత్తరోత్తరా మన ప్రజలు భౌతిక సాంస్కృతిక సంపదలను, సమృద్ధిగా అనుభవించనున్నారు.

ప్రపంచ శాంతి నెలకొని వున్నప్పుడు, ప్రజల జీవన ప్రమాణాన్ని అభివృద్ధి చేసే ప్రణాళికలు జయప్రదంగా అమలు జరుగగలవని ముసాయిదా కార్యక్రమం పేర్కొంటున్నది. ఇంతేకాక, అంతర్జాతీయ ఉద్రిక్తత సడలి, తత్ఫలితంగా సైనిక వ్యయం తగ్గితే, ప్రజల జీవన ప్రమాణాన్ని మరింత పెంపొందించడానికి వీలు కలుగుతుంది. శాంతికోసం మనం సాగిస్తున్న పోరాటం కమ్యూనిజం కోసం, సోవియట్ భూమి అభివృద్ధి కోసం, ప్రజల సంక్షేమాభివృద్ధి కోసం సాగించే పోరాటంలో భాగమే.

కామ్రేడ్స్, సోవియట్ ప్రజల జీవన ప్రమాణాన్ని అభివృద్ధి చేయడానికి రూపొందించిన బృహత్తర కార్యక్రమంలోని సామాజిక విషయాలు మహోన్నతమయినవి. ఇది మన ప్రజల వ్యవస్థ యొక్క ఉదాత్త లక్షణాలను అత్యద్భుతంగా వెల్లడిస్తున్నది. ప్రపంచమంతటా ప్రజానీకం దీన్ని శ్లాఘించింది. ముసాయిదా కార్యక్రమంలోని లక్ష్యాలను అందుకోవడం సోవియట్ యూనియన్‌కు సాధ్యమేనని, పాశ్చాత్య బూర్జువా ప్రచారకులు అంగీకరించారు. ఇది పాశ్చాత్య రాజ్యాలకు "ముఖ్యమైన సవాలు" అని వారు అభిప్రాయ పడుతున్నారు.

ప్రజల జీవన పరిస్థితులను బాగుపరచే విషయంలో పోటీపడదామని సవాలు చేయడం ఉన్నతాదర్శ ప్రేరితమని మనం అనుకుంటాము. వివిధ దేశ ప్రజలను కొల్లగొట్టి విస్తారంగా పెట్టుబడులను కూడబెట్టిన పెట్టుబడిదారులెందుకు యిటువంటి సవాలును అందుకోకూడదు? యుద్ధావసరాలను ఉత్పత్తి చేస్తున్న పరిశ్రమలను ప్రజల కవసరమయిన సరకుల ఉత్పత్తికి మళ్ళించి, కార్మికుల వేతనాలను ఎందుకు పెంచరాదు?

కొన్ని దేశాలలోని శ్రామిక ప్రజల ఆదాయంలో సుమారు మూడింట ఒక భాగం యింటి అద్దెలు చెల్లించడానికే వ్యయమవుతున్నది. కాబట్టి యింటి అద్దెలను రద్దుచేస్తే పెట్టుబడిదారీ దేశాల్లోని శ్రామిక ప్రజలెంతో

హర్షిస్తారు. అమెరికాలో ప్రజలు 1960లోనే వైద్య సదుపాయాలకై 2000 కోట్ల డాలర్లను ఖర్చుచేశారు. ఉచిత వైద్య సౌకర్యాలు ఏర్పాటు చేస్తే వారు హర్షించరూ?

మానవుని పీల్చి పిప్పిచేయడం పెట్టుబడిదారీ విధానం సహజ ధర్మమని మనకు తెలుసు. ఒక వ్యక్తి పనిచేసే శక్తి కోల్పోయిన మరుక్షణమే పెట్టుబడిదారీ సమాజం అతని గతికి అతణ్ని వదలివేస్తుంది. డబ్బు లేని వాడు ఆకలితో మాడి చావవలసిందే. ఇల్లు లేకపోతే ఏ వంతెన క్రిందో పడుకోవలసిందే. "స్వేచ్ఛా ప్రపంచం" అంటే, బూర్జువా "స్వేచ్ఛ" అంటే అదీ. మానవ ద్వేష దూషితమైన యీ సిద్ధాంతాలకు సోషలిజం స్వస్తి చెప్పింది. "ప్రతి ఒకటీ మానవుని కోసమే; మానవుని శ్రేయస్సు కోసమే" అనేది కమ్యూనిజం ధర్మం. నేడు కమ్యూనిజం ప్రజల సౌఖ్యం కోసం, ప్రజలచే నిర్మింపబడుతున్నది. కమ్యూనిజం క్రింద, మానవ శబ్దానికే యిదివరకెన్నడూ లేనంత మహత్తరార్థం స్ఫురిస్తుంది!

## 4. పథకీకరణ, పని నిర్వహణ కమ్యూనిస్టు వ్యవస్థా నిర్మాణానికి అనుగుణంగా వుండాలి.

కామ్రేడ్స్, ముసాయిదా కార్యక్రమంలో నిర్ణయింపబడిన గురుతర కర్తవ్యాలను జయప్రదంగా నెరవేర్చడం కోసం, పథకీకరణ పని నిర్వహణ, సమగ్ర కమ్యూనిస్టు వ్యవస్థా నిర్మాణంయొక్క అవసరాలకు అనుగుణంగా వుండేలా మనం జాగ్రత్త వహించవలసి వుంటుంది. ఎందువల్లనంటే మొదటి విషయం ఉత్పత్తి, నిర్మాణ కార్యక్రమం అపారంగా పెరుగుతుంది, దానితోపాటు ఆర్థిక రంగంలోని వివిధ విభాగాల మధ్య పరస్పర సంబంధాలు వృద్ధి చెంది విస్తరిస్తాయి. రెండవది, శాస్త్రీయ, సాంకేతిక రంగాలు వేగంగా అభివృద్ధి చెందుతాయి. మూడవది, మానవ శ్రమ, సామాజికంగా, సాంస్కృతికంగా, సాంకేతికంగా ఎంతో పురోగమిస్తుంది. నాల్గ

పది, ఆర్థిక రంగంలో పని నిర్వహణకు గల ప్రజాస్వామిక ప్రాతిపదిక విస్తరిస్తుంది. ప్రజల కార్యకలాపాలు రానురాను పెరుగుతూ వస్తాయి.

కమ్యూనిస్టు నిర్మాణంలో, అన్ని ఉత్పత్తి వనరులనూ సక్రమంగా, ఫలదాయకంగా వినియోగించవలసి వుంటుంది. మానవ శ్రమ వినియోగం సముచితమైన పద్ధతితో జరగాలి. "సోషలిజం అంటే లెక్కలు తయారు చేయడం" అన్న లెనిన్ మాటలు కమ్యూనిస్టు వ్యవస్థా నిర్మాణ కాలంలో మరింత సార్థకమవుతున్నాయి.

లెక్కలేమి తెలియజేస్తున్నాయో చూడండి. ప్రణాళిక ప్రకారం, పారిశ్రామిక ఉత్పత్తి వ్యయాన్ని తగ్గించడం ద్వారా మాత్రమే మనం 1400–1500 వందల కోట్లు రూబుళ్ళను పొదుపు చేయగలం. ఈ మొత్తం జాతీయ ఆర్థిక వ్యవస్థలోని మొత్తం పెట్టుబడులలో రమారమి నాల్గింట మూడుపాళ్ళు, ప్రస్తుతం ఉత్పత్తికీ నిర్మాణానికి వ్యయమయ్యే నిధులలో మనం పొదుపు చేయగల ప్రతి ఒక్క శాతం అదనపు ఉత్పత్తికీ, జీవన ప్రమాణాన్ని పెంచడానికీ గొప్ప మూలాధారమవుతుంది. ప్రణాళికలు రూపొందించడంలో చాలా స్వల్పంగా కనిపించే పొరపాటువల్లనూ, అనుకోకుండా సందర్భవశాత్తు జరిగే డబ్బు దుర్వినియోగం వల్లనూ అనేక కోట్లు నష్టం రావచ్చు.

ఇరవై ఏళ్ళలో రెండు లక్షలకోట్ల రూబుళ్ళ కేపిటల్ పెట్టుబడులు, సోవియట్ రాజ్య కాలమంతటా పెట్టబడిన పెట్టుబడి మొత్తానికిఆరురెట్లు. మన పనిపాటలకు సంబంధించిన వ్యవహారాలు ఇంత పెద్ద ఎత్తున సాగుతుంటాయి కాబట్టి "నీ గుడ్డను మూడుసార్లు కొల్చిచూడు; కాని ఒక్కసారి మాత్రమే కత్తిరించు" అనే సామెతను గుర్తుంచుకోకుండా ఒక్కడుగు కూడ ముందుకు వేయటానికి వీలులేదు.

సాధ్యమయినంత తక్కువ ఖర్చుతో అత్యంత లాభదాయకంగా ఏది, ఎక్కడ, ఏవిధంగా నిర్మించవచ్చుననే విషయమై ఖచ్చితమైన లెక్కలు లేకుండా మనం పని సాగించరాదు. ఇంత పెద్ద సంఖ్యలోవున్న

కొత్త ప్రాజెక్టుల నిర్మాణంలో ఏ కొద్ది జాప్యం జరిగినా, అపారమయిన ధన రాసులు నిరుపయోగంగా పడివుంటాయి. అలా కాక, ఈ పథకాల నిర్మాణాన్ని నిర్ణీత కాలంకన్న ముందే పూర్తిచేయగలిగితే, వింత విస్తారమయిన వనరులు ఇతర కార్యాలకు లభ్యం కాగలవో గమనించండి! ప్రణాళికలో నిర్ణయించిన దానికన్న ఎక్కువగా ఎన్ని ఇళ్ళను, శిశు సంస్థలను, పాఠశాలలను, ఆసుపత్రులను, విశ్రాంతి సదనాలను, ఈ వనరులతో నిర్మించగలమో ఆలోచించండి!

ప్రణాళికలు రూపొందించడంలో, పనిని నిర్వహించడంలో ఇప్పటికన్నా చాలా ఉన్నతమైన నూతన శాస్త్రీయ ప్రాతిపదిక, ఆర్థిక దూరదృష్టి అవసరమని మన జీవితానుభవంవల్లనే స్పష్టం కాగలదు. ప్రణాళికలను తయారు చేయాటానికి ముందుగా, ఆర్థిక చర్యలను ఆమోదంచడానికి ముందుగా, ఆర్థిక, సాంకేతికాభివృద్ధికి సంబంధించిన సమస్యలను శాస్త్రీయ దృష్టితో కూలంకషంగా పరిశీలన చేయవలసి వుంటుంది. ఆర్థిక, సాంకేతిక పరిశోధనలు ఆర్థిక సమస్యల సక్రమ పరిష్కారానికి ఇతోధికంగా తోడ్పడాలి. జాతీయార్థిక వ్యవస్థలోని వివిధ విభాగాలే నిష్పత్తిలోవుంటే అత్యంత లాభదాయకమో, సహజ వనరులను ఉత్పాదక శక్తులను, నూతన యంత్రాలను ఏవిధంగా వినియోగిస్తే అత్యంత ఫలప్రదంగా వుంటుందో, జాతీయాదాయాన్ని, పెట్టుబడులను వివిధ కార్యక్రమాలమధ్య ఏవిధంగా విభజనచేస్తే ఎక్కువ మేలిస్తుందో, ఆర్థికాభివృద్ధి మరింత శీఘ్ర గమనంతో సాగించేందుకు ఇతర మార్గాలేవో మొదలగు విషయాలను ఆలోచించి, నిర్ణయించడానికి సంబంధించిన పని ఇదంతా.

మన కాలంలో ప్రణాళికలను రూపొందించడానికి అవసరమయినవేమిటి? అన్నిరకాలయిన పనిముట్లు, ముడి సరకులు, తదితర సామగ్రిని, ఉపయోగించేందుకూ, సాంకేతిక పద్ధతులకూ, వివిధ పథకాల నిర్మాణ కార్యక్రమాలకూ, అభివృద్ధికరమైన ప్రణాళికా ప్రమాణాలుండటం అత్యవసరం. ఈ ప్రమాణాలను ప్రవేశపెట్టి, వాటిని తు.చ తప్పక పాటించడం,

ప్రతి నిర్వాహకుని విధిగా వుండాలి. రెండవది, ప్రతి ప్రణాళికలోని వివిధాంశాలమధ్య, వెంట్రుకవాసి కూడ వ్యత్యాసాలులేకుండా సమతూకం ఉండాలి; వాటికి అవసరమయిన నిలవలను సమకూర్చోవాలి.

ఆర్థిక నిర్మాణంలోనూ, ప్రణాళికలను రూపొందించడంలోనూ ఆధునిక సాంకేతిక శాస్త్రానికి ఇప్పటికన్న ఎక్కువ ప్రాముఖ్య మివ్వాలి. దానికి మనం సాధారణంగా పేర్కొనే "దోవ హక్కు" ఇవ్వాలి. నేడు మనం నిర్మిస్తున్న, పది పదిహేనేళ్ళలో మనం నిర్మించబోయే సాంకేతిక పథకాలలో, యంత్రాలలో కమ్యూనిజం యొక్క భౌతిక, సాంకేతిక ప్రాతి పదిక ఏర్పడ నారంభించింది.

శాస్త్రీయ, సాంకేతిక రంగాలలో కొత్తగా కనిపెట్టిన విషయాలూ, అభివృద్ధికరమైన మార్పులూ తమ నూతన పథకాల్లో పూర్తిగా, త్వరగా, ప్రతిబింబిత మయ్యేలా, యంత్ర నమూనాలు తయారు చేసేవారు జాగ్రత్త వహించాలి. పైనుండి, కేంద్రీకృత ప్రాతిపదికపై, నూతన సాంకేతిక విధానాలను ప్రవేశపెట్టే పద్ధతిని మరింత ఫలప్రదంగా అమలు జరపడం; సాంకేతికాభివృద్ధికై క్రిందినుండి దేశవ్యాప్తమైన ప్రజా ఉద్యమాన్ని ప్రోత్స హించడం అత్యవసరం.

నూతన సాంకేతిక పద్ధతులనూ, నూతన సామగ్రినీ వినియోగించు కొని పురోగమించిన పరిశ్రమలను భౌతికంగానూ, నైతికంగానూ ప్రోత్స హించాలి. సంకుచిత దృక్పథంతో, పాత విధానాలనే పట్టుకొని వేలాడే యంత్రాగారాలకన్న వీటికి ప్రాముఖ్య మివ్వాలి. నూతన యంత్రాల వివిధ విభాగాలు తయారుచేసే ప్రత్యేక పరిశ్రమలమధ్య దేశవ్యాప్తంగా సహకార సమన్వయతలు త్వరగా నెలకొనేలా కృషి చేయాలి.

యంత్రాల నమూనాలు తయారుచేయడం, వాటిని పరిశీలించడం, ప్రయోగాత్మకంగా ఉత్పత్తిచేయడం మొదలుకొని పెద్ద ఎత్తున ఉత్పత్తికి ఉపక్రమించడంవరకు గల అన్ని దశలలో శాస్త్రజ్ఞులు, యంత్ర నమూనా కారులు, సాంకేతిక నిపుణులు, కార్మికులు ఒకరితో ఒకరు సన్నిహితంగా

సహకరించుకొనే ఏర్పాట్లు చేయడం చాలా ముఖ్యం. ఏ సాంకేతిక పథకాలైనా, ఆర్థికంగా లాభదాయకమని పూర్తిగా నిర్ణయమయిన తరువాతనే, వాటిని పరిశీలించి, ఆమోదించాలి.

నిర్మాణ కార్యక్రమాన్ని ఎంత వేగంగా సాగించగలం, వాటి వ్యయం ఎంత తగ్గించగలం, వాటి నాణ్యాన్ని ఎంత హెచ్చించగలం, పెట్టుబడులను, ఉత్పత్తికి సంబంధించిన తదితర ఆస్తులను ఎంత సమర్థవంతంగా, తెలివిగా వినియోగించగలం, కనిష్ట వ్యయంతో గరిష్ట ఉత్పత్తి ఎంతవరకు సాధించగలం అనే విషయాలపై కమ్యూనిజంకోసం, సోవియట్ ప్రజల జీవన ప్రమాణం హెచ్చించడం కోసం మనం సాగించే యావత్తు ఉద్యమ విజయం ఆధారపడిందని చెప్పడం అతిశయోక్తి కాదు.

ఇందుకోసం మనం ప్రణాళికలు రూపొందించే పద్ధతిని, లెక్కలు తయారుచేసే పద్ధతిని, ప్రభుత్వమూ, ప్రజలూ నిర్వహించే కంట్రోళ్ళను, సోషలిస్టు అనుకరణనూ, ప్రతి ఉద్యోగి, బృందం, ఫ్యాక్టరీ–షాపు, పరిశ్రమ, ఆర్థిక వ్యవహార నిర్వహణ సమితి–వీటిని పునర్వ్యవస్థీకరించడం అవసరం. ఇలా చేసినప్పుడు, మనం నూతన యంత్ర నిర్మాణానికై పెట్టే పెట్టుబడుల మొత్తం ఉత్పత్తి రూపంలో సాధ్యమయినంత త్వరగా మళ్ళీ మనచేతి కందడానికి వీలుగా ప్రతి యంత్ర పరికరం, యంత్రం, తదితర సామగ్రి ఉత్పత్తికి సాధ్యమయినంత ఎక్కువగా తోడ్పడగలవు. అనేక పథకాల కోసమై మన వనరులను "చెల్లా చెదరుగా వెదజల్లే" తప్పుమార్గాన్ని మనం పూర్తిగా విసర్జించాలి. ఈ విషయమై నేను కేంద్రకమిటీ నివేదికలోకూడా ప్రస్తావించాను.

నిర్మాణ కార్యక్రమాన్ని శీఘ్రంగా కొనసాగించటంలోనూ, నూతన పరిశ్రమలను స్థాపించి వాటిని నిర్వహించటంలోనూ ముఖ్యమైన పెట్టుబడిదారీ దేశాలనుండి మనం నేర్చుకోవడంలో తప్పులేదు. మనం వ్యాపారం చేయటం నేర్చుకోవాలని లెనిన్ చెప్పారు. తరువాత చాలాకాలం గతించింది. నిర్మాణంలోనూ, పని నిర్వహణలోనూ మనం అపారమయిన

అనుభవం సంపాదించాము. పెట్టుబడిదారీ విధానానికన్న మనదే పై చేయి అయింది.

కాని, మనకు ఉపయోగకరంగా వుండే విదేశాల అనుభవాన్ని యిప్పుడు సైతం తృణీకరించరాదు. పాశ్చాత్యదేశాలలో సాంకేతిక, నిర్మాణ రంగాలకు సంబంధించిన మంచి అంశాలను మనం సవిమర్శకంగా పరిశీలించి స్వీకరించాలి. త్వరత్వరగా డబ్బు తిరుగుడు పడటం, పెట్టుబడులనుండి అధికాధింగా ప్రతిఫలం పొందటం మొదలగు విషయాలలో వారినుండి మనం నేర్చుకోవలసినది వుంది.

కమ్యూనిస్టు వ్యవస్థ నిర్మాణంలో, ఉత్పత్తి అయ్యే సరకుల నాణ్యాన్ని నిర్విరామంగా అభివృద్ధి చెయటం ఒక ప్రధానమయిన ఆర్థిక, రాజకీయ కర్తవ్యం. "సోవియట్ సరకులంటే అన్నిటికన్నా మేలైన సరకులు" అని మహాసభకు ముందు కాలంలో మనం ప్రచారానికి తెచ్చిన నినాదం, ప్రతి పరిశ్రమకు మార్గదర్శకమైన సూత్రంగా వుండాలి.

అత్యున్నతమైన ఉత్పాదక శక్తి గలిగి, శాస్త్రీయ ప్రాతిపదికపై సంఘటితమైన మానవ శ్రమకు అతి నాణ్యమైన యంత్రాలను జతపరచటం కమ్యూనిజానికి కీలకమనే భావం ముసాయిదా కార్యక్రమంలో ఇమిడివుంది. ఈ కారణంవల్ల, మానవ బలాన్ని హేతుబద్ధమైన పద్ధతిలో వినియోగించడం, ప్రణాళికా రచనలోనూ, పని నిర్వహణలోనూ చాలా ప్రధానమయిన అంశం.

నూతన సాంకేతిక విధానాల మూలంగా, ఉత్పత్తి రంగంలోని అనుబంధ, సహాయకోద్యోగాలలో వున్న వారితో సహా, మిలియన్ల కొలది ప్రజలు యితర పనులకు లభ్యమవుతారు. వ్యవసాయ రంగంలో అనేక మంది ప్రజలు యిలా లభ్యం కాగలరు. పని నిర్వహణ, పరిపాలన కార్యాలయాలు—వీటికి సంబంధించిన యంత్రాంగాలలో పని బాగా తగ్గిపోయి, ఇవి కుదించుకొనిపోతాయి. మిలియన్ల కొలది స్త్రీలు గృహకృత్యాలకు సంబంధించిన పనినుండి విముక్తులవుతారు. వీరంతా జాతీయార్థిక

వ్యవస్థలోని శ్రామికులకు తోడపుతారు. ప్రజారోగ్య, విద్యా, సాంస్కృతిక రంగాలు అత్యంతంగా అభివృద్ధి చెందడంవల్ల, యీ రంగాలలోనూ, ఉత్ప త్తికి సంబంధించని యితర రంగాలలోనూ పనిచేసే వారి సంఖ్య చాలా పెరుగుతుంది; 20 సంవత్సరాలలో యిది సుమారు మూడు రెట్లవు తుంది.

ఇందు మూలంగా, దేశం మొత్తంపై, పెద్ద ఎత్తున శిక్షణను నడిపే సుసంఘటితమైన వ్యవస్థ అవసరమవుతుంది. ఎవరికిష్టమయిన పని వారు ఎన్నుకోవటం, బాగా పనిచేసేవారికి తగిన ప్రతిఫలమిచ్చి ప్రోత్సహించ డం—వీటి ప్రాతిపదికపై ప్రణాళికాబద్ధంగా, ఆయా రంగాల మధ్య, పని వారి పునర్విభజన జరగవలసి వుంటుంది. కొత్త ప్రాంతాలలో పనిచేయడా నికి వెళ్ళేందుకు ప్రజలను ప్రోత్సహించగల జీవన, సాంస్కృతిక పరిస్థితు లను కల్పించాలి.

నిర్మాణ కార్యక్రమం పెరుగుతూ వున్నందువల్లనూ, సాంకేతిక పురోభివృద్ధి స్థాయి హెచ్చుతూన్నందువల్లనూ, ప్రణాళికా రచన అవిచ్ఛి న్నంగా కొనసాగాలి. దీర్ఘకాలికమైన దేశాభివృద్ధికి సంబంధించిన అన్ని అంశాలను ఆమూలాగ్రంగా పరిశీలించకుండా, ఉత్పత్తి, యంత్రాలు, పెట్టు బడులు, శ్రమకు సంబంధించిన సాంవత్సరిక ప్రణాళికలు తయారుచేయటం యీనాడు పూర్తిగా అసాధ్యం.

ప్రతి సాంవత్సరిక ప్రణాళికా, తర్వాత అనేక సంవత్సరాలకు సంబంధించిన దీర్ఘకాలిక ప్రణాళికలో భాగంగా వుండాలి. అదే సమయంలో దీర్ఘకాలిక ప్రణాళికలు "వాస్తవాన్ని అంటి పెట్టుకొని వుండేలా చేయటం" అవసరం. వార్షిక ప్రణాళికలు ఆచరణలో ఎంతవరకు అసలు జరిగాయనే విషయాన్ని దృష్టిలో పెట్టుకొని, దీర్ఘకాలిక ప్రణాళికలను సవరించడం అవసర మవుతుంది.

కమ్యూనిస్టు వ్యవస్థా నిర్మాణ కాలంలో, ఆర్థిక వ్యవస్థలోని వివిధ భాగాలను రంగాలను సమన్వయం చేసే కేంద్రీకృత ప్రణాళికా రచన

పాత్రా, ప్రాముఖ్యమూ పెరుగుతాయి. రాజ్య యంత్ర ప్రయోజనాలకు ప్రాముఖ్యమివ్వడం, ఆర్థిక కార్యకలాపాలలో సర్వత్రా, సర్వులూ రాజ్య యంత్రానికి సంబంధించిన క్రమశిక్షణ పాటించేలా సమర్థవంతమయిన అజ మాయిషీ నెరపడం, ప్రాంతీయ దురభిమానాన్ని, తమ శాఖ తప్ప వేరే విషయాలను పట్టించుకోని సంకుచిత దృక్పథాన్ని దృఢదీక్షతో తొలగించ డం—కమ్యూనిజం పైపుకు పురోగమించడాని కివి అత్యవసరం.

ప్రభుత్వ కేంద్రీకృత పరిపాలనకు తోడుగా, ఆర్థిక రంగంలో పని నిర్వహణకు ప్రజాస్వామ్య ప్రాతిపదికను సర్వవిధాలా నెల కొల్పడం—ఇదీ లెనిన్ నిర్ణయించిన విధానం. దీన్ని ముసాయిదా కార్య క్రమంలో స్పష్టంగా వ్యక్తం చేశాము. కేంద్రీకృత పాలన ప్రజల సృజ నాత్మకమైన చొరవపై ఆధారపడాలి. దానికి ఇతోధికావకాశాలివ్వాలి. ఇందుకు, పని నిర్వహణకు సంబంధించిన అధికారాలనూ, స్థానిక సంస్థల, పారిశ్రామిక సంస్థల బాధ్యతలనూ యింకా విస్తరించాలి.

కార్మిక సంఘాల, ఇతర సామాజిక సంస్థల, ముఖ్యంగా ప్రాథమిక సంస్థల పాత్రనూ, హక్కులనూ, సాధ్యమయినంతవరకూ పెంచడం అవసరం. ఆయా పరిశ్రమల్లో పనిచేసే సిబ్బంది ఇప్పటికన్న విస్తృతం గానూ, కార్యదీక్షతోనూ తమ పరిశ్రమల నిర్వహణలో పాల్గొనాలి.

కమ్యూనిస్టు వ్యవస్థా నిర్మాణం సాగే కాలమంతటికీ మనం నిర్ణ యించిన విధానమేమిటంటే, భౌతిక, నైతిక ప్రేరణలను సముచితంగా మేళవించడం. మన సమాజం సోషలిస్టు దశలో వున్నంతకాలం, పనిని బట్టి జరిగే వినిమయ విధానాన్నీ, వ్యాపార సరకుల—డబ్బు సంబంధాలను, ధరలు, లాభాలు, ద్రవ్యం, పరపతి మొదలగు అంశాలను విసర్జించలేము. మన దేశంలో, ఈ ఆర్థిక సాధనాలకొక సోషలిస్టు గుణం వుంది. ఇవి కమ్యూనిజాన్ని నిర్మించడానికి తోడ్పడుతాయి. కమ్యూనిజం నిర్మించడం పూర్తి అయిన తరువాత, వీటికి కాలదోషం పడుతుంది. వీటిస్థానే, సామా జిక శ్రమను ప్రత్యక్షంగా అంచనావేయటం, విభజించడం అనే ఉన్నత

ఆర్థిక రూపాలు నెలకొంటాయి.

ద్రవ్య సంబంధమైన సాధనాలను, పరపతి సాధనాలను, ఆర్థిక నియంత్రణ, ధరలు, లాభాలు మెరుగుపరచి, ఇతోధికంగా ఉపయోగించటం, కమ్యూనిస్టు వ్యవస్థా నిర్మాణ కాలంలో మన కర్తవ్యం. లాభాల ప్రాముఖ్యాన్ని, ఫలానా పని లాభదాయకమూ కాదా అనే దృష్టి ప్రాముఖ్యాన్ని మనం ఉన్నత స్థాయికి తీసుకొనిపోవాలి. పరిశ్రమలు తమ ప్రణాళికలను చక్కగా అమలు జరపాలంటే, అవి తమ లాభాలకు వినియోగించుకోవడానికి ఇతోధికావకాశాలివ్వాలి. తమ సిబ్బంది బాగా పని చేసేలా ప్రోత్సహించేందుకు, ఉత్పత్తిని పెంచేందుకు ఈ లాభాలను ఇంకా ఎక్కువగా వినియోగించడానికి వాటికి అవకాశముండాలి.

ప్రతి శ్రామికునికి తన కృషి ఫలితాలను గురించేకాక, సమిష్టి కృషి అంతటి ఫలితాలనుగురించి ఆసక్తి ఉండేలా, సమిష్టి కృషిని ప్రోత్సహించే విధానాలను రూపొందించడం, వాటిని ప్రవేశపెట్టడం చాలా ముఖ్యం.

కామ్రేడ్స్, మన దేశంలో వచ్చే 20 సంవత్సరాలలో ఉత్పాదక శక్తులను అభివృద్ధి చేయడానికై రూపొందించిన ప్రణాళిక నిజంగా ఘనమయినది. ఇది బొగ్గు, ఉక్కు, నూనె, ధాన్యం, మాంసం, పాలు ఉత్పత్తి పెరుగుదలను సూచించే అద్భుతావహమయిన అంకెల జాబితా మాత్రమే కాదు. ఇది ఒక నూతన సమాజాన్ని, సామాజిక సంబంధాలనూ సృష్టించేందుకు రూపొందించిన ప్రణాళిక. ఈ సమాజంలో మానవుడు ప్రకృతి శక్తులపై, సమాజక సంబంధాలపై వాస్తవాధినేత; దీనిలో సకల ప్రజల జీవన ప్రమాణం మహోన్నత స్థాయి నందుకొంటుంది.

ఇటువంటి మహత్తర ధ్యేయం కోసం బ్రతకడం, పనిచేయడం, పోరాడడం జన్మసార్థకం. మన ప్రణాళికను అమలు జరపడానికీ, కమ్యూనిస్టు వ్యవస్థను నిర్మించడానికీ సాగే పోరాటాన్ని నడిపించడంకన్న ఉన్నతమూ, ప్రయోజనకరమూ, ఆసక్తిదాయకమూ అయిన కర్తవ్యం మరొకటి మన పార్టీకి, కార్మిక, యువ కమ్యూనిస్టు సంస్థలకు లేదు.

# IV

# కమ్యూనిస్టు సామాజిక సంబంధాల అభివృద్ధి, నూతన మానవుని సృష్టి

క్రమేప్సి, కమ్యూనిజానికి పరివర్తన చెందే సమయంలో, ఉత్పత్తి శక్తులు ఎక్కువ బలపడి, సోషలిస్టు సామాజిక సంబంధాలు క్రమేణ కమ్యూనిస్టు సంబంధాలుగా అభివృద్ధి చెందుతాయి. కమ్యూనిస్టు ఆర్థిక వ్యవస్థా స్థాపన, సామాజిక సంబంధాల పురోగమనం, నూతన మానవుని సృష్టి—ఇవి ఒకదానితో నొకటి ముడిపడి వున్నాయి. సామాజిక సంబంధాలలోను, మానవుని చైతన్యంలోను మార్పుకు ఆర్థిక వ్యవస్థ ప్రాతిపదిక కాగా, సామాజిక సంబంధాల పురోగమనం, కమ్యూనిస్టు అభిప్రాయాల అభివృద్ధి, సంస్కృతి, ప్రజల క్రియాశీలకత ఆర్థికాభ్యుదయానికి అవసర మవుతాయి.

## 1. సోవియట్ యూనియన్‌లో వర్గరహిత సమాజ నిర్మాణం

సోవియట్ యూనియన్ అభివృద్ధి ఎలాంటి చారిత్రక దశకు చేరుకొన్నదంటే, స్వేచ్ఛాయుతమైన, రాజకీయంగా చైతన్యవంతమైన కార్మిక ప్రజానీకం యొక్క వర్గరహిత కమ్యూనిస్టు సమాజ నిర్మాణ కర్తవ్యం ప్రత్యక్షంగా పరిష్కరింపబడుతున్నది.

వర్గాలను, వర్గభేదాలను రద్దు చేయవలసిన ఆవశ్యకతను గూర్చి మార్క్సిస్టు-లెనినిస్టు నిర్ణయాలను సోవియట్ సమాజం గడించిన అపార అనుభవం ధృవపరుస్తుంది:

ఒకటి: దోపిడీదారీ వర్గాల, భూస్వాముల, పెట్టుబడిదార్ల పరిపాలనను కూలద్రోయడం; ఉత్పత్తి సాధనాలపై వారి వ్యక్తి యాజ

మాన్యాన్ని రద్దు పరచడం. ఎందుకంటె మానవుణ్ని మానవుడు దోచుకోవడానికి అది ఆర్థిక ప్రాతిపదికగా ఉంది. అక్టోబరు విప్లవం ఫలితంగా, భూమిని, పెట్టుబడిదారీ ఆస్తిని జాతీయం చేయడం, పెట్టుబడిదారీ శక్తులను అదుపులో ఉంచడం, స్థానభ్రష్టత్వం చేయడంద్వారా మన దేశంలో యీ కర్తవ్యం నెరవేర్చబడింది.

రెండు: వ్యక్తిగతమైన సరకుల ఉత్పత్తిని విశాలమైన సమిష్టి ఆర్థిక వ్యవస్థగా రూపొందించడం. ఏకైక సోషలిస్టు ఆర్థిక వ్యవస్థా నిర్మాణాన్ని పూర్తిచేయడం. దోపిడీదారీ వర్గాలలో చివరిది అయిన కులక్కుల వర్గాన్ని రద్దుపరచడం. గ్రామ సీమలలో సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు నెలకొల్పడం, సహకార సంస్థలలో చేతివృత్తులను కేంద్రీకరించడం, ఒక వర్గంగా కులక్కులను రద్దుపరచడం ద్వారా యీ కర్తవ్యం నెరవేర్చబడింది.

మూడు: కార్మికులకు, కర్షకులకు మధ్య వర్గభేదాలను; పట్టణాలకు, గ్రామసీమలకు మధ్య ప్రధానమైన భేదాలను తొలగించడం. శారీరక, బుద్ధి సంబంధమైన శ్రమ మిళితమైపోవడానికి తగిన పరిస్థితులను సృష్టించడం. ఈ మూడో కర్తవ్యం ఎలా నెరవేర్చబడుతున్నది? ఇది హేతువాదానికి నిలిచే విషయం. వర్గరహిత సమాజానికి మనము పురోగమించడమనేది, అన్నిటికంటె ముఖ్యంగా ఉత్పత్తి శక్తుల సత్వరాభివృద్ధితో ముడివడి వుందన్నది సహేతుకమే. ఖచ్చితంగా చెప్పాలంటే ఉన్నత స్థాయికి చెందిన ఉత్పత్తి శక్తులు, సోషలిస్టు ఉత్పత్తి సంబంధాలు కార్మిక ప్రజావర్గాల మధ్య భేదాలను క్రమంగా రూపుమాపగలవు.

కామ్రేడ్స్, మనం, ఆ విషయాన్ని సిద్ధాంతరీత్యా మాత్రమే కాదు, ఆచరణలో కూడా చూస్తున్నాం. యంత్రాలు, విద్యుచ్ఛక్తి విస్తారంగా ఉపయోగించడంవల్ల రైతు శ్రమ స్వభావం, అతని స్వరూపమే మారిపోతున్నాయి. సాంకేతిక పరిజ్ఞానంలో అతడు క్రమంగా పారిశ్రామిక కార్మికు

నికి చేరువ అవుతున్నాడు.

జాతీయ సంపద, ప్రజలందరి సంపద, సమిష్టి క్షేత్ర రైతాంగంతో బాటు మొత్తం జనాభా యొక్క జీవితానికి ప్రాతిపదిక. ఇదే సమయంలో జాతీయ సంపద విశిష్ట లక్షణాలు, సహకార-సమిష్టి క్షేత్ర సంపదలో మొలకెత్తి వేరూనుతాయి. జాతీయ, సహకార సంపదల రూపాలను క్రమంగా జీవితమే సన్నిహితం చేస్తున్నది. తుదకు అది ఏకైక కమ్యూనిస్టు సంపద అవతరించడానికి, ఏకైక కమ్యూనిస్టు పంపిణీ సూత్రానికి దారితీసుంది.

కమ్యూనిస్టు నిర్మాణ క్రమంలోను, ఉత్పత్తి పద్ధతులు, శ్రమ స్వభావంలోను పెద్ద మార్పుల ఫలితంగాను మరో అతి ముఖ్యమైన సామాజిక సమస్యకు—అంటే బుద్ధి సంబంధమైన శ్రమకు, శారీరక శ్రమకు మధ్య ప్రధానమైన భేదాలను తొలగించడానికి, పరిష్కార మార్గం ఏర్పడుతుంది. మన నిత్యజీవితంలో ఈ పరిణామ క్రమాలను మనం చూస్తూనే వున్నాం. సెకండరీ విద్య నేర్చిన లక్షలాది ప్రజలు పారిశ్రామిక సంస్థలు, సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో పని చేస్తున్నారు. వేలాది కార్మికులు, సమిష్టి వ్యవసాయదార్లు తమ విరామ సమయంలో ఉన్నత విద్యను అభ్యసిస్తున్నారు.

కార్మికుని శ్రమ క్రమంగా ఇంజనీరు శ్రమకు సన్నిహితం అవుతున్నది. ఉదాహరణకు ఫోర్‌మన్‌ను తీసుకోండి. అతడు నిస్సందేహంగా ఇంజనీర్ల, సాంకేతిక ప్రవీణులకోవకు, మేధావులకోవకు చెందుతాడు. అయినప్పటికీ అతడు కూడ కార్మికుడే. లేదా ఎంతో సంఖ్యలోవున్న కొత్త పనిముట్లను కనిపెట్టేవారిని, కొత్తపోకడలలో పనిచేసేవారిని తీసుకోండి. సాంకేతిక అభ్యుదయానికి వారు అందించే సృజనాత్మక సహాయం, తరచుగా ఒక పెద్ద నిపుణుని సహాయంతో మాత్రమే సరితూగుతుంది. అగ్రగాములైన వ్యవసాయ క్షేత్ర కార్మికుల విషయమై కూడ ఇదే విధంగా చెప్పవచ్చు. వారు తమ తమ రంగాలలో ఆచార్యులు.

ఇప్పుడమలులోవున్న వర్గాల మధ్య భేదాల తొలగింపు మరింత

ఉన్నతమైన సమన్వయ సమాజ నిర్మాణానికి దోహదం చేకూర్చుతుంది. ఇది క్రమంగా, దీర్ఘకాలంలో జరిగే పని. సంపూర్ణమైన కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మించే దాకా వర్గభేదాలు పూర్తిగా తొలగిపోవు.

ఈ క్రమ పద్ధతితో పెనవేసుకొని, దీనితో అవిభాజ్య సంబంధం గలదై, కమ్యూనిస్టు సమానత్వం, ప్రజల సంపూర్ణ సామాజిక సమానత్వం రూపుదాలుస్తుంది. ఉత్పత్తి సాధనాలకు, పంపిణీలో సంపూర్ణ సమానత్వానికి, వ్యక్తిగత, సామాజిక ప్రయోజనాలు మిళితం కావడం ప్రాతిపదికగా, వ్యక్తిగత, సామాజిక ఐక్యతకు గల అభేద్య సంబంధాలను అది సూచిస్తుంది. ఈ విధంగా వర్గరహిత కమ్యూనిస్టు సమాజం, మానవ జాతి యొక్క సర్వోన్నత సంఘటిత వ్యవస్థ కాగలదు.

## 2. శ్రామికవర్గ నియంతృత్వ రాజ్యం నుండి యావత్ప్రజా రాజ్యానికి

పార్టీ ముసాయిదా కార్యక్రమం ఒక నూతన ప్రధాన సమస్యను— అంటే కమ్యూనిస్టు సిద్ధాంతమూ, ఆచరణ; కార్మికవర్గ నియంతృత్వాన్ని యావత్ప్రజా రాజ్యంగా మార్పు నొందించడం; ఈ రాజ్య స్వభావమూ, ఉద్దేశమూ; కమ్యూనిజం కింద దీని భవిష్యత్తు అనే సమస్యను లేవదీస్తున్నది, పరిష్కరిస్తున్నది. యావత్ప్రజారాజ్యం సోషలిస్టు రాజ్య పరిణామంలో ఒక నూతన దశ, సోషలిస్టు రాజ్యత్వంనుండి కమ్యూనిస్టు ప్రజా స్వపరిపాలనకు పయనించె మార్గంలో మిక్కిలి ప్రధానమైన దశ.

అర్ధ శతాబ్ది క్రితం శ్రామికవర్గ నియంతృత్వమనే మార్క్సిస్టు-లెనినిస్టు అభిప్రాయాన్ని తన కార్యక్రమంలో పెట్టిన ఏకైక పార్టీ మన పార్టీయే దేశంలోని అభివృద్ధి విరోధకులకు, ప్రపంచ అభివృద్ధి విరోధకులకు వ్యతిరేకంగా జరిగిన తీవ్ర పోరాటంలో మనం నెగ్గగలిగాం. మానవజాతి తర

తరాలనుండి కలలుగన్న సోషలిజాన్ని సిద్ధింపజేయగలిగాం. ఇది యెలా సాధ్యమైంది అంటే, సమాజ పరివర్తనకు ఒక బలోపేతమైన సాధనం—శ్రామికవర్గ నియంతృత్వం మనకు ఉండబట్టే.

శ్రామికవర్గ నియంతృత్వం నెలకొల్పితేనే సోషలిజం విజయం సాధ్యమనే మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాన్ని సోవియట్ యూనియన్, ప్రజాస్వామిక ప్రజాతంత్ర దేశాల అనుభవం పూర్తిగా రుజువు చేసింది.

శ్రామిక వర్గానికి, బూర్జువా వర్గానికి మధ్య వర్గ పోరాటం ఫలితంగా ఏర్పడిన పరిస్థితులవల్ల శ్రామికవర్గ నియంతృత్వం ఆవిర్భవించింది. దాని స్థాపనాక్రమంలో ప్రతిఘటనను, తరచుగా పాత ప్రపంచంలోని పచ్చి అభివృద్ధి నిరోధకుల తీవ్ర ప్రతిఘటనను సోషలిజం అధిగమించవలసి వుంటుంది. కామ్రేడ్స్, ప్రపంచ అభివృద్ధి నిరోధక శక్తుల గట్టి సహకారంతో భూస్వాములు, పెట్టుబడిదార్లు మనలను తీవ్రంగా ప్రతిఘటించిన విషయం గుర్తుకు తెచ్చుకోండి. ఇటీవలనే, 1956లో హంగరీలో విప్లవ ప్రతీఘాతకులు జరిపిన తిరుగుబాటును కూడ గుర్తుకు తెచ్చుకోండి. సోషలిజానికి పరివర్తన చెందే దశలో, దోపిడీదార్ల ప్రతిఘటనను అణచివేసి, విప్లవ విజయాన్ని స్థిరపరచుకోగల, బూర్జువా వర్గ పరిపాలనను పునరుద్ధరించడానికి జరిగే ప్రయత్నాలన్నిటిని సకాలంలో నిరోధించగల, అంతర్జాతీయ అభివృద్ధి నిరోధకుల దురాక్రమణ చర్యలను ఎదిరించి ఆత్మరక్షణ చేసుకోగల బలం కార్మికవర్గానికి ఉండి తీరాలని యిది మరొకసారి రుజువు పరచింది.

శ్రామిక వర్గం కేవలం పెట్టుబడిదార్లకు, భూస్వాములకు, వారి ప్రోత్సాహకులకు వ్యతిరేకంగా బలప్రయోగానికి దిగుతుందే తప్ప, కష్టించి పనిచేసే వర్గాలకు వ్యతిరేకంగా బలప్రయోగానికి దిగదని నొక్కి చెప్పవలసి ఉంది. శ్రామిక వర్గ ప్రభుత్వంలోని ప్రజాస్వామిక స్వభావాన్ని యిదే నిశ్చయిస్తుంది. బూర్జువా ప్రభుత్వంలో అల్ప సంఖ్యాకులైన దోపిడీదార్ల నియంతృత్వం ఉంటుంది. సమాజంలో అత్యధిక సంఖ్యాకులపై

వారు పెత్తనం చెలాయిస్తూ వుంటారు. శ్రామిక వర్గ రాజ్యంలో అలా కాదు. అది సమాజంలోని అత్యధిక సంఖ్యాకుల ప్రయోజనాలను మన్నిస్తుంది. కార్మిక వర్గం రైతాంగాన్ని, సమాజంలోని యితర శ్రామిక ప్రజానీకాన్ని, తన మిత్రులను, తనకు చేదోడు వాదోడుగా వుండే సోదరులను నడిపిస్తుంది. వారు స్వేచ్ఛగా సోషలిస్టు పంథాను చేబట్టడంలో తోడ్పడుతుంది. శ్రామిక వర్గ ప్రభుత్వ లక్షణాలు కలిగి వుండటంచేత యీ నాయకత్వానికి, బూర్జువా ప్రభుత్వానికీ చాలా దూరం. నిరంకుశాధికారం చెలాయించడం, ప్రజలను దాస్యంలో ముంచెత్తడం తప్ప, బూర్జువా ప్రభుత్వానికి మరో సంబంధాలు తెలియవు.

సోషలిస్టు సమాజాన్ని నిర్మించడానికి, మానవున్ని మానవుడు దోపిడీ చేయడాన్ని పూర్తిగా రూపుమాపడానికి, కార్మిక వర్గానికి నియంతృత్వం అవసరమని లెనిన్ మనకు బోధించారు. "ఈ ఆశయం తృటిలో నెరవేరేది కాదు. పెట్టుబడిదారీ విధానం నుండి సోషలిజానికి పరివర్తన చెందడానికి ఎంతో దీర్ఘ కాలం పడుతుంది. ఎందుకంటె ఉత్పత్తి పునర్వ్యవస్థీకరణ క్లిష్టమైన సమస్య. ఎందుకంటె జీవితానికి సంబంధించిన అన్ని రంగాలలోను సమూలమైన మార్పులు తీసుకురావడానికి వ్యవధి అవసరమవుతుంది. బలంగా పాతుకుపోయిన పెట్టి-బూర్జువా, బూర్జువా ఆర్థిక విధానపు అభ్యాస బలిమిని ఎడతెరపిలేని, పట్టు విడుపులు లేని పోరాటం ద్వారా మాత్రమే విచ్ఛిన్నం చేయగలం. అందుచేతనే శ్రామిక వర్గ నియంతృత్వ దశ యావత్తూ పెట్టుబడిదారీ విధానం నుండి సామ్యవాదానికి పరిణామ దశ అని మార్క్సు అన్నారు."*

అందుచేత మార్క్సు, లెనిన్‌లు చెప్పినట్లు, శ్రామిక నియంతృత్వం, పెట్టుబడిదారీ విధానం నుండి సోషలిజానికి పరివర్తన చెందే దశ అవుతుంది.

---

* వి. ఐ. లెనిన్. రచనల సంకలనం, 4వ రష్యా ముద్రణ, సంపుటి 29, పుట 358.

మన దేశంలో సోషలిజం సంపూర్ణంగాను, అంతిమంగాను విజయం పొంది, మనం విశాల ప్రాతిపదికపై కమ్యూనిస్టు నిర్మాణ దశలో ప్రవేశించినప్పుడు, శ్రామిక వర్గ నియంతృత్వానికి అవసరమైన పరిస్థితులు అదృశ్యమైనట్లు, దాని ప్రయోజనాలు నెరవేరినట్లు మనం గమనిస్తున్నాం.

తన పెత్తనాన్ని శాశ్వతంగా అట్టిపెట్టుకొనే ఉద్దేశం లేని వర్గం చరిత్రలో కార్మిక వర్గం ఒక్కటే. తన నియంతృత్వానికి అవసరమైన పరిస్థితులు అదృశ్యమైనప్పుడు, కేవలం దాని సహాయంతోనే సమాజం సాధించుకోదగిన కర్తవ్యాలు పూర్తి అయినప్పుడు, కార్మిక వర్గ నాయకత్వాన, రాజ్యాంగ యంత్రం సోషలిస్టు సమాజంలోని శ్రామికులందరి దేశవ్యాప్త సంస్థగా పరిణమిస్తుంది.

సోషలిజం విజయం పొంది, దేశం విశాల ప్రాతిపదికపై కమ్యూనిస్టు నిర్మాణ దశలోకి ప్రవేశించడంతో సోవియట్ యూనియన్ కార్మిక వర్గం స్వయంగా చొరవ తీసుకొని, కమ్యూనిస్టు నిర్మాణ కర్తవ్యాలను నెరవేర్చాలనే కర్తవ్యానికనుగుణంగా, శ్రామిక వర్గ నియంతృత్వాన్ని యావత్ప్రజా రాజ్యంగా మార్పుచేసింది. కామ్రేడ్స్, యిది చరిత్రలో అపూర్వమైన విషయం! ఇప్పటిదాకా రాజ్యాంగ యంత్రం ఏదో ఒక వర్గం యొక్క నియంతృత్వ సాధనంగానే ఉంటూ వచ్చింది. మన దేశంలో, చరిత్రలో మొదటిసారిగా ఒక కొత్త రాజ్యాంగ యంత్రం రూపొందింది. అది ఏ వర్గం యొక్క నియంతృత్వమూ కాదు. యావత్తు సమాజం యొక్క, యావత్ప్రజల యొక్క సాధనం అది.

కమ్యూనిస్టు నిర్మాణానికి యిక శ్రామిక వర్గ నియంతృత్వం యొక్క అవసరం తీరిపోయింది. మన సమాజంలో శ్రామికు లందరికీ సమాన హక్కులు వున్నాయి. కమ్యూనిజానికి పరివర్తన చెందే సమయంలో కూడా కార్మిక వర్గం సమాజంలో ప్రముఖ పాత్ర వహిస్తుంది. అది యీ పాత్రను నిలబెట్టుకొంటుంది. ఎందుకంటె అది మిక్కిలి అగ్రగామి వర్గం, మిక్కిలి

సంఘటిత వర్గం, యంత్ర పరిశ్రమతో సంబంధం వున్న వర్గం కమ్యూనిస్టు ఆదర్శ దీక్ష గల వర్గం.

సమాజంలో అత్యధిక సంఖ్యాక ప్రజల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించే శ్రామిక వర్గ నియంతృత్వానికీ, యావత్ప్రజా రాజ్యానికీ మధ్య అడ్డు గోడ వుందనుకోవడం తప్పు. శ్రామిక వర్గ నియంతృత్వం ప్రారంభ మైనప్పటి నుండి, అందులో విశ్వజనీన సోషలిస్టు ప్రజాస్వామిక లక్షణాలు వున్నాయి. సోషలిజం అభివృద్ధి చెందేకొద్దీ యీ లక్షణాలు మరింత స్పష్టంగా కనిపిస్తాయి. సోషలిజం పూర్తిగా విజయం పొందిన తర్వాత యివి నిశ్చయాత్మక మవుతాయి.

వర్గ అధికారానికి సాధనంగా వున్న స్థితినుండి యావత్ప్రజల మనో భీష్టాన్ని వెల్లడించే సంస్థగా రాజ్య యంత్రం అభివృద్ధి చెందుతుంది.

మన సమాజం యొక్క, రాజ్యం యొక్క బలం తగ్గిపోకపోవడమే కాకుండా, శ్రామిక వర్గ నియంతృత్వ దశనుండి యావత్ప్రజా రాజ్యంగా మార్పు చెందే దశలో ఎన్నో రెట్లు పెరుగుతుంది. ఎందుకంటె పూర్వబల సంపదల సరసనే నూతన బలసంపదలు కూడా ప్రత్యక్ష మవుతాయి. నిత్యమూ అభివృద్ధి చెందుతున్న మన ఆర్థిక సంపదను కలుపుకొని, మన దేశంయొక్క సామాజిక పునాది యితోధికంగా బలపడింది, విస్తరించింది. సమాజంలో పూర్వంకంటె దృఢమైన ఐక్యత, సంఘీభావమూ ఏర్పడ్డాయి. రాజ్య బలసంపదకు మూలకందం యిదే. ప్రతి కార్మికుడూ, ప్రతి కర్షకుడూ, ప్రతి మేధావీ ఏమని చెబుతారంటే, మేమే ప్రభుత్వం; దాని విధానమే మా విధానం; దానిని అభివృద్ధి పరచుకోవలసిన, దృఢపరచుకోవలసిన, అన్ని విపత్కర పరిస్థితులలోను రక్షించుకోవలసిన కర్తవ్యం మా సమిష్టి కర్తవ్యం అంటారు.

అయితే వర్గాల వైరుధ్యమూ, అందుకు మూలకారణమూ అదృశ్య మైనప్పటికీ ప్రభుత్వం ఎందుకు అట్టిపెట్టుకోబడుతున్నది? ఎందుకంటె ప్రభుత్వ సహాయంతో మాత్రమే సమాజం పరిష్కరించుకోదగిన కర్త

వ్యాలు యింకా పూర్తికాకపోవడం చేతనే. సోషలిస్టు ప్రభుత్వం యొక్క యీ ఆశయాలు, విధులు మన పార్టీ ముసాయిదా కార్యక్రమంలో స్పష్టంగా నిర్వచింపబడ్డాయి.

కమ్యూనిజం ప్రథమ దశ విజయం పొందిన తర్వాత చాలా కాలం వరకు ప్రభుత్వం వుంటుంది. అది అంతరించి పోవడానికి చాలా దీర్ఘకాలం పడుతుంది; అది మొత్తం ఒక చారిత్రక యుగమంతా వుంటుంది; స్వపరిపాలన కోసం సమాజం పూర్తిగా పరిపక్వమయ్యే దాకా అది అంతం కాదు. కొంతకాలంపాటు, ప్రభుత్వ పాలన, ప్రజా స్వపరిపాలన లక్షణాలు మిళితమై వుంటాయి. ఈ దశలో ప్రభుత్వ స్వీయ విధులలో మార్పు వచ్చి, క్రమంగా తమ రాజకీయ స్వభావాన్ని అవి కోల్పోతాయి. సోవియట్ యూనియన్‌లో పెంపొందిన కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మించిన తర్వాతనే, అంతర్జాతీయ రంగంలో సోషలిజం విజయం పొంది అది దృఢంగా సంఘటితమైన పరిస్థితి ఏర్పడిన తర్వాత మాత్రమే, ప్రభుత్వ అవసరం తీరుతుంది; అది అంతరించి పోతుంది.

శ్రామికవర్గ నియంతృత్వం ఇక అవసరం లేదంటే, దాని అర్థం ప్రజలలో క్రమశిక్షణను, చట్టాలను సడలించడమని కానేకాదు. చట్టాలను, క్రమశిక్షణను మరింత గట్టిగా అమలు జరపడానికి, పౌరసత్వాల రక్షణకు పార్టీ చాలా ప్రాధాన్యత ఇస్తుంది. సోవియట్ పౌరుని హక్కులు, స్వేచ్ఛ, గౌరవం, హోదాలను సమాజమూ, ప్రభుత్వమూ సంపూర్ణంగా కాపాడతాయి. మన దేశ ప్రజలలో క్రమశిక్షణ సడలింపబడుతుందని ఎవరైనా భావిస్తే, నిజం తేలిన తర్వాత విచారపడతారు. సంఘ వ్యతిరేక శక్తులను ఏరిపారవేయడంలో ప్రభుత్వ సంస్థలతోబాటు, ప్రజా సంస్థలు కూడ అధిక పాత్ర వహిస్తాయి. ప్రభుత్వ ఆస్తి అపహరించేవారికి వ్యతిరేకంగా, సోమరిపోతులకు, రౌడీలకు వ్యతిరేకంగా మరింత యెక్కువ పోరాటం జరుగుతుంది. తుదకు శ్రామికులందరూ, వారి సంస్థలూ యిలా పోరాడటం తమ కర్తవ్యంగా భావిస్తాయి.

కామ్రేడ్స్, గత కొలది సంవత్సరాలలో, ముఖ్యంగా సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ ఇరవయ్యో మహాసభ తర్వాత, పార్టీ జీవితంలోను, ప్రభుత్వ జీవితంలోను లెనిన్ ప్రమాణాలను పునరుద్ధరించడానికి, సోవియట్ ప్రజాస్వామ్యాన్ని ఇంకా విస్తృతపరచడానికి బ్రహ్మాండమైన కృషి జరిగిందని మీకు తెలుసు. అయినప్పటికీ మన రాజకీయ వ్యవస్థను అభివృద్ధిపరచే కర్తవ్యం పూర్తి అయిందని మనము భావించడంలేదు. యావత్ప్రజా రాజ్యాన్ని పెంపొందించడానికి, ఇతోధికంగా ప్రజలు పరిపాలనలోను, ప్రభుత్వ సంస్థల అజమాయిషీలోను పాల్గొనేట్లు చేయడానికి మనము అన్నివిధాల కృషి సలుపవలసి వుంది.

ప్రభుత్వ ప్రతినిధి సంస్థల పాత్రను గూర్చి ఇక్కడ ఒకమాట చెప్పవలసి వుంది. సోవియట్ల అధికారాలు విస్తృత మవుతాయి. నిజమైన ప్రజా ప్రభుత్వ స్వభావాన్ని గూర్చి పరిశీలన చేసేటప్పుడు మార్క్స్, లెనిన్ భావనలోని "వర్కింగ్ కార్పొరేషన్‌లు"గా వుంటాయి అవి. ఆర్థిక, సాంఘిక కార్యక్రమాల పర్యవేక్షణ విధిని అనునిత్యం నిర్వహించే సంస్థలుగా వుంటాయి అవి. నేడు కార్యనిర్వహణ సంస్థలకు ప్రభుత్వానికి, అప్పగించబడిన ఎన్నో విషయాలను సోవియట్లూ, వాటి కమిటీలే ప్రత్యక్షంగా పరిష్కరిస్తాయి.

కమ్యూనిజానికి పరివర్తన చెందే దశలో ప్రభుత్వ, కృషిలోను, ఆర్థిక యంత్రాంగం యొక్క కృషిలోను ఎడతెగని అభివృద్ధి, అందులో ప్రజాస్వామిక సూత్రాల, సంఘసేవా సూత్రాల అభివృద్ధి జరగవలసి వుంటుంది. సోవియట్, ఆర్థిక తదితర సంస్థల యంత్రాంగం మరింత నిరాడంబరంగా, నడవడానికి మరింత చవకగా, మరింత నిపుణంగా వుండి, పౌరుల అవసరాలకు, దర్ఖాస్తులకు అనుగుణమైన పద్ధతిలో పనిచేసేట్లు చూడవలసి వుంది. దొరతనం, ఉపేక్షాభావం, 'మొక్కుబడి' చెల్లింపు, అనవసర కాలయాపనవంటి పూర్వ అవశేషాలను మనం పూర్తిగా రూపుమాపడం అవసరం. శ్రమజీవుల అవసరాలు, దర్ఖాస్తులపట్ల దొర

తనం ప్రదర్శించిన అధికారులను బహిరంగంగా అభిశంసించడమే కాకుండా, పరిపాలనరీత్యా, న్యాయశాస్త్రరీత్యా కూడ ఖచ్చితంగా చర్య తీసుకోవలసి వుంది.

ట్రేడ్ యూనియన్‌లు, యువ కమ్యూనిస్టు, సహకార సంస్థలు, సాంస్కృతిక, విద్యాసంస్థలవంటి సామాజిక సంస్థల పాత్ర అధికమయ్యే కొద్దీ సోషలిస్టు ప్రజాస్వామ్యం పురోగమిస్తుంది.

లెనిన్ ట్రేడ్ యూనియన్‌లను పరిపాలనా పాఠశాలలని, యాజమాన్య పాఠశాలలని, కమ్యూనిజం పాఠశాలలని అన్నారు. ట్రేడ్ యూనియన్‌ల పాత్రను గూర్చి లెనిన్ వేసిన ఈ మౌలిక అంచనా, కమ్యూనిజానికి పరివర్తన చెందే సమయంలో ప్రత్యేక ప్రాముఖ్యత వహిస్తున్నది. ట్రేడ్ యూనియన్‌ల ద్వారా పారిశ్రామిక, వృత్తి సంబంధమైన, ఆఫీసు పనివారు ఆర్థిక వ్యవహారాలపై అధికాధికంగా తమ పలుకుబడిని చూపగలరు; పారిశ్రామిక సంస్థల కృషిని అభివృద్ధి పరచడంలో తోడ్పడగలరు; ఉత్పత్తి పైని అజమాయిషీ చేయగలరు. అంతే కాదు. ట్రేడ్ యూనియన్‌లకు చట్ట సంబంధమైన హక్కులు ఇవ్వబడుతున్నందువల్ల, యిదివరలో ప్రభుత్వ సంస్థలు నిర్వహిస్తూవచ్చిన విధులు కొన్ని అప్పగించబడినందువల్ల, వాటి పాత్ర అధికమవుతుంది.

సోవియట్ యువజన క్రియాశీల సంస్థ యువజన కమ్యూనిస్టు సంఘ కార్యకలాపాలు మన సామాజిక జీవితంలో అధిక ప్రాధాన్యత వహిస్తాయి. కామ్రేడ్స్, యువజనులు మన స్థానాలను ఆక్రమించేవారు, మన దేశ భవిష్యత్తు వారే. వారు క్రియాశీల సృజనాత్మక శక్తి. మన ఆశయాల కోసం జరిగే పోరాటంలో యీ శక్తి పర్వతాలను సైతం కదిలించగలదు. యువ కమ్యూనిస్టుల విద్య పట్ల మనం నిత్యమూ నిజమైన పితృభావం ప్రదర్శించవలసి వుంది.

మన ప్రభుత్వ నిర్వహణ కష్టజీవుల శ్రేయస్సు కొసమే, కష్టజీవుల ద్వారానే అమలు జరుగుతున్నది. మనము యెలాంటి మినహాయింపు

లేకుండానే పౌరులందరిని సామాజిక వ్యవహారాల పరిపాలనలోకి ఆకర్షించ డానికై కృషిచేస్తున్నాం.

ఈ కర్తవ్యాన్ని మనము యెలా నిర్వహించబోతున్నాము ?

ఒకటి : ప్రతి శ్రామిక పురుషునికి, స్త్రీకీ క్రమంగా మరింత ఉన్నత స్థాయికి చెందిన భౌతిక, సాంస్కృతిక జీవన పరిస్థితులను సృష్టించడం ద్వారా.

రెండు : సోవియట్ ఎన్నికల పద్ధతిలో ప్రజా ప్రాతినిధ్య, ప్రజా స్వామిక సూత్ర పద్ధతులకు మరింత సమగ్ర రూపం కల్పించడం ద్వారా.

మూడు : కమ్యూనిస్టు నిర్మాణంలో ప్రధానమైన విషయాలనుగూర్చి, సోవియట్ ప్రభుత్వ ముసాయిదా న్యాయ సూత్రాలను గూర్చి దేశ వ్యాప్త మైన చర్చల పద్ధతిని ప్రోత్సహించడం ద్వారా.

నాలుగు : అధికార, పరిపాలనా సంస్థల కార్యకలాపాలను ప్రజలే అజమాయిషీ చేసే పద్ధతులను అన్ని విధాల ప్రోత్సహించడం, ఈ అజ మాయిషీ మిక్కిలి ఫలప్రదం అయ్యేట్లు చేయడం ద్వారా.

అయిదు : పరిపాలనా సంస్థలలోని వారిని క్రమంగా మార్పు చేయ డం ద్వారా; ప్రభుత్వ యంత్రాంగంలోని, ప్రజా సంస్థలలోని అధిపతులకు సంబంధించినంతవరకు అధికతరంగా ఎన్నికల పద్ధతిని గట్టిగా అమలు జరపడం; వారు ప్రజామోదం పొందినవారై ఉండేట్లు చూడటం; ఈ సూత్రాన్ని క్రమంగా ప్రభుత్వంలోని, ప్రజాసంస్థలలోని, సాంస్కృతిక సంస్థలలోని అధిపతులందరికీ వర్తింపజేయడం ద్వారా.

మన సిద్ధాంత వ్యతిరేకులు పెట్టుబడిదారీ విధానం ఒక స్వేచ్ఛా ప్రపంచమని అరుస్తూ, మన సోషలిస్టు ప్రజాస్వామ్యాన్ని అన్ని విధాల కించపరచడానికి ప్రయత్నిస్తారు. అయితే ప్రపంచంలోకెల్లా సర్వ శ్రేష్ఠ మైన సోషలిస్టు ప్రజాస్వామ్యం విషయమై వాస్తవాన్ని మరుగుపుచ్చలేరు. ఇంతకూ సోషలిస్టు ప్రపంచం ప్రజాస్వామ్యాన్ని క్రమంగా, నిలకడగా అభి వృద్ధిపరుస్తూ, విస్తరింపజేస్తూ ఉండగా, పెట్టుబడిదారీ ప్రపంచం బూర్జువా

సమాజంలో ఎదుగూ బొదుగూ లేకుండా వున్న కాస్త ప్రజాస్వామ్యాన్ని కుంచిస్తూ, కుదిస్తూ వుందనేది నిర్వివాదమైన విషయం.

ప్రముఖ సామ్రాజ్యవాద దేశాలలో పరిపాలన యిప్పటివరె కొద్ది మంద గుత్తపెట్టుబడిదార్ల చేతులలో కేంద్రీకరింపబడి వుండటం యిదివరకు ఎప్పుడూ లేదు. ఐసెన్‌హోవర్ పరిపాలనను పెద్ద వ్యాపారుల పరిపాలన అని అమెరికన్‌లే వర్ణించారు. అందులోని సభ్యులలో ఇరవై మందికి పైగా కోటీశ్వరులుగాగాని, పెద్ద కార్పొరేషన్‌ల పనిలోగాని వుండేవారు సామ్రాజ్యవాద దేశాల ప్రభుత్వాలలో వ్యక్తులు మారుతారు; కోటీశ్వరుడు. గాని. అతని తాబేదారుగాని ఒకరి స్థానం ఒకరు ఆక్రమిస్తారు; అయితే వారందరూ గుత్త పెట్టుబడిదార్ల ప్రయోజనాలనే కాపాడతారు. బ్రిటిష్ మంత్రివర్గంలోని 19మంది మంత్రులలో 12మందికి గుత్త పెట్టుబడిదార్లతో ప్రత్యక్ష సంబంధం వుంది. అడినోవర్ ప్రభుత్వంలోని 18 మంది సభ్యులలో 12 మంది పెద్ద సంస్థల, స్టాక్ కంపెనీల ప్రత్యక్ష ప్రతినిధులు.

బూర్జువా సిద్ధాంతవేత్తలు పెట్టుబడిదారీ దేశాలలో సమానత్వాన్ని గూర్చి మాట్లాడతారు. అయితే వారు సూచించే సమానత్వం యెటువంటిది? పెట్టుబడిదారీ దేశాలలో సామాజిక చట్రాన్ని తీసుకోండి. అందులో సామాజిక అసమానత్వం ఘోరాతిఘోరం, దాని నెత్తిమీద కొద్దిమంది పారిశ్రామిక, ఆర్థిక ప్రభువులు తిష్ఠవేశారు. రోమన్ సామ్రాజ్య క్షీణదశలోని దొరలవలె వారు విలాసాలతో తులతూగుతూ వుంటారు. ఇదే సందర్భంలో సమాజానికి పునాదిగా వున్న లక్షలాది ప్రజలు దారిద్ర్యానికి గురిచేయబడుతున్నారు; వారికి హక్కులనేవి లేవు. అమెరికాలో కొద్దిమంది ధనికులు. జనాభాలో నూటికి ఒక్కరుగా వున్నవారు, జాతీయ సంపదలో దాదాపు 60 శాతాన్ని తమ అదుపులో వుంచుకొన్నారు; బ్రిటన్‌లో నూటికి ఒక్కరుగా వున్నవారు జాతీయ సంపదలో 50 శాతానికి పైగా తమ అదుపులో వుంచుకొన్నారు.

ఇక పెట్టుబడిదారీ దేశాలలో ఎన్నికల పద్ధతిని తీసుకోండి. గుత్త

పెట్టుబడిదార్ల ప్రయోజనాలకు వీలైనంత యెక్కువ భద్రత కలిగేట్లు ఎన్నికల పద్ధతిని రూపొందిస్తూ, ఓటర్ల వాస్తవాభీష్టానికి అపార్థం కల్పిస్తూ వుంటారు. ఫ్రాన్సులో యిప్పటి యెన్నికల పద్ధతి ఇందుకు చక్కని దృష్టాంతం. అక్కడ యిటీవల జరిగిన ఎన్నికలలో 38,82,204 ఓట్లు తెచ్చుకొన్న కమ్యూనిస్టు పార్టీకి జాతీయ శాసనసభలో కేవలం పది స్థానాలు మాత్రమే దక్కాయి. ఇదే సందర్భంలో 36,03,958 ఓట్లు తెచ్చుకొన్న, అంటే కమ్యూనిస్టులకంటె తక్కువ ఓట్లు తెచ్చుకొన్న అభివృద్ధి నిరోధక యు. ఎన్. ఆర్. కు 188 స్థానాలు లభించాయి. గుత్త పెట్టుబడిదార్ల పచ్చి నియంతృత్వం యిది కాకపోతే మరేది? ప్రజల మనోభీష్టాన్ని అపహాస్యం పాలు చేయడం యిది కాకపోతే మరేది? ఓటర్లలో అత్యధిక సంఖ్యాకులు శ్రమజీవులు. అయితే వారికి పార్లమెంట్లలో ప్రాతినిధ్యం వుందా? అమెరికాలో ఫాక్టరీ కార్మికులు, ఆఫీసు పనివారు, శ్రమజీవులైన రైతులు 5 కోట్లకు పైగా వున్నారు. అయితే అమెరికా కాంగ్రెస్‌లో ఒక్క కార్మికుడైనా, ఒక్క చిన్న రైతు అయినా లేడనేమాట వాస్తవం కాదా?

గుత్త పెట్టుబడిదారీవర్గం పత్రికలు, రేడియో, టెలివిజన్, తదితర ప్రచార సాధనాలన్నిటినీ పూర్తిగా ఉపయోగించుకొంటుంది. తద్వారా ప్రజలను మోసగించ జూస్తుంది; వారి చైతన్యాన్ని మొద్దుపరచి, వారి మనోభీష్టాన్ని తలక్రిందులు చేస్తుంది. ఉదాహరణకు కోటీశ్వరుడు హార్స్టు అదుపులో ఉన్న పత్రికలు ఎవరి మనోభీష్టాన్ని ప్రతి బింబిస్తాయి? అది ఒక మనోభీష్టాన్నే ప్రతిబింబిస్తుంది—అది గుత్త పెట్టుబడిదార్ల మనోభీష్టం.

బూర్జువా వర్గం ప్రజలకు వ్యతిరేకంగా జరిపే పోరాటంలో పోలీసులను, సైనికులను చీటికిమాటికి ఉపయోగిస్తుంది. వెనకటి పశాబ్దాలలో పెట్టుబడిదారీ దేశాలలో ప్రజలు ఎంత రక్తం ఓడ్చారో గుర్తుకు తెచ్చుకోండి! బూర్జువా ప్రజా సామ్యంయొక్క "వాదనల"లో పోలీసు సిబ్బంది, పోలీసు తుపాకి గుండ్లదే ప్రముఖ స్థానం.

ఇలాంటిది వారి "స్వేచ్ఛా" ప్రపంచం. వారి సమాజంలో నిజమైన స్వాతంత్ర్యమూ, ప్రజాస్వామ్యమూ లేదు. సామాజిక పీడన, జాతీయపీడన, అసమానత్వాలపై నిర్మించిన సమాజం అది. మానవుని మానవుడు దోచుకోవడంపై, మానవుని ప్రతిష్ఠను, గౌరవాన్నీ తృణీకరించడంపై ఆధారపడిన సమాజం అది.

సోషలిస్టు దేశాలలో ప్రజాస్వామ్యం వర్ధిల్లుతూ ఉండగా, పెట్టుబడిదారీ దేశాలలో ఇదివరకే కుదింపబడిన ప్రజాస్వామ్యం మరింత కుదింపబడుతున్నది. నేటి ప్రపంచ రాజకీయ పరిణామంలో కనిపిస్తున్న రెండు పరస్పర వ్యతిరేక ధోరణులు ఇవి. సమస్త జాతుల సోషలిస్టు జీవిత విధానానికి ఆదర్శమయ్యేట్లు మన సామాజిక వ్యవస్థను, ప్రజాస్వామ్యాన్ని మరింత సమగ్రంగా రూపొందించడానికి మనము శాయశక్తులా కృషి చేస్తున్నాం, ఇకముందుకూడ చేస్తాం.

## 3. జాతుల మధ్య ఇతోధికం సన్నిహితత్వం, ప్రజల మధ్య దృఢతర మైత్రి

సోవియట్ రిపబ్లిక్ ఆర్థిక, సాంస్కృతిక పురోభివృద్ధిని మరింత ముందుకు తీసుకుపోవాలని, విశాల ప్రాతిపదికపై కమ్యూనిస్టు నిర్మాణ దశలో జాతులమధ్య సర్వవిధాల సాన్నిహిత్యాన్ని ఇతోధికంగా పెంపొందించాలని ముసాయిదా కార్యక్రమం నిర్దేశిస్తున్నది.

జాతీయంగా ఒకదానితో నొకటి ముడిపడి ఉన్న రెండు అభివృద్ధికర ధోరణులు సోషలిజం క్రింద పని చేస్తున్నాయి. ఒకటి: ప్రతి రాష్ట్రంలోను సత్వర, సమగ్ర అభివృద్ధి జరుగుతున్నది. యూనియన్ యొక్క, స్వతంత్ర రిపబ్లిక్కుల యొక్క అధికారాలు విస్తృతమవుతున్నాయి. రెండు: సోషలిస్టు రాష్ట్రాలు శ్రామికవర్గ అంతర్జాతీయతా పతాకంక్రింద మరింత సన్నిహిత మవుతున్నాయి; అవి పరస్పరం ప్రభావితం చేసుకుంటూ నానాటికి సుసంపన్న మవుతున్నాయి.

విశాల ప్రాతిపదికపై కమ్యూనిస్టు నిర్మాణం సోవియట్ యూనియన్‌లో జాతీయ సంబంధాల అభివృద్ధిలో ఒక నూతన దశ. జాతులమధ్య ఇతోధిక సహకారం, అన్నిటికంటె ముఖ్యంగా, సరి అయిన ఆర్థిక నిధానంపై ఆధారపడి ఉంటుంది. యూనియన్ రిపబ్లిక్కులలో ఆర్థిక వ్యవస్థను సమగ్రంగా అభివృద్ధిపరచడం, ఆ విషయంలో ప్రత్యేక ప్రావీణ్యత పొందడం ముసాయిదా కార్యక్రమం యొక్క ఉద్దేశం. ప్రతి రిపబ్లిక్ యొక్క ఆర్థిక వ్యవస్థ మొత్తం సోవియట్ యూనియన్ యొక్క ఏకైక ఆర్థిక వ్యవస్థలో అవిచ్ఛిన్న భాగంగానే అభివృద్ధి చెందుతూనే వుంటుంది. కమ్యూనిస్టు నిర్మాణమనే ఉమ్మడి ఆశయసిద్ధికి ప్రతి రిపబ్లిక్కూ ఎంత ఎక్కువ తోడ్పడితే, సోవియట్ జాతులమధ్య పరస్పర సంబంధాలు అంత ఎక్కువ విశాలంగా, అంత ఎక్కువ సమగ్రంగా ఉంటాయి.

ప్రతి సోవియట్ రిపబ్లిక్ ఆర్థికాభివృద్ధి, సమస్త సోవియట్ జాతుల మధ్య సౌభ్రాతృ సహకారం, పరస్పర సహాయాల ఫలితమే. కజక్‌స్తాన్‌లో బీడు భూముల అభివృద్ధిని తీసుకోండి. ఆ రిపబ్లిక్ స్వంత బాధ్యతపై అంత గురుతరమైన కార్యాన్ని ఎప్పటికీ చేయగలిగి ఉండేదికాదు. రష్యన్‌లు, ఉక్రేనియన్‌లు, బైలో రష్యన్‌లు, తదితర అనేక జాతుల ప్రజలు దానికి తమ తోడ్పాటు యిచ్చారు. లేదా మన పరిశ్రమలు, నిర్మాణ ప్రాజెక్టులు తీసుకోండి. అవి స్నేహపూర్వకమైన, బహుళ జాతీయ సహకార సంస్థలు. అక్కడ పనిచేసే కార్మికులకు తమ చర్మపు రంగువల్లగాని, తాము మాట్లాడే భాషవల్లగాని గౌరవింపబడరు; కమ్యూనిజం ఆశయ సిద్ధి కోసం ఏమి చేయాలి, ఎలాంటి కృషి జరపాలన్న దానివల్లనే వారు గౌరవింపబడతారు. వివిధ రిపబ్లిక్కులలో జనాభా జాతీయ సమ్మేళనంతో నానాటికి ఎక్కువగా కలసిపోతున్నది. అర్హులైన సిబ్బందిని ఒక రిపబ్లిక్ నుండి మరొక రిపబ్లిక్‌కు తీసుకుపోతున్నారు. ఇదంతా మన దేశంలో జాతులమధ్య సంబంధాలు దృఢతరం కావడానికి తోడ్పడుతుంది.

సోవియట్ యూనియన్ ప్రజల జాతీయ రాష్ట్ర వ్యవస్థీకరణ రూపా

లలో జరిగిన అభివృద్ధికూడ సోషలిస్టు జాతుల అభివృద్ధిని వెల్లడిస్తాయి. పార్టీ ఈ రంగంలో ఉత్పన్నమయ్యే అవసరాలన్నిటిని తీర్చడానికి కృషి చేస్తుంది. సోవియట్ సంయుక్త పరిపాలన, స్వతంత్ర ప్రతిపత్తి సూత్రాలు కల్పించిన అవకాశాలన్నిటిని పూర్తిగా వినియోగించుకోవలసి ఉంది. కమ్యూనిస్టు నిర్మాణ పథకాలను అమలు పరచడంలో వివిధ రిపబ్లిక్కుల కృషిని మరింత చక్కగా సమన్వయం చేయడానికై, కొన్ని అంతర్-రిపబ్లికన్ మండల సంస్థలను నెలకొల్పవలసిన అవసరం నేడు సైతం కలదు.

దేశంలోని జాతుల, తెగలమధ్య పెంపొందుతున్న సాన్నిహిత్యానికి సాంస్కృతికాభివృద్ధి, సిద్ధాంత కృషికూడ సహాయకారిగా ఉన్నాయి. వాటి మధ్య ఆత్మిక భావాల ఆదానప్రదానం నానాటికి పెంపొందుతున్నది. ఒక జాతియొక్క సాంస్కృతిక విజయాలు, ఇతరులకు అందజేయబడుతున్నాయి. ఇది సోవియట్ యూనియన్ ప్రజల ఉమ్మడి సాంస్కృతిక ఔన్నత్యానికి, వారి అంతర్జాతీయతా పునాదులు బలపడటానికి, భవిష్యత్తులో ఏకైక, విశ్వజనీన కమ్యూనిస్టు సమాజ సంస్కృతీ నిర్మాణానికి దోహదం చేకూర్చుతుంది.

జాతీయ సంస్కృతీ రీతులు కరడుగట్టిపోవు; పైపెచ్చు అవి అభివృద్ధి చెందుతాయి. కమ్యూనిస్టు నిర్మాణ కర్తవ్యాలకు అనుగుణం కాని పూర్వరీతులు రూపుమాసి, నూతన రీతులు అవతరిస్తాయి. సాహిత్యంలోను, కళలలోను జాతీయ వాసన ఉండటం సహజమే. అయితే ఈ విషయంలో తరచు మనం ప్రాచీన భావాలను ఎదుర్కొన్నాం. ఉదాహరణకు వాస్తు శాస్త్రంలో కొన్ని సందర్భాలలో స్పష్టంగా పూర్వకాలానికి చెందిన రీతులను ఎన్నుకొన్నాం, అవి ప్రస్తుత జీవన పరిస్థితులకు, ప్రజల అవసరాలకు అనుగుణంగా లేకపోయినా సరే. అయితే మన యుగానికి అనుగుణమైన రీతులకు మాత్రమే భవిష్యత్తు ఉంది.

సోవియట్ యూనియన్‌లో వివిధ జాతులు మాట్లాడే భాషల

స్వేచ్ఛాభివృద్ధికి పార్టీ ఇక ముందుకూడ కృషి చేస్తుంది. వివిధ భాషల వాడుకలో ఆంక్షలను, ఆధిక్యతలను, నిర్బంధాలను అన్నిటినీ తొలగిస్తుంది. ప్రతి పౌరుడూ తన బిడ్డలకు బోధనా భాష ఎన్నుకోవడంలో సంపూర్ణ స్వేచ్ఛ కలిగి ఉన్నాడు; కలిగి ఉంటాడు. జాతీయ భాషల అభివృద్ధికి మనము ఏవిధమైన ఆటంకాలనూ విధించం. అయితే వాటి అభివృద్ధి జాతీయంగా అడ్డుగోడలు పెట్టుకోవడానికి ఏవిధంగానూ దారి తీయకూడదు; పైపెచ్చు అది జాతులు ఒకదానికొకటి సన్నిహితం అయ్యేందుకు దారి తీయాలి.

రష్యనేతర జాతులు రష్యన్ భాష నేర్చుకోవడానికి ఎక్కువ ఆసక్తి కనబరుస్తున్నారనే విషయం గమనార్హం. రష్యన్ భాష సోవియట్ యూనియన్‌లోని వివిధ జాతుల ద్వితీయ భాషగా, ఒండొరుల మధ్య వ్యవహార భాషగా తయారైంది. మనదేశ ప్రజలందరి సాంస్కృతిక విజయాలనూ, ప్రపంచ సంస్కృతినీ తెలుసుకోవడానికి ప్రతి జాతికీ, తెగకు అది ఒక సాధనంగా తయారైంది. స్వచ్ఛందంగా రష్యన్ భాషాధ్యయనక్రమం, జాతులమధ్య సహకారాభివృద్ధికి సహాయకారిగా ఉంది.

మన దేశంలో జాతులమధ్య సాన్నిహిత్యం కొనసాగుతున్నది. వాటి సామాజిక సమన్వయత అధికమవుతున్నది. విశాల ప్రాతిపదికపై కమ్యూనిజం నిర్మాణం ముందుకుసాగే కొద్దీ జాతుల సంపూర్ణ ఐక్యత సిద్ధిస్తుంది. అయితే కమ్యూనిజం ప్రధానంగా నిర్మించిన తర్వాతకూడ, జాతులు ఒకదానిలో నొకటి కలగలసిపోతాయని ఇప్పుడే జోస్యం చెప్పడం కష్టం. అన్ని దేశాలలోను సోషలిజం విజయం పొందిన తర్వాత చాలా కాలం వరకు దేశీయ, జాతీయ భేదాలు ఉంటాయని లెనిన్ చెప్పిన విషయాన్ని జ్ఞాపకం పెట్టుకోవాలి.

జాతీయ భేదాలు రూపు మాసిపోతున్నాయని విచారించే వారు ఉన్నారు. వారికి మనం యిచ్చే సమాధానం ఇదీ: కమ్యూనిస్టులు జాతీయ భేదాలను కాపాడి, వాటికి చిరస్థాయి చేకూర్చబోరు. స్వచ్ఛంద, ప్రజా

స్వామిక ప్రాతిపదికపై కమ్యూనిస్టు నిర్మాణంలో, జాతుల, తెగలమధ్య కొనసాగే అతి సాన్నిహిత్య క్రమాన్ని మనము బలపరుస్తాం. శ్రామికవర్గ అంతర్జాతీయత, సోవియట్ దేశభక్తినిగూర్చి మన ప్రజలకు బోధించడం అవసరం. జాతీయ దురభిమాన ఛాయలు ఏమాత్రం పొడసూపినా, వాటిని రాజీపడని బోల్షివిక్ కృతనిశ్చయంతో రూపు మాపవలసి ఉంటుంది.

సోవియట్ యూనియన్‌లోని జాతుల మైత్రి మనము సాధించిన ఘన విజయాలలో ఒకటి. దానిని మనము కంటిపాపవలె కాపాడు కోవాలి!

## 4. కమ్యూనిస్టు విద్య, వ్యక్తియొక్క సమగ్రాభివృద్ధి

కామ్రేడ్స్, ప్రజలకు కమ్యూనిస్టు భావాలు అలవడజేయడం, కమ్యూనిస్టు నిర్మాణానికి అతి ముఖ్యమైన అంశం.

సమాజంలోని సకల సభ్యుల చైతన్యం, సాంస్కృతిక స్థాయి పెరగకపోతే శ్రమ ఉత్పాదక శక్తిని అత్యున్నత ప్రమాణానికి తీసుకువెళ్ళడం, కమ్యూనిస్టు సామాజిక సంబంధాలను అభివృద్ధి పరచడం, కమ్యూనిస్టు మానవ సంబంధాలకు చెందిన సూత్రాలను అనువర్తింప జేయడం ఊహాతీతమైన విషయాలే అవుతాయి. సమాజంలోని సభ్యుల చైతన్యం పెరిగే కొద్దీ, వారి సృజనాత్మక శక్తి పరిపూర్ణమూ, విశాలమూ అవుతుంది; కమ్యూనిస్టు నిర్మాణ కార్యక్రమాన్ని మనం మరింత చక్కగా, మరింత త్వరగా అమలు పరచగలం.

నూతన మానవుని సృష్టిని గూర్చి మాట్లాడేటప్పుడు మన దృష్టిలో వున్న కర్తవ్యాలేవి? అవి యివి:

కమ్యూనిస్టు ప్రపంచ దృక్పథాన్ని దృఢపరచడం: కమ్యూనిస్టు ఆదర్శాలలో గాఢమైన విశ్వాసం; పౌర విధి పట్ల చైతన్యయుతమైన వైఖరి; సోషలిస్టు అంతర్జాతీయత, దేశ భక్తి; దేశం పట్ల విధేయత;

ప్రాణాలు ఒడ్డి అయినా దానిని కాపాడటానికి సంసిద్ధత;

శ్రమ ద్వారా విద్య; శ్రమ పట్ల, సామాజిక ఉత్పత్తి పట్ల కమ్యూనిస్టు వైఖరిని అభివృద్ధి పరచడం;

కమ్యూనిస్టు నైతిక సూత్రాలను దృఢపరచడం; కమ్యూనిస్టు మానవ సంబంధాలకు చెందిన సూత్రాలను స్వచ్ఛందంగా పాటించడం;

సాంస్కృతికాభివృద్ధి: విజ్ఞానశాస్త్ర మూల సూత్రాల పరిజ్ఞానం; సాధారణ, పోలిటెక్నికల్ విద్య; కళాత్మక, భౌతిక విద్య;

కమ్యూనిజం మానవునికి ఉన్నత స్థాయికి తీసుకుపోతుంది. కమ్యూనిజంలో మానవత, వ్యక్తిత్వమూ సంపూర్ణంగా వికసిస్తాయి.

మన సమాజ సభ్యులందరిలో నూతనమైన, కమ్యూనిస్టు విశిష్ట గుణాలన్ను ప్రోది చేయడంతోబాటు, కమ్యూనిస్టు విద్యకు, యువజనుల అభివృద్ధికి పార్టీ ప్రత్యేక ప్రాముఖ్యం యిస్తుంది.

పార్టీ, ప్రజలూ మన దేశంలో అద్భుతమైన కొత్తతరం మానవులను తయారుచేశారు. వారు శ్రద్ధాసక్తులతో సోషలిజాన్ని నిర్మించిన, వీరోచితంగా దేశాన్ని కాపాడినవారు; సాటిలేని యశస్సును సంపాదించినవారు. నేడు మనము కమ్యూనిస్టు సమాజంలో జీవించేందుకు ప్రజలను తయారు చేస్తున్నాం. కమ్యూనిస్టు తరాన్ని బాల్య దశనుండే మలచవలసి వుంటుంది. వారి పట్ల శ్రద్ధ తీసుకోవలసి వుంటుంది; యౌవన దశనుండి వారిపట్ల శ్రద్ధ వహించి, ఉక్కు శిక్షణ యివ్వవలసి వుంటుంది. మన దేశంలో నైతిక అవలక్షణాలు ఏర్పడకుండా ఉండేట్లు, అసంగతమైన విద్యకు, హానికరమైన ఆదర్శానికి ఎవరూ గురికాకుండా ఉండేట్లు హృదయపూర్వకంగా కృషి చేయవలసి వుంది. యువజనులు ఫలవృక్షాల వంటివారు. వారికి ఏమాత్రం హాని కలిగినా, బాగుచేసుకోవడానికి ఎంతో కష్టపడవలసి వస్తుంది. అంతే కాదు, యీ ప్రయత్నాలు ఎల్లప్పుడూ ఫలించవు. కొత్తతరం ప్రజల విషయంలో కూడా యిదే వర్తిస్తుంది.

నూతన మానవుని సృష్టికి పార్టీ విద్యావిషయక కృషి, ప్రభుత్వం,

ట్రేడ్ యూనియన్లు, యువ కమ్యూనిస్టు సంఘం ప్రభావం మాత్రమే కారణం కాదు; సామాజిక జీవిత విధానం—అంటే ఉత్పత్తి పద్ధతి, పంపిణీ పద్ధతులు, ప్రజా సౌకర్యాలు, సామాజిక, రాజకీయ కార్యకలాపాలు న్యాయ విధానం, కోర్టుల కృషి కూడా యిందుకు కారణం. ఈ ఆర్థిక, సామాజిక, రాజకీయ, న్యాయ అంశాలన్నీ ప్రజలలో కమ్యూనిస్టు చైతన్యం కలిగించేట్లు, బూర్జువా మనస్తత్వ, బూర్జువా లక్షణాల అవశేషాలను నిర్మూలించేట్లు చూడవలసి వుంది.

బూర్జువా వర్గం వ్యక్తి స్వేచ్ఛను వ్యక్తి ఆస్తితో ముడిపెడుతుంది. అయితే పెట్టుబడిదారీ దేశాలలో లక్షలాది ప్రజలకు ఆస్తి లేదు. బూర్జువా ఆస్తి, స్వేచ్ఛకు హామీకాదని వారి అభిప్రాయం. వారికి బూర్జువా ఆస్తి పెద్ద గుదిబండగా తయారైంది. చిన్న యజమాని దృష్టిలో ఆస్తి అనేదానితో వ్యక్తిని అభివృద్ధి చేయవలసిన పని లేదు. ఆస్తి గుత్త పెట్టుబడిపైని తాను పూర్తిగా ఆధారపడి వుండేటట్టు చేయడాని కదొకసాధనం.

కార్మిక ప్రజలను దోచుకొని విపరీతంగా లాభాలు గడించడానికై, పెట్టుబడిదార్లకు మాత్రమే వ్యక్తిగత ఆస్తి సంపూర్ణ స్వేచ్ఛ యిస్తుంది. అన్ని రకాల సామాజిక పరాధీనత నుండి మానవుని విముక్తి నొందించి, వ్యక్తియొక్క స్వేచ్ఛాభివృద్ధికి విశాలమైన అవకాశాలు కలిగించేది వ్యక్తిగల ఆస్తి కాకుండా, ఉమ్మడి ఆస్తేనని మన దేశమూ, ప్రపంచం మొత్తంమీద సోషలిస్టు వ్యవస్థా గడించిన అనుభవం రుజువు చేస్తున్నాయి. సమిష్టి కృషి, సహయోగిత్వం, పౌర విధుల పట్ల విధేయత అనే ఉన్నత భావాలను మన ప్రజలు బాగా ఆకళింపు చేసుకొన్నారు.

సోవియట్ ప్రజలలో అభ్యుదయకరమైన, శాస్త్రీయమైన ప్రపంచ దృక్పథాన్ని మరింత ముందుకు తీసుకు పోవడానికి మసాయిదా కార్యక్రమం ఎక్కువ ప్రాముఖ్యం యిస్తుంది. అది సహజమైన విషయమే. ఇంతకూ, మానవుని బుర్ర అశాస్త్రీయమైన భావాలు, అపోహలు, తప్పు అభిప్రాయాలతో నిండి వుంచే అతడు ఆత్మికంగా అభివృద్ధి పొందనేరడు.

చరిత్రలో మొదటిసారిగా, లక్షలాది ప్రజల ప్రపంచ దృక్పథం మార్క్సిజం-లెనినిజం యొక్క శాస్త్రీయ పునాదిపై ఆధారపడుతున్నది. మరింత ఉత్తమ జీవితం కోసం, కమ్యూనిజం విజయం కోసం జరిపే పోరాటంలో ప్రజలకు మార్క్సిజం-లెనినిజం సిద్ధాంత ఆయుధంగా తయారైంది. మార్క్సిజం-లెనినిజం మానవ జాతిని ఉజ్వల కమ్యూనిస్టు భవిష్యత్తు వైపు తీసుకొనిపోయే సరైన, ఖచ్చితమైన, నికరమైన చరిత్రాత్మకమైన కక్ష్యలో నిలబెట్టింది.

మనము విప్లవకారులం, అంతర్జాతీయతా వాదులం, అభివృద్ధి నిరోధక భావాలు ప్రచారం అవుతూ వుంటే పట్టించుకోకుండా వుండలేం. బూర్జువా వర్గం ప్రజల చైతన్యాన్ని చెడగొట్టి, జాతీయ దురహంకారాన్ని ప్రకోపింపజేస్తూ వుంటే, మనం చూస్తూ కూర్చోలేం. సామ్రాజ్యవాద సిద్ధాంతాన్ని బట్టబయలు చేయడానికి పార్టీ యికముందు కూడా కృషి సలుపుతుంది.

కమ్యూనిజం కోసం జరిపే పోరాటంలో, సమిష్టి శ్రేయస్సు కోసం జరిపే కృషిలో కమ్యూనిస్టు చైతన్యం రూపొందింది, బలపడింది. ప్రతి మనుష్యుని ప్రవర్తనలోను, ప్రతి సమిష్టి సంస్థ ప్రతి సంఘం కృషిలోను కమ్యూనిస్టు భావాలు, కమ్యూనిస్టు చేతలు సమ్మిళితమైపోవాలి.

కమ్యూనిస్టు విద్యకు, వ్యక్తి యొక్క సమగ్రాభివృద్ధికి సృజనాత్మక శ్రమే ప్రాతిపదిక అవుతుంది. మానవుని అస్తిత్వానికి, అభివృద్ధికి శ్రమే ఎల్లప్పుడూ మూలంగా ఉంటూ వచ్చింది; ఇకముందు కూడా అదే మూలంగా ఉండగలదు. "పని చేయనివాడు తిండి తినకూడదు" అనే సూక్తి వివిధ రూపాలలో అన్ని భాషలలోనూ, అన్ని జాతులలోనూ ఉంది.

ప్రజలను శ్రమ నుండి కాకుండా, శ్రమ దోపిడీ నుండి విముక్తి చేయడం కమ్యూనిస్టుల ఉద్దేశం. మానవుని శ్రమ, జీవితానికి అవసరమైన మంచి వస్తువులు అందరికి సమకూర్చడం అనేవి కమ్యూనిస్టు సూత్రమైన

"శక్తికి తగినంత పని, అవసరమైనంత అనుభవం" అనే దానిలో సమ్మిళిత మైనాయి.

శ్రమ లేనిదే మానవుడు జీవించలేడని, జీవిత సాధనాలను సృష్టించు కొంటే తప్ప అతడు జీవించ లేడని ప్రతి మానవునిలోను చైతన్యాన్ని కలిగించడం కమ్యూనిస్టు విద్య యొక్క అతి ప్రధాన ఉద్దేశం. తనకోసం, యావత్తు సమాజం కోసం సోవియట్ మానవుడు మంచి అంతా చేశాడు. ఒకడు తన పనిని త్రికరణ శుద్ధిగా చేస్తున్నాడంటే, అన్ని విషయాలను బాగా, సకాలంలో చేస్తున్నాడంటే, తనతోబాటు, తనలాగే ప్రతి ఒక్కరి కోసం పాటుపడే తన సహచరుని బాగోగుల పట్ల శ్రద్ధాసక్తులు చూపుతున్నాడని దాని అర్థం. నూతన సమాజంలో ప్రజల మధ్య స్నేహపూర్వక సహకారం, పరస్పర సహాయం దీనిలోనే గర్భితమైనాయి.

బూర్జువా వర్గం కార్మిక ప్రజలను పీడిస్తుంది, అగౌరవం పాలు చేస్తుంది. స్వేచ్ఛా శ్రమను కమ్యూనిస్టులు జీవిత సాధనంగాను, అఖిల మానవ కళ్యాణ సాధనంగాను, సామాజికాభ్యుదయానికి, సంపత్సమృద్ధికి పట్టుగొమ్మగాను గౌరవిస్తారు.

ముసాయిదా కార్యక్రమంలో, కమ్యూనిజం నిర్మాత నైతిక విధానం, నూతన సమాజపు నైతిక స్థాయి, నైతిక సూత్రాలు ఉల్లేఖింప బడ్డాయి.

వంద సంవత్సరాలకు పైగా బూర్జువా సిద్ధాంతవేత్తలు కమ్యూనిస్టులు నీతి బాహ్యులని, సమాజం యొక్క నైతిక పునాదులను బలహీనపరుస్తారని అపనింద మోపుతూ వచ్చారు. తమ నీతి బాహ్యతను కప్పిపుచ్చుకోవడానికి బూర్జువా వర్గానికి యీ అబద్ధం అవసరమైంది. దోపిడీ వర్గాల నైతిక విశ్వాసాలకు పునాది ఏది? కొన్ని నానుడుల ద్వారా యిది స్పష్టంగా వెల్లడి అవుతుంది: "డబ్బువల్ల చేయలేని పని ఏమిటి?", "నీ తోడివాణ్ని మోసపుచ్చు, లేకపోతే వాడు నిన్ను మోసపుచ్చుతాడు", "డబ్బుకు వాసన లేదు", "మనిషి యింకొక మనిషికి తోడేలు వంటివాడు" అని కొన్ని నానుడులు ఉన్నాయి.

మనం ఈ అమానుషమైన, దుష్టమైన నియమాలను వ్యతిరేకిస్తాం. "వ్యష్టి సమిష్టి కోసం, సమిష్టి వ్యష్టి కోసం", "మానవుడు యింకొక మానవునికి మిత్రుడు, సహయోగి, సోదరుడు" అనే సూక్తులలో వున్న సమిష్టి తత్వ. మానవతా నైతిక సూత్రాలను మనం వాటికి పోటీ పెడతాం.

నూతన నైతిక సూత్రాలను సోవియట్ ప్రజలందరూ పాటించేట్లు చేయడం మన కర్తవ్యం. అయినప్పటికీ పూర్వ అవశేషాలను రూపుమాపవలసిన అవసరం యింకా ఎంతో వుంది. ప్రజా జీవితంలో అభ్యుదయకరమైనదానికి, పాతబడిన, వెనకబడినదానికి మధ్య కంచె లేదు. అభ్యుదయకరమైనదే చివరికి జయిస్తుంది, కాని పూర్వ అవశేషాలు అభ్యుదయాన్ని ఆటంకపరుస్తాయి. మంచి ఆదర్శ శక్తి వృద్ధి అవుతుంది. అదే మన విద్యకు ప్రాతిపదిక. అయితే సకాలంలో ఏరి పారవేయకపోతే కలుపు మొక్కలు త్వరగా ఎదుగుతాయనే విషయంమీకు తెలుసు.

ప్రవర్తన విషయంలో ప్రజలందరూ జాగరూకత వహించేట్లు చేయవలసిన అవసరం వుంది. చాలావరకు సహకార సంస్థలోనో, సంఘంలోనో, ట్రేడ్ యూనియన్‌లోనో, యువ కమ్యూనిస్టు సంఘంలోనో, సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోనో, సాంస్కృతిక, విద్యావిషయిక సంఘంలోనో సభ్యులుగా వున్నవారు, కొన్ని సందర్భాలలో మన పార్టీ సభ్యులు కూడ చెడుపనులు చేస్తారు. సోషలిస్టు మానవ సంబంధాల సూత్రాలను ప్రమాణాలను ఉల్లఘించేవారిని ప్రజలే తమ నైతిక బలాన్ని, అధికారాన్ని ఉపయోగించి ఎదుర్కొనేట్టు చూడవలసి వుంది.

ప్రజలందరూ సంఘీభావంతో అభివృద్ధి చెందేట్లు చేయడం మన ఉద్దేశం. కార్మికవర్గం కాకుండా మరే ఇతరవర్గమైనా, కమ్యూనిస్టు పార్టీ కాకుండా మరే ఇతర పాలక పార్టీ అయినా కష్టజీవు లందరి శక్తిసామర్థ్యాలను పెంపొందించడానికి ఎప్పుడైనా పూనుకొన్నదా ?

ప్రజల సాంస్కృతికాభివృద్ధి జరిగిననాడె, విజయవంతంగా కమ్యూనిస్టు నిర్మాణం పట్టుదలతో సాగుతుందని పార్టీ అభిప్రాయం.

మన దేశం సాంస్కృతిక విప్లవంలో ఒక ఉన్నత దశను చేరుకొన్నది కమ్యూనిజానికి సిద్ధాంతరీత్యా, సాంస్కృతికరీత్యా అవసరాలను కుదుర్చడం దాని ప్రధాన ఉద్దేశం. ఈ దశలో అతి ప్రధానమైన కర్తవ్యం ఏమిటంటే, కార్మికుల, రైతులందరి సాంస్కృతిక, సాంకేతిక స్థాయిని మేధావుల స్థాయికి పెంచడం. అలా జరిగితేనే, ప్రధానంగా, బుద్ధి సంబంధమైన, శారీరక శ్రమల మధ్యగల ముఖ్య భేదాలను తొలగించడానికి వీలవుతుంది.

వచ్చే 20 సంవత్సరాలలోను సమాజ సభ్యులలో అత్యధిక భాగం ఏదో ఒక భాషలో సెకండరీ, ప్రత్యేక సెకండరీ, లేదా ఉన్నత విద్యను సంపూర్ణంగా పొందుతారు. అనొక బ్రహ్మాండమైన కర్తవ్యం, అయితే ఆచరణ సాధ్యమైన కర్తవ్యం.

వచ్చే పది సంవత్సరాలలో బడి ఈడుగల పిల్లలందరికి సాధారణ, పాలిటెక్నికల్ సెకండరి (11 సంవత్సరాల) విద్యను అమలు పరచవలసి వుంది. పాఠశాల చట్టం ప్రకారం పూర్తి ఎనిమిదేళ్లు బడిలో చదువుకొన్న తర్వాత, పిల్లలు పారిశ్రామిక వస్తూత్పత్తి సంస్థలలోనో సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోనో తప్పనిసరిగా పనిచేయాలి; అలా పని చేస్తూనే సంపూర్ణంగా సెకండరీ విద్యను అభ్యసించాలి. ఇది ఉన్నత విద్యకు, ఫాక్టరీలోగాని, వ్యవసాయ క్షేత్రంలోగాని అతి నైపుణ్యంగల కృషికి మార్గం సుగమం చేస్తుంది.

వచ్చే పది సంవత్సరాలలోను, జాతీయ ఆర్థిక వ్యవస్థలో పని చేస్తూ సెకండరీ విద్య లేని యువజనులు, పాఠశాలలో కనీసం ఎనిమిదేళ్లు చదివితే వచ్చే విద్యతో సమానమయిన విద్య పొందడం కూడ అవసరం. ఇది ప్రధానమయిన, అత్యవసరమయిన కర్తవ్యం. యుద్ధకాలంలో ఎంతో మంది బాలబాలికలకు సెకండరీ విద్య అభ్యసించే అవకాశం లేకుండా పోయిందనే విషయం గుర్తు ఉంచుకోవాలి. మన దేశంలోని యీ యువ పౌరులపట్ల తగినంత శ్రద్ధ వహించాలి.

సోవియట్ పాఠశాలలు మానవుని సమగ్ర, సంఘీభావాభివృద్ధిలో

ప్రధానమైన పాత్ర వహిస్తాయి. బడిపిల్లలకు కమ్యూనిస్టు భావాలు బోధించేటప్పుడు, వారు ఉత్తమ గుణాలు, అలవాట్లు అలవరచుకొనేట్లు పాఠశాలలు చేయాలి. శక్తి ఉన్నంతమేరకు త్రికరణశుద్ధిగా శ్రమించడానికి, సామాజిక సౌకర్యాలను యుక్తయుక్తా విచక్షణతో ఉపయోగించుకోవడానికి, కమ్యూనిస్టు నైతిక సూత్రాలను, మానవ సంబంధాల సూత్రాలను తప్పక పాటించడానికి వారిని సంసిద్ధంచేయాలి. కొత్తతరం వారికి విద్యనేర్పడంలో ఉపాధ్యాయులు చాలా పెద్ద పాత్ర వహించవలసి వుంది. వారు యువజనుల నైతిక ఉపదేష్టలు అని చెప్పవచ్చు. పాఠశాల ఉపాధ్యాయుని పాత్రను వీలైనన్ని విధాల పెంచవలసి వుంటుంది. ఉపాధ్యాయుని పట్ల శ్రద్ధాదరాలు చూపవలసి వుంటుంది.

పౌర విద్యాసంస్థల అభివృద్ధికి అంటే—బోర్డింగు స్కూళ్ళు, పగటిపూట పిల్లల బాధ్యత తీసుకునే బడులు, పాఠశాలాపూర్వ విద్యా సంస్థల అభివృద్ధికి పార్టీ అధిక ప్రాముఖ్యత యిస్తుంది. పౌర విద్య, కుటుంబ విద్య ఒకదానికొకటి వ్యతిరేకం కావు. పిల్లలపై కుటుంబ విద్యా ప్రభావం, వారి పౌర విద్యతో సమ్మేళనం కావాలి.

కమ్యూనిజానికి పరివర్తన చెందే దశలో కుటుంబ ప్రాధాన్యత తగ్గిపోయి, కాలక్రమేణ అది పూర్తిగా అదృశ్యమవుతుందని కొందరు అంటున్నారు. అది శుద్ధ పొరపాటు. వాస్తవంలో, కమ్యూనిజం క్రింద కుటుంబం యింకా బలపడుతుంది. భౌతిక దృష్ట్యా భారం పూర్తిగా తగ్గిపోయి కుటుంబ సంబంధాలు చాలా పవిత్రంగా, సుస్థిరంగా వుంటాయి.

పార్టీ ఒకవైపున దేశమంతటా సెకండరీ విద్యాబోధ చేయించడానికి కృషి సలుపుతూనే, ప్రతి ఒక్కరికీ అన్నిరకాలైన ఉన్నత విద్య మరింత అందుబాటులో ఉండేట్లు చేయడం తన లక్ష్యంగా పెట్టుకొంటుంది కూడా. ప్రస్తుతం మన ఉన్నత విద్యా సంస్థలలో 26,00,000 మంది చదువుకొంటున్నారు. 1980 నాటికి ఉన్నత విద్యా సంస్థలలో చదువుకొనే వారి సంఖ్యను 80 లక్షలకు—అంటే మూడు రెట్లకు పైగా పెంచదలచాం.

ఉన్నత, సాయంత్ర, ఉత్తర ప్రత్యుత్తర పాఠశాలలను విస్తృత పరిచ దానికి ప్రత్యేకమయిన ప్రాముఖ్యత యివ్వబడుతుంది.

సాంస్కృతిక, సాంకేతిక స్థాయిలో గ్రామీణ జనాభా పట్టణ జనాభా కంటె యిప్పటికీ చాలా వెనుకబడి వుంది. పట్టణానికి, పల్లెటూళ్ళకు మధ్య యీ రంగంలో గల ప్రధానమైన భేదాలను కూడ మనము తొలగించవలసి వుంది. సాంస్కృతిక రంగంలో పనిచేసే సంస్థలన్నీ పల్లెటూళ్ళ సాంస్కృతిక స్థాయిని పెంచడానికి ద్విగుణీకృతమయిన కృషి సలపడం అవసరం.

వచ్చే కొద్ది సంవత్సరాలలోను సంస్కృతి యొక్క భౌతిక పునాదిని — అంటే కాగితపు ఫాక్టరీలు, ముద్రణాలయాలు, రేడియో, టెలివిజన్ స్టేషన్లు, నాటకశాలలు, ఫిల్మ్ స్టుడియోలు, సినిమాలు క్లబ్బులు, గ్రంథాలయాలను విస్తృతంగా అభివృద్ధి పరచడానికి పెద్ద యెత్తున చర్యలు తీసుకోవలసి వుంది. ఇందుకు సహజంగానే పెద్ద మొత్తాలు ఖర్చు అవుతాయి. అయితే, కమ్యూనిజం నిర్మిస్తున్న మన సమాజం సోవియట్ ప్రజల సాంస్కృతిక అవసరాలను పూర్తిగా తీర్చడానికి ఏ మాత్రమూ తటపటాయించదు.

వైజ్ఞానికంగా, సాంకేతికంగా సత్వరాభివృద్ధి జరుగుతున్న మన యుగంలో, శాస్త్రీయ విజయాలను క్రమబద్ధంగా, సమగ్రంగా ఉపయోగించుకోకుండా సమిష్టి యొక్క, వ్యక్తి యొక్క అభివృద్ధి ఊహించరాని విషయం. లెనిన్ చెప్పినట్లు "ఏ దుష్టశక్తీ విజ్ఞానశాస్త్ర, శ్రామికవర్గ, సాంకేతిక విజ్ఞానాల ఐక్యతను అడ్డగించ లేదు"* ఈ ప్రవచనాలు వాస్తవమైనాయి. దోపిడీదార్ల దుష్టశక్తిని మనము రూపుమాపాము, ఆర్థిక, ఆత్మిక పీడనా పద్ధతులన్నిటిని మనము తుడిచిపెట్టాం. ఇప్పుడు ప్రకృతి శక్తులకు మానవుని పరాధీనతను రూపుమాపి, అవి మానవుని మనోభీష్టానికి లొంగేట్లు చేయడానికి మనము యితోధిక కృషి సలుపు

* వి. ఐ. లెనిన్, రచనల సంకలనం, 4వ రష్యన్ ప్రచురణ, సంపుటి 30 పుట 376.

తున్నాం. తద్వారా తన మార్గంలో వున్న తుది అడ్డంకిని కూడ తొలగించు కొని, మానవుడు నిజమయిన స్వాతంత్ర్యం పొందగలడు.

విజ్ఞానశాస్త్రం నేటి అవసరాలను తీర్చేదిగా, జాతీయ ఆర్థిక వ్యవస్థలో ఎదురవుతున్న అత్యవసర సమస్యలను పరిష్కరించడంలోను, సామాజిక ఉత్పత్తి శక్తులను అభివృద్ధి పరచడంలోను అప్రతిహత సాధనంగా వుండాలి; కాలక్రమేణ థెర్మో న్యూక్లియర్ రియాక్షన్‌లను అదుపులో పెట్ట డానికి అది మార్గాన్వేషణ చేయాలి. తద్వారా, అపరిమితంగా వున్న అణుశక్తిని శాంతియుత కార్యకలాపాలకోసం ఉపయోగించేట్లు చూడాలి: శీతోష్ణస్థితిని, వాతావరణాన్ని అదుపులో పెట్టాలి; రుగ్మతను జయించి, ఆయుఃప్రమాణాన్ని పెంచాలి; ప్రాణుల జీవిత క్రమాలను అదుపులో పెట్టాలి; అవసరం వచ్చినప్పుడు వాడుకోవడానికిగాను అసంఖ్యాకమయిన కృత్రిమ భౌతిక వస్తు సముదాయాన్ని సృష్టించాలి; అంతరిక్షాన్ని జయించి, విశ్వాంతరాళంలో చక్కని రహదార్లు ఏర్పాటు చేయాలి. ప్రపంచ వైజ్ఞా నిక, సాంకేతిక విజ్ఞాన చరిత్రలో యిదొక ప్రత్యేక యుగం అవుతుంది. మానవునికి తరుగని శక్తి సంపదలను సమకూర్చి, అతనిని ప్రకృతికి నిజ మయిన అధిపతిగా చేస్తుంది.

కమ్యూనిజం వైపు మానవుని చరిత్రాత్మక యాత్ర పరిశీలనలో సామాజిక విజ్ఞాన శాస్త్రాల ప్రభావం అధికమవుతుంది: పెట్టుబడిదారీ విధా నాన్ని కూలద్రోసే పద్ధతులను గూర్చి, సామాజికాభివృద్ధి విషయంలో క్రమబద్ధమైన యాజమాన్యానికి గల శాస్త్రీయ పునాదులను విపులీకరించడం, ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధి, భౌతిక ప్రపంచ దృక్పథాన్ని ప్రజలకు అల వరచడం, కమ్యూనిస్టు సమాజానికి చెందిన మానవునికి విద్యగరపడం, బూర్జువా సిద్ధాంతానికి వ్యతిరేకంగా పోరాటం జరపడం మొదటి పరిశీలనలో సామాజిక విజ్ఞాన శాస్త్రాల ప్రభావం అధికమవుతుంది. పార్టీ మానవుని విజ్ఞానం బహుముఖాల వికసించేట్లు కృషి చేస్తుంది.

విజ్ఞానానికి సంబంధించిన అనేక రంగాలలో సోవియట్ విజ్ఞాన

శాస్త్రం ఇదివరకే సంపాదించిన ఉన్నత స్థానాన్ని దిట్టపరచడం, సోవియట్ విజ్ఞాన శాస్త్రం మౌలిక రంగాలన్నిటా ప్రపంచ విజ్ఞాన శాస్త్రంలో ప్రముఖ పాత్ర వహించేట్లు చూడటం సోవియట్ విజ్ఞాన వేత్తల గౌరవ ప్రదమైన, దేశ భక్తియుతమైన కర్తవ్యం.

సాహిత్యమూ, కళలు నూతన మానవుని సృష్టించడంలో పెద్ద పాత్ర వహిస్తాయి. కమ్యూనిస్టు భావాలకు, నిష్కళంకమైన మానవత్వాన్ని ఉద్ఘాటించడం ద్వారా సాహిత్యమూ కళలూ సోవియట్ మానవునిలో నూతన ప్రపంచ నిర్మాతల గుణాలను ప్రోదిచేస్తాయి: ప్రజల కళాత్మక, నైతికాభివృద్ధికి తోడ్పడతాయి. సాహిత్య, కళారంగాలలో కృషిచేస్తున్న వారందరూ తమ సమకాలిక విషయాలలో నూతనమైన, ధైర్యవంతమైన రీతులను అన్వేషించాలని పార్టీ పిలుపు యిస్తున్నది.

విస్తృతంగా వ్యాపిస్తున్న ఔత్సాహిక కళ ప్రజారంజకమైన ప్రతిభలను సృష్టించడానికి, అభివృద్ధిపరచటానికి చాలా తోడ్పడగలదు. అయితే, వృత్తి సంబంధమైన కళలను అభివృద్ధి పరచుకోవలసిన అవసరం లేకుండా పోతుందని దీని అర్థంకాదు. ఆయా కళలే వృత్తిగా గల బృందాల, ప్రముఖ వ్యక్తుల కళాత్మక కార్యకలాపాలు భవిష్యత్తులో కూడా, ఔత్సాహిక కళకు ఆదర్శంగా వుంటాయి. అంతేకాదు, ఔత్సాహిక కళ కూడా వృత్తి సంబంధమైన సాహిత్య, కళా పరిపుష్టికి, అభివృద్ధికి పెన్నిధివలె ఉపకరించగలదు.

సోషలిస్టు, కమ్యూనిస్టు సంస్కృతి మానవుని సాంస్కృతికాభివృద్ధిలో ఒక నూతనమైన, అత్యున్నతమైన దశ. కమ్యూనిస్టు సంస్కృతీ శిఖరాలను విజయవంతంగా చేరుకోవడానికి అవసరమైన పరిస్థితులన్నీ మనకు ఉన్నాయి.

# V

# కమ్యూనిజం, మానవజాతి అభ్యుదయం

కామ్రేడ్స్, మన పార్టీ కార్యక్రమాన్ని అమలు జరపడం వల్ల, ప్రపంచ చరిత్ర గమనంపై దాని ప్రభావం అధికాధికంగా ఉంటుంది.

నిర్మాణ దశలో కమ్యూనిజం తన ఆదర్శ శక్తి ద్వారా ప్రపంచమంతటా గల కష్టజీవులలో నూతనంగా కోట్లాది మందిని మార్క్సిజం-లెనినిజం పతాకం వైపు ఆకర్షించగలదు. కమ్యూనిజం నిర్మాణం అంటే, అన్నిటికంటె ముఖ్యంగా, ఉత్పత్తి శక్తుల సత్వరాభివృద్ధి; ప్రజల సాంస్కృతిక, జీవన ప్రమాణాలను ఉవ్వెత్తున పెంపొందించడం; శాంతియుతమైన, సుఖప్రదమైన జీవితం కోసం తగు పరిస్థితులను సృష్టించడం. విజయవంతమైన సోషలిస్టు దేశాలు తమ ఆర్థిక నిర్మాణం ద్వారానే ప్రపంచ విప్లవాభివృద్ధికి ముఖ్యంగా దోహదం చేకూర్చగలవని లెనిన్ దూరదృష్టితో చెప్పిన మాటను సాంఘికాభివృద్ధి క్రమమంతా ఋజువు చేసింది. శాంతియుతమైన ఆర్థిక పోటీ సోషలిస్టు, పెట్టుబడిదారీ వ్యవస్థల మధ్య ప్రధానమైన పోటీ రంగంగా వుంది.

సోవియట్ యూనియన్, అమెరికాల మధ్య జరిగే పోటీ ద్వారా ఈ పోటీ ఫలితం అత్యధికంగా నిశ్చయింపబడుతుంది.

వచ్చే పదేళ్ళ లోపల మన దేశాన్ని ప్రపంచ ప్రముఖ పారిశ్రామిక శక్తిగా రూపొందించడానికి, మొత్తం పారిశ్రామిక ఉత్పత్తి పరిమాణం, జనాభా యొక్క తలసరి పారిశ్రామిక ఉత్పత్తి పరిమాణాలలో మన దేశం అమెరికాను మించిపోయేట్లు చేయడానికి పార్టీ పూనుకొన్నది. ఇంచుమించు ఇదే కాలంలో, జనాభాయొక్క తలసరి వ్యవసాయ ఉత్పత్తిలో సోవియట్ యూనియన్ ఇప్పటి అమెరికా స్థాయిని

యాభై శాతం ఉంచుతుంది; అమెరికా జాతీయాదాయం యొక్క స్థాయికి చేరుకొంటుంది.

అయితే ఇది ప్రథమ లక్ష్యం మాత్రమే. మనము ఇంతటితో జరిగి పోము. తర్వాత వచ్చే పదేళ్ళలో, అంటే 1980 నాటికి, మన దేశం జనాభాయొక్క తలసరి పారిశ్రామిక, వ్యవసాయ ఉత్పత్తిలో అమెరికాను చాలా మించిపోతుంది.

సోవియట్ యూనియన్ యొక్క సోషలిస్టు వ్యవస్థ మాత్రమే కాకుండా ప్రపంచంలోని అన్ని సోషలిస్టు దేశాల ఆర్థిక వ్యవస్థలు కూడ పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ కంటె చాలా వేగంగా అభివృద్ధి చెందుతున్నవి. యుద్ధానికి పూర్వపు స్థాయిలో పోల్చిచూస్తే, సోషలిస్టు దేశాలు మొత్తం పారిశ్రామిక ఉత్పత్తి దాదాపు ఏడు రెట్లు పెరిగింది; ఇదే సమయంలో పెట్టుబడి దారీ దేశాల మొత్తం పారిశ్రామిక ఉత్పత్తి రెండున్నర రెట్లకు లోపుగానే పెరిగింది. 1980 నాటికి ప్రపంచ పారిశ్రామిక ఉత్పత్తిలో దాదాపు మూడింట రెండువంతులు సోషలిస్టు దేశాల ఉత్పత్తి కిందే జమపడుతుందని ఆర్థిక శాస్త్రవేత్తల ప్రాథమిక అంచనాలు తెలుపుతున్నాయి.

అంకెలు పేలవంగా ఉంటాయని కొందరు చెబుతారు. అయితే మన వ్యవస్థయొక్క అభివృద్ధిని ప్రతిబింబించే అంకెలను ఉదహరిస్తే, వింటే ముచ్చట గొలుపుతాయని నా అభిప్రాయం. నా చిన్నతనంలో మేము ఒక పాట పాడేవాళ్ళం: "మా స్టీమ్ ఇంజన్ ముందుకు దూసుకుపోతున్నది. కమ్యూనిజం దాని గమ్యం" అని ఆ పాట సారాంశం. నేడు మనమూ, సోషలిస్టు వ్యవస్థ యావత్తూ స్టీమ్ ఇంజన్ పైన కాకుండా బలోపేతమైన విద్యుచ్ఛక్తి ఇంజన్ పైన ముందుకు దూసుకుపోతున్నాం. మన సోషలిస్టు ఎక్స్‌ప్రెస్ పెట్టుబడిదారీ విధానం యొక్క రైలు బండిని చాలా మించిపోతుందనడంలో సందేహం లేదు. పెట్టుబడిదారీ విధానానికి బలమూ లేదు, లాక్కుపోయే శక్తి లేదు.

మన దేశంలో కమ్యూనిజం నిర్మాణం, యావత్తు సోషలిస్టు ప్రపం

చంలోను కమ్యూనిస్టు సమాజాన్ని సృష్టించడంలో ఒక అవిచ్ఛిన్న భాగం. ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ విజయవంతంగా అభివృద్ధి చెందినప్పుడు సోషలిస్టు దేశాలు దాదాపు ఒకే కాలంలో, ఒకే చారిత్రక యుగంలో కమ్యూనిజానికి పరివర్తన చెందడానికి అవకాశాలు ఏర్పడుతాయి. ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ, ఎగుడు దిగుడు ఆర్థిక, రాజకీయాభివృద్ధి సూత్రం క్రిందికి వస్తుంది. ఇది రాజ్యాల మధ్య వైరుధ్యాలు తీవ్రతరం కావడానికీ, శత్రుత్వం అధికం కావడానికి దారితీస్తుంది. ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ యిందుకు పూర్తిగా విరుద్ధమైన సూత్రాల ననుసరించి అభివృద్ధి చెందుతున్నది. సోషలిస్టు ప్రపంచంలో ప్రతి దేశం యొక్క ఆర్థికాభివృద్ధీ ఒడుదుడుకులు లేకుండా, క్రమబద్ధంగా జరిగడం, లోగడ పెట్టుబడిదారీ విధానం క్రింద ఆర్థికంగా వెనకబడిన దేశాలు చాలా త్వరితగతిని అభివృద్ధి చెందడం, అన్ని దేశాలు తమ అభివృద్ధిలో ఒకే విధమైన సాధారణ స్థాయిని పొందడం యిందులో జరుగుతుంది.

ప్రత్యేక చారిత్రక పరిస్థితుల కారణంగా, ఒకప్పుడు వెనకబడివున్న దేశాలు, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ యొక్క చట్రం లోపలికి వచ్చి, చాలా స్వల్పకాలంలోనే, అభివృద్ధి చెందిన సోషలిస్టు దేశాల స్థాయిని సమీపించాయి. అభివృద్ధి చెందిన సోషలిస్టు దేశాలు అన్ని విధాల తోడ్పడడంవల్ల యిలా జరిగింది. అయినప్పటికీ ఈ దేశాలలో ఉత్పత్తి శక్తుల అభివృద్ధి స్థాయి యింకా ఒకేవిధంగా లేదు. అందుచేత సోషలిస్టు దేశాలన్నీ ఒక "నిర్దిష్ట కాలంలో" నూతన సమాజం యొక్క పై అంతస్థుకు వెళ్ళే అవకాశం కనిపించదు.

తగు పరిస్థితులు ఏర్పడినప్పుడు ఆ దేశాలలో విశాల ప్రాతిపదికపై కమ్యూనిస్టు సమాజ నిర్మాణం జరిగడం సహజం. తక్కిన సోషలిస్టు దేశాల ప్రజలు కమ్యూనిజం వైపు ఉమ్మడిగా సాగిపోయే కొద్దీ, కమ్యూనిజం విజయవంతం అయిన దేశాలనుండి ఇతోధిక సహాయం పొందడానికి మరింత అనుకూల పరిస్థితులు ఏర్పడతాయి. ఇది యావత్తు సోషలిస్టు

వ్యవస్థ యొక్క ప్రయోజనాలకూ అనుగుణమైనది.

తన కుటుంబాన్ని వీలైనంత ఎక్కువగా బలపరచుకోవాలని సోషలిస్టు దేశాల మౌలిక ప్రయోజనాలు ఆదేశిస్తున్నాయి. ఈ విషయంలో మార్క్సిస్టు-లెనినిస్టులకు ఎలాంటి భేదాభిప్రాయమూ లేదు. ప్రపంచ సోషలిస్టు జాతినుండి వేరుపడి, ఏకాకిగా సోషలిజం నిర్మాణానికై జరిపే ప్రయత్నమేదైనా సోషలిస్టు సమాజాభివృద్ధి యొక్క భౌతిక నియమాలకు వ్యతిరేకం అవుతుంది. అలాంటి ప్రయత్నం హానికరం. ఎందు చేతనంటే, అభివృద్ధి నిరోధకులైన సామ్రాజ్యవాదుల ఐక్యసంఘటన ఎదుట, అది సోషలిస్టు శక్తులను బలహీన పరచవచ్చు. అది జాతీయ దురభిమాన ధోరణులను ప్రోత్సహిస్తుంది; కాలక్రమేణ సోషలిస్టు విజయాల నష్టానికి అది దారి తీయవచ్చు.

సోషలిస్టు దేశాల ఐక్యతను చెడగొట్టడానికై అంతర్జాతీయ అభివృద్ధి నిరోధకులు జాతీయత అనే ఆయుధాన్ని ప్రయోగించారు. ఏ రూపంలో ప్రయోగింపబడినప్పటికీ యిది చాలా ప్రమాదకరమయిన రాజకీయ, సిద్ధాంత ఆయుధం.

ముసాయిదా కార్యక్రమంలో పేర్కొన్నట్లు, "కార్మిక ప్రజానీకంలో అంతర్జాతీయతా భావాన్ని, సోషలిస్టు దేశ భక్తిని, జాతీయత, జాతీయ దురహంకార తత్వాలు ఏ మాత్రం పొడచూపినా అసహన భావాన్ని ఉద్దీపింప జేయడం కమ్యూనిస్టుల ప్రధాన కర్తవ్యం. జాతీయత అనేది సోషలిస్టు కుటుంబం యొక్క ఉమ్మడి ప్రయోజనాలకూ, ముఖ్యంగా ఆ పిల్వంగల దేశ ప్రజలకు హానికరమయినది. ఎందుకంటే, సోషలిస్టు కుటుంబం నుండి వేరుపడి వుండటం వల్ల ఆ దేశం యొక్క అభివృద్ధి కుంటుపడుతుంది. ప్రపంచసోషలిస్టు వ్యవస్థనుండి లభ్యమయ్యే సౌకర్యాలు లేకుండా పోతాయి. సామ్రాజ్యవాద శక్తులు జాతీయ దురభిమాన ధోరణులను రెచ్చగొట్టి, తద్వారా ఏలైనంత లాభపడటానికి వీలు చిక్కుతుంది."

యూరప్, ఆసియా సోషలిస్టు దేశాలలోని చైనా సోదరుల పట్ల

సోవియట్ ప్రజలు చాలా స్నేహభావం కలిగి ఉన్నారు. తమ సోదరుల విజయాల పట్ల హర్షం వెల్లడిస్తున్నారు; వాటిని గూర్చి సగర్వంగా చెప్పు కొంటున్నారు, తమ సోదరులు నూతన జీవితం ఏర్పాటు చేసుకోవడానికి తోడ్పడ్డారు, ఇకముందు కూడా ఆ విధంగా చేయగలరు. కష్ట సుఖాలు రెండింటిలోను సోషలిస్టు దేశాల ప్రజలు వ్యష్టి కోసం సమష్టి, సమష్టికోసం వ్యష్టి సూత్రానికి అనుగుణంగా నడుచుకొంటారు. మన కుటుంబ ప్రజలు సంపాదించిన సోషలిస్టు విజయాలకు దెబ్బకొట్టడానికి ఎవరు ప్రయత్నిం చినా, సోషలిజం, కమ్యూనిజం నిర్మాణంలో పాల్గొంటున్న కోట్లాది ప్రజానీ కమూ వారిని వెనక్కి గదిమి పారవేస్తారు.

యుగోస్లావియాకు సంబంధించినంత వరకు, యిదివరకే కేంద్ర కమిటీ నివేదికలో పేర్కొన్నట్లు, మనము యుగోస్లావియా కమ్యూనిస్టు లీగ్ నాయకత్వం యొక్క రివిజనిస్టు పోకడలకు వ్యతిరేకంగా పోరాడాం; ఇకముందు కూడా పోరాడతాం. ఇదే సందర్భంలో మనము ప్రభుత్వ పద్ధ తులలో యుగోస్లావియాతో గల సంబంధాలను వీలైనంత ఎక్కువగా అభి వృద్ధి పరచుకోవడానికి, దృఢపరచుకోవడానికి కృషి చేశాం; ఇకముందు కూడా చేస్తాం. శాంతి కోసం పోరాటం జరిపే విషయంలో మన వైఖరి, యుగోస్లావియా వైఖరి చాలా సందర్భాలలో ఒకదానితో నొకటి మేళవిస్తు న్నాయి. సామ్రాజ్యవాద యుద్ధోన్మాదులకు వ్యతిరేకంగానూ, వివిధ దేశాల మధ్య శాంతి, స్నేహాల కోసమూ అన్ని శక్తులూ సంఘీభావంతో భుజం భుజం కలిపి కృషిచేయాలనేది సోవియట్ యూనియన్ విధానం.

కామ్రేడ్స్, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ ముసాయిదా కార్యక్రమం ఒక నిర్వివాదమైన సత్యాన్ని ప్రతిబింబిస్తుంది: మన తరంలో కమ్యూనిజం ఒక అతి బలోపేతమైన శక్తిగా తయారయిందనేదే అది. నేడు ప్రపంచంలోని 87 దేశాలలో కమ్యూనిస్టు పార్టీలు పనిచేస్తున్నాయి. వాటి సభ్యత్వం దాదాపు 4 కోట్లు. అసంఖ్యాకమైన ప్రజానీకం కమ్యూనిస్టు లను అనుసరిస్తున్నారు; వారి దృక్పథాలలోను, అభిప్రాయాలలోను పాలు

పంచుకొంటున్నారు; వారి విధానాలను ఆమోదిస్తున్నారు, బలపరుస్తున్నారు. సోషలిజం బలంగా వేళ్లు తన్ని నిలబడింది; నానాటికీ బలోపేతంగా అభివృద్ధి చెందుతున్నది. మానవ జాతిలో మూడోవంతుకు పైగా, వారి పతాకం క్రింద నూతన జీవితాన్ని నిర్మించుకొంటున్నారు. అనేక సోషలిస్టేతర రాజ్యాలలో కార్మిక వర్గం పెట్టుబడిదారీ విధానం యొక్క పునాదులను బలంగా దెబ్బతీస్తున్నది.

ప్రపంచ గమనమే ఒక విప్లవ యుగంలో పడింది. సోషలిస్టు విప్లవాలు, సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా జాతీయ విముక్తి విప్లవాలు, ప్రజాతంత్ర ప్రజాస్వామిక విప్లవాలు, విస్తృతమైన రైతు ఉద్యమాలు, ఫాసిస్టు, తదితర క్రూర నిరంకుశ పరిపాలనలను కూలద్రోయడానికై ప్రజా పోరాటాలు, జాతీయ ఎతపకు వ్యతిరేకంగా దేశవ్యాప్త ప్రజాస్వామిక ఉద్యమాలు—ఇవన్నీ పెట్టుబడిదారీ విధానాన్ని కూకటి వ్రేళ్ళతో సహా పెకలించివేసే లక్ష్యంతో ఏకైక, ప్రపంచ వ్యాప్త, విప్లవోద్యమంగా మిళిత మవుతున్నాయి.

ముసాయిదా కార్యక్రమంలో, శాంతియుత విప్లవం, శాంతియుతం కాని విప్లవం గూర్చి ప్రస్తావించబడింది. ఇతర విషయాలలో వలె యీ విషయంలో కూడా, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం 1957 ప్రకటనలోను, 1960 ప్రకటనలోనూ సమిష్టిగా రూపొందించిన సూత్రాలకు మన పార్టీ గట్టిగా కట్టుబడి ఉంటుంది.

ప్రస్తుత యుగంలో ప్రపంచ విప్లవోద్యమాభివృద్ధికి చాలా అనుకూలమైన అంతర్జాతీయ పరిస్థితులు ఏర్పడ్డాయి. సోషలిస్టు శక్తులు బలపడటం, సోషలిస్టు వ్యవస్థ యొక్క పలుకుబడి పెరగడమే యిందుకు ప్రధాన కారణం. సోషలిజం చూపెట్టిన ఆదర్శం ప్రజల హృదయాలలో బలమైన పలుకుబడి సంపాదిస్తున్నది; నూతన వ్యవస్థా స్థాపనకు వారిని బద్ధకంకణులుగా చేస్తున్నది. విప్లవం సాగిస్తున్న ప్రజలు ప్రపంచ అభివృద్ధి నిరోధక వర్గం ప్రతీఘాత విప్లవాన్ని ఎగుమతి చేయడానికి సలిపే ప్రయ

త్నాలను ఎదిరించి పోరాడటంలో సోషలిస్టు దేశాల తోడ్పాటు పొందగలరు. నూతన సమాజాన్ని నిర్మించుకోవడంలో వారికి సోషలిస్టు దేశాల నుండి అన్ని విధాల సహాయం లభించగలదు.

ప్రస్తుత యుగంలో, నూతన దేశాలు సోషలిజానికి పరివర్తన చెందడానికి బాహ్య పరిస్థితులు కూడా ఎక్కువ అనుకూలంగా తయారైనాయి. యీ పరిస్థితులలో పెట్టుబడిదారీ విధానం మొత్తంమీద బలహీనపడడం, దాని వైరుధ్యాలు తీవ్రతరమవడం, కార్మిక వర్గం యొక్క సంఘ్యాబలం, సంఘ బలం, ఐక్యతా బలం అధికమవడం, సమాజంపై దాని పలుకుబడి పెరుగడం; సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగాను, గుత్త పెట్టుబడుల ప్రాబల్యాన్ని రద్దుపరచడానికి జరిపే పోరాటంలో కార్మిక వర్గంతో కలిసివచ్చే మిత్రుల సంఖ్య నానాటికి అధికమవుతున్నది; ప్రపంచంలో దాదాపు అన్ని దేశాలలోను కమ్యూనిస్టు పార్టీలు అభివృద్ధిపొందుతున్నాయి, బలపడుతున్నాయి.

విప్లవ శక్తులకు ప్రతిబంధకాలు కల్పించిన విషయాన్ని చూడకుండా త్రోసిపుచ్చకూడదు. యుద్ధానంతరం, గుత్తపెట్టుబడిదారీ బూర్జువావర్గం ఒక నూతన అభివృద్ధి నిరోధక "పవిత్ర కూటమి"ని ఏర్పాటు చేసింది: సోషలిస్టు దేశాలకు వ్యతిరేకంగా మాత్రమే కాకుండా, విప్లవ కార్మిక వర్గానికి, జాతీయ విముక్తి ఉద్యమాలకు కూడ వ్యతిరేకంగా తయారైన సైనిక కూటములివి. గుత్తపెట్టుబడిదారీ బూర్జువా వర్గం హింస, పీడనా యంత్రాంగాన్ని అధికాధికం చేసింది. ఇదే సందర్భంలో, కార్మికవర్గంలో, చీలికలు కల్పించడానికి, ట్రేడ్ యూనియన్ ఉద్యమాన్ని కలుషితం చేయడానికి, ఆ దురుద్దేశాన్ని దృష్టిలో పెట్టుకొని అభివృద్ధి నిరోధకులైన సోషల్-డెమాక్రటిక్, ట్రేడ్‌యూనియన్‌ల నాయకులను విస్తృతంగా ఉపయోగించుకోవడానికి నూతన పద్ధతులు చేబట్టింది. వారు పచ్చి కమ్యూనిస్టు వ్యతిరేక ఉద్యమాన్ని ప్రారంభించారు; కార్మిక ప్రజానీకానికి శత్రువులైన వారినందరినీ యీ నల్లజెండాకింద సమీకరించారు.

గుత్త పెట్టుబడిదారీ బూర్జువావర్గం తన ప్రాబల్యాన్ని కాపాడుకోవ

నానికై ఎంత ఘాతుక కృత్యాలకైనా తలపడే అవకాశం లేకపోలేదు. ఈ పరిస్థితులలో లెనిన్ చెప్పిన మాటలకు నేడు విలువ పెరిగింది: కార్మిక వర్గం తప్పనిసరిగా "సామాజిక కృషికి చెందిన అన్ని పద్ధతులను, లేదా పక్షలను......, ఎలాంటి మినహాయింపు లేకుండా, తన అదుపులో పెట్టుకొని వుండాల"ని, "ఒక పద్ధతికి బదులు వేరొక పద్ధతిని చాలా శీఘ్రంగా, తలవని తలంపుగా ప్రవేశపెట్టడానికి" అది సిద్ధంగా వుండాలని లెనిన్ చెప్పారు.*

ప్రస్తుత యుగంలో నూతన ప్రజాస్వామిక, జాతీయ విముక్తి, సోషలిస్టు విప్లవ కర్తవ్యాలు ఒకదానికొకటి సన్నిహితమవుతున్నాయి; ఒక దానితో నొకటి ముడివడుతున్నాయి. సామాజిక పరిణామాన్నిబట్టి చూస్తే విప్లవాన్ని ముఖ్యంగా ఒక ప్రధాన శత్రువుకు, అంటే సామ్రాజ్యవాదానికి గుత్తపెట్టుబడిదారీ బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా ఉద్దేశింపబడినట్లు స్పష్టమవుతుంది.

ప్రపంచ విముక్తి ఉద్యమం ఏ విధంగా ముందుకు సాగుతుందని తరచు ప్రశ్నిస్తున్నారు.

బాగా అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో సోషలిజానికి పరివర్తన చెందడానికి పరిస్థితులు పూర్తిగా పరిపక్వమైనట్లు స్పష్టపడుతుంది. ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలో అట్టుడికినట్లు ఉడుకుతున్న వెనకబడిన దేశాలు జాతీయ విముక్తిని, సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవాన్ని సాధించిన తర్వాత సోషలిజానికి పరివర్తన చెందగలుగుతాయి. నేడు ఆచరణ రీత్యా ఏ దేశమైనా, తన అభివృద్ధి స్థాయితో నిమిత్తం లేకుండానే, సోషలిజానికి సాగిపోయే పంథాను చేబట్టగలదు.

ప్రపంచ విప్లవ క్రమం అన్ని ఖండాలకు ప్రాకి, మునుపటికంటె

---

* వి. ఐ. లెనిన్, రచనల సంకలనం, 4 వ రష్యన్ ముద్రణ, సంపుటి 31, పుట 76.

విశాలమవుతున్నది. ప్రపంచంలో మొట్టమొదటి సోషలిస్టు రాజ్యాన్ని మిలి-టరీ పద్ధతుల ద్వారా నాశనం చేయనెంచి విఫలమై, దానిని తక్కిన ప్రపం-చంనుండి వేరు చేయడానికై సామ్రాజ్యవాదులు ఒకప్పుడు దుర్భేద్యమయిన వలయం నిర్మింప యత్నించారు. అయితే యిప్పుడు యూరప్, ఆసియా ప్రజల విప్లవకృషి సోషలిజం యొక్క సరిహద్దులను ఎల్బానుండి దక్షిణ చైనా సముద్రాలవరకు విస్తరింప జేసింది. విప్లవ భావాలు ఈ సరిహద్దులకే పరిమితమై వుండేట్లు చేయాలని సామ్రాజ్యవాదులు తమకు వీలైనన్ని విధాల ప్రయత్నించారు. అయితే స్వాతంత్ర్య భావాలకు పర్వతాలు, సము-ద్రాలు ప్రతిబంధకాలు కాజాలవు. క్యూబా విప్లవ విజయం ఈ విషయాన్ని స్పష్టంగా రుజువు పరుస్తున్నది.

స్వాతంత్ర్య కాముకులైన క్యూబా ప్రజలు సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవ పతాకను చేబట్టి, విదేశీ దోపిడీదార్లను, వారి తాబేదార్లను తమ దేశం నుండి గెంటివేశారు. కార్మికులు, రైతులు, మేధావులు, పట్టణ జనాభాకు చెందిన మధ్య తరగతి ప్రజలు విప్లవ పతాక క్రింద సమీకృతులైనారు. క్యూబన్ విప్లవ బలానికి మూలకారణమయిన వాటిలో యిది ఒకటి. సామాజికాభ్యుదయపథంలో క్యూబా పయనించడానికి యిది ఒక హామీ. ఆకారంలో చిన్నదై, ఎక్కడో దూరంగా, సముద్ర పరివేష్టిత మయిన ఈ దీవి స్వాతంత్ర్య ధృవతారగా తయారైంది. లాటిన్ అమెరికా లోని ప్రజలందరి అభ్యుదయానికి మార్గదర్శి అవుతున్నది.

క్యూబా సోవియట్ యూనియన్‌కు చాలా దూరంలో వుంది. అయి-నప్పటికీ మన ఉభయ దేశాల ప్రజలూ ఒకరికొకరు చాలా సన్నిహితంగా ఉన్నారు. క్యూబా వీరులారా: మా హృదయాలు మీతో వున్నాయి. అమె-రికా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా నిలబడి, మీరు మీ స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకొంటున్నారు. మీరు మీ యుద్ధ పతాకలపై సోషలిస్టు ఆశయా-లను లిఖించుకొన్నారు. సోదర క్యూబన్ ప్రజలు తమ పవిత్ర ఆశయ సిద్ధికోసం జరిపే పోరాటంలో మన ప్రజలు చేయూత నిచ్చారు; ఇది

ముందు కూడ చేయూత నిస్తారు.

సోషలిస్టు వ్యవస్థ బలపడేకొద్దీ, పెట్టుబడిదారీ విధానంపై దానిదే పూర్తిగా పైచేయి అయి, ప్రపంచమంతటా సోషలిస్టు, ప్రజాస్వామిక శక్తులు పెరిగేకొద్దీ, వివిధ అభివృద్ధి స్థాయిలలో వున్న దేశాలు విప్లవ పంథాను చేబట్టి, సెలయేళ్ళ నీరు ఒక పెద్ద నదిలో కలిసినట్లు, సోషలిస్టు వ్యవస్థలో చేరగలవు

విప్లవ పోరాటంలో పాల్గొంటున్న కార్మికవర్గం భవిష్యత్తులో తన వర్గ శక్తుల ఐక్యతకు, తన లక్ష్యాల సాధనకు ఆటంకంగా వున్న వివిధ అవకాశవాద ధోరణులను ఎదిరిస్తుంది. పెట్టుబడిదారీ విధానం ఉన్నంత వరకు యీ ధోరణులు వివిధ రూపాలలో మళ్ళీ మళ్ళీ కనిపిస్తూ ఉంటాయి. అందుచేత సోషల్ డెమాక్రసీ, రివిజనిజం యొక్క సిద్ధాంతానికి, అలాగే పిడివాదానికి, సంకుచిత ధోరణికి వ్యతిరేకంగా పోరాడవలసిన అవసరం ఉందని ముసాయిదా కార్యక్రమం నొక్కి చెబుతున్నది.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ కార్మికవర్గం పట్ల, యావత్ప్రపంచ కార్మిక ప్రజానీకం పట్ల తన అంతర్జాతీయతా విధిని ఇక ముందు కూడ నెరవేర్చుతుంది; అన్ని దేశాలలోను గల కమ్యూనిస్టు మహావాహిని యొక్క ఐక్యతను, సంఘీభావాన్ని ఇకముందు కూడ పటిష్ఠం చేస్తుంది.

కామ్రేడ్స్, కమ్యూనిస్టు నిర్మాణంలో మన విజయాలు ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా ప్రజల భావిభాగ్యోదయానికి ప్రత్యేక ప్రాముఖ్యత కలిగి ఉంటాయి. సువిశాలమయిన, దీర్ఘకాలంగా బాధలు పడుతున్న ఖండాలు యివి. తమ చరిత్రను స్వహస్తాలతో లిఖించుకోవడానికి యివి పూర్తిగా ఉపక్రమించాయి. తమ ఆర్థిక వ్యవస్థను, సంస్కృతిని త్వరగా అభివృద్ధి చేసుకొనే మార్గాలను అన్వేషిస్తున్నాయి.

జాతీయ విముక్తి ఉద్యమం వలస పరిపాలనను రద్దుపరచే తుది

ఘట్టంలో ప్రవేశించింది. నూతనంగా విముక్తి పొందిన జాతులు తమ రాజకీయ స్వాతంత్ర్యాన్ని పటిష్టం చేసుకొంటున్నాయి; ఆర్థికంగా వెనుకదాటుతనాన్ని రూపుమాపడానికై గట్టి కృషి సలుపుతున్నాయి; సామ్రాజ్యవాదంపై ఆధారపడవలసిన వివిధ హంశాల నన్నిటినీ తుదముట్టిస్తున్నాయి.

ఇది తేలికైన మార్గం కాదు. సామ్రాజ్యవాదం, జాతీయ విముక్తి ఉద్యమంతో జరిపే ప్రత్యక్ష పోరాటంలో ఓడిపోతున్నప్పటికీ, తన ఆయుధాలను క్రింద పెట్టడం లేదు. అది కొత్త పద్ధతులను అనుసరిస్తున్నది. గుత్త పెట్టుబడిదార్లు వెనకబడిన దేశాలలో తమ స్థానాలను కాపాడుకోవడానికి, పటిష్ఠం చేసుకోవడానికి ఒక విస్తృత పథకం అమలుపరచ దలచారు; ఆర్థిక సహాయం గూర్చి పవిత్రమైన సంభాషణ అనే ముసుగుతో, యీ పథకం యొక్క అసలు ఉద్దేశ్యాన్ని మరుగు పరుస్తున్నారు. ఈ విషయంలో ముందు అమెరికా సామ్రాజ్యవాదులను చెప్పి, తర్వాత మరెవ్వరి నానై చెప్పాలి.

సామ్రాజ్యవాద రాజ్యాలు వెనకబడిన దేశాలకు నిస్వార్థ బుద్ధితో సహాయం అందించే సమస్యే లేదు. గుత్త పెట్టుబడిదార్లు తమ అధిక లాభాలను వదలుకోరు. వారి లక్ష్యాలు ఎప్పటివలెనే వున్నాయి: వెనకబడిన దేశాలు వ్యవసాయ రీత్యా తమకు అనుబంధంగా వుంటూ ముడి పదార్థాలు సరఫరా చేసే స్థితిలో ఉంచుతారు; ఆ దేశాల ప్రజలను ఎప్పటివలె దోచుకొంటారు. అయినప్పటికీ సామ్రాజ్యవాదులు తమ "సహాయ" విధానాన్ని గూర్చి విస్తారంగా ప్రచారం చేసుకొంటూనే వున్నారు. అయితే ఆ "సహాయం" చిత్తశుద్ధితో కూడినది కాదు. దానిని ప్రజలపై బలవంతంగా రుద్దుతున్నారు. సామ్రాజ్యవాదం యావత్ప్రపంచాన్ని తన అదుపులో ఉంచుకొన్న కాలంలో, వెనకబడిన దేశాలకు ఏ విధమైన సహాయం అయినా సరే అందజేయాలనే ఆలోచన ఆర్థిక ప్రభువులకు ఎప్పుడూ తట్టలేదు.

సోవియట్ యూనియనూ, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థా యంత్రాలను

సరఫరా చేయడంలో నేమి, రుణాలు మంజూరు చేయడంలో నేమి, సాంకే తిక సహాయం అందజేయడంలో నేమి సామ్రాజ్యవాద శక్తుల గుత్తాధి పత్యాన్ని దెబ్బకొట్టినప్పుడే పరిస్థితి మారింది. సామ్రాజ్యవాదులు తమ ఎత్తు గడలను విధిగా మార్చుకోవలసి వచ్చింది. వెనకబడిన దేశాలకు ఆర్థిక "సహాయం" అందజేయడం గూర్చి సంభాషణలు జరపవలసి వచ్చింది ఈ దేశాలవారు తమ విన్నపాలను పైకి పంపుకొంటారని, గుప్పెడు డాలర్లు తీసి పడవేసినవారికి కృతజ్ఞత వెల్లడిస్తారని వీరు భావించారు.

అయితే అమెరికా సామ్రాజ్యవాదులు తిట్లకే నోచుకొన్నారు. ఎందు చేత? ఎందుచేతనంటే, వెనకబడిన దేశాల నుండి తాను గుంజుతున్న పెద్ద మొత్తాలతో అమెరికా అతి స్వల్పభాగం మాత్రమే మంజూరు చేస్తు న్నది.

అవును. 1946-1959 సంవత్సరాల మధ్య వెనుకబడిన దేశాలన్ని టిలో అమెరికా పెట్టిన పెట్టుబడి క్రింద ప్రతి డాలరుకు 2¼ డాలర్ల చొప్పున లాభం వచ్చింది. అమెరికా, తదితర పాశ్చాత్య దేశాల గుత్త పెట్టుబడి దార్లు సాలీనా వెనకబడిన దేశాలనుండి 2,000 కోట్ల డాలర్లు గుంజుతున్నా రని సోవియట్ అర్థిక శాస్త్రవేత్తల అంచనా. ఇది సహాయం అయితే, దోపిడీ ఏది? దోపిడీగాండ్రు కృతజ్ఞతకు ఎప్పటికీ నోచుకో లేదు; వారు తిట్లకే నోచుకొన్నారు.

గుత్త పెట్టుబడిదార్లు వెనకబడిన దేశాలను సామ్రాజ్యవాదం యొక్క రనుసన్నలలో అట్టిపెట్ట జూస్తున్నారు. ప్రపంచ పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవ స్థలో వాటిని క్రింది స్థానంలో పెట్టి వుంచాలని వారి ఉద్దేశం. ఇది వ్యర్థ ప్రయత్నం. వెనకబడిన దేశాల ప్రజలు సామ్రాజ్యవాదానికి బంధింపబడి వుండదలచుకోవడం లేదు. సోషలిజం చూపెట్టిన ఆదర్శాన్ని వారు చూడ గలరు. ప్రజలు యిప్పుడు సోషలిజాన్ని గూర్చి పుస్తకాల ద్వారా మాత్రమే కాకుండా, అన్నిటికంటె ముఖ్యంగా అది సాధించిన విజయాల ద్వారా పరి శీలిస్తున్నారు. సోవియట్ ప్రభుత్వం శతాబ్దాలలో కాదు ఒక తరం జీవిత

కాలంలోనే, తరతరాలుగా పేరుకొన్న వెనకబడిన తనాన్ని పోగొట్టి, సోవియట్ యూనియన్‌ను ప్రపంచంలో ఒక బలోపేతమైన శక్తిగా తయారు చేయగలిగిందని ప్రజలు గమనిస్తున్నారు.

లోగడ వలస దేశాలుగా ఉన్నవి రాజకీయ స్వాతంత్ర్యం సాధించడంతో వాటి ఆర్థికాభివృద్ధికి అనుకూలమైన పరిస్థితులు ఏర్పడ్డాయి. ఉత్పత్తి అభివృద్ధి గతి పెరిగింది. ద్వితీయ ప్రపంచ యుద్ధానికి పూర్వం ఈ దేశాల సాలు సగటు అభివృద్ధి గతి ఒక శాతం మాత్రమే. అయితే ఆ తర్వాత కాలంలో ఇది నాలుగు శాతానికి పెరిగింది. వీటిలో అనేక దేశాలలో ప్రభుత్వ రంగం ఏర్పాటు చేయబడింది. జాతీయ పరిశ్రమలు అభివృద్ధి చెంద సాగాయి.

అయితే యివి ప్రథమ చర్యలు మాత్రమే. వలస పరిపాలన వల్ల సంక్రమించిన దుష్ఫలితాలు యింకా పీడిస్తున్నాయి. ప్రధానమైన ఆర్థిక సమస్యలు యిప్పటికీ పరిష్కారం కాలేదు. విదేశ పెట్టుబడులతో పెనవేసుకున్న పెద్ద బూర్జువా వర్గమూ, ఫ్యూడల్ భూస్వాములూ వెనకబడిన దేశాలను ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థలో అట్టిపెట్టడానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు. సామ్రాజ్యవాదులూ, వారి తాబేదార్లూ యీ దేశాలను నడిపించదలచుకొన్న మార్గం, వలస ప్రభువులకు వ్యతిరేకంగా ప్రజలు ఏ ఆశయాల కోసమైతే పోరాడారో ఆ ఆశయాలను లభింపజేస్తుందన్న నమ్మకం లేదు.

ఇక పరిష్కార మార్గమేమిటి? చరిత్ర ఈ సమస్యకు స్పష్టమైన సమాధానం ఇస్తుంది: పెట్టుబడిదారీ అభివృద్ధికి భిన్నమైన మార్గంలోనే దీనికి పరిష్కారం వెదకవలసి ఉంది. ఈ మార్గంలో పొందగల ఫలితాలు ఏమిటో తెలుసుకోదలచిన వారు పూలు పువ్వులు ఆపు కాయలు కాస్తున్న సోవియట్ మధ్య ఆసియా రిపబ్లిక్కులను, మన దేశంలోని తదితర భాగాలను ఒకసారి తిలకించవలసి ఉంటుంది. ఇవి అక్టోబరు విప్లవానంతరం పెట్టుబడిదారీ అభివృద్ధి అనే కంటకావృత మార్గాన్ని వదలిపెట్టాయి.

ఏ దేశమైనా దానంతట అదే పెట్టుబడిదారీ అభివృద్ధికి భిన్నమైన

మార్గంవైపు కొట్టుకొనిపోదు. కార్మిక వర్గంయొక్క, కష్టజీవు లందరి యొక్క గట్టి పోరాటం మాత్రమే, విస్తృత జాతీయ సంఘటనగా రూపొం దిన ప్రజాస్వామిక, దేశ భక్తియుత శక్తులన్నిటి ఐక్యతమాత్రమే ప్రజలను ఆ మార్గం పట్టించ గలదు.

భౌతిక పరిణామదశను కూలంకషంగా పరిశీలన చేసిన తర్వాత మార్క్సిస్టు సిద్ధాంతం ఒక పద్ధతిని కనిపెట్టింది. తద్వారా ఒక దేశంలో నిజాయితీగల శక్తులన్నింటిని ఐక్యపరచడం సుసాధ్యమే. అది జాతీయ ప్రజాస్వామిక పద్ధతి. అది ఏ ఒక వర్గంయొక్క ప్రయోజనాలనూ కాకుండా, ప్రజలలో అత్యధిక సంఖ్యాకుల ప్రయోజనాలను ప్రతిబింబిస్తుంది. ఈ రక మైన ప్రభుత్వం జాతీయ విముక్తికోసం సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవాన్ని పూర్తి చేయవలసి ఉంటుంది.

జాతీయ స్వాతంత్ర్యం సాధించుకొన్న ప్రజలు మంచి అదృష్ట వంతులు. ఎందుకంటే, ఒకవైపున సామ్రాజ్య వాదంయొక్క శక్తులూ, పరిణామక్రమాన్ని మార్పు చేయడంలో దానికిగల సామర్థ్యమూ నానాటికి క్షీణిస్తూ, మరొకవైపున సోషలిజంయొక్క శక్తులూ, దాని పలుకుబడీ నానాటికి పెరుగుతున్న కాలంలో, వీరు స్వతంత్ర అభివృద్ధి మార్గాన్ని చేబట్టారు. ఇలాంటి పరిస్థితులలో వీరు తమ ఆర్థిక, సామాజికాభివృద్ధికి చెందిన సమస్యలను పరిష్కరించుకోవడం ఎంతో తేలిక.

సోవియట్ యూనియన్‌కు, అలాగే ఇతర సోషలిస్టు దేశాలకు, కొత్తగా విముక్తి పొందిన దేశాల ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం కలిగించుకొనే ఉద్దేశంగాని, వాటిలో దేనిపైనా సోషలిజాన్ని బలవంతంగా రుద్దే ఉద్దేశంగాని లేదు. సోషలిజాన్ని ఇదివరలో ఎగుమతి చేయలేదు, చేస్తూ ఉండటంలేదు, చేయబోవడం లేదు. అలాంటప్పుడు వలస పరిపాల నను బలవంతంగా రుద్దటం గాని, ప్రతీఘాత విప్లవాన్ని ఎగుమతి చేయడం గాని తగదు.

వలస పరిపాలనను కూలద్రోసిన ప్రజలతో సఖ్యత నెరపడం సోవి

యట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ తన అంతర్జాతీయ విధానానికి పునాది రాయిగా పరిగణిస్తుంది. జాతీయ స్వాతంత్ర్యాన్ని సాధించి దానిని బల పరచుకోవడానికి ఉద్యమించిన ప్రజలకు తోడ్పడటం, వలస వ్యవస్థను రద్దు పరచడంకోసం పోరాడుతున్న ప్రజలందరికీ సహాయం అందజేయడం మన పార్టీ తన అంతర్జాతీయతా కర్తవ్యంగా లెక్కిస్తుంది.

కామ్రేడ్స్, యుద్ధమనేది లేకుండా చేయడం, ప్రపంచంలో సుస్థిర శాంతిని స్థాపించడం అనే కమ్యూనిస్టు చరిత్రాత్మక లక్ష్యాన్ని సాధించ డంలో, మన విస్తృత పథకాలు నిశ్చయాత్మకమైన సహాయ కారులుగా ఉంటాయి.

సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటమూ, శాంతి స్థాపనా విధానమూ సోషలిజానికి సహజమైనట్లే, యుద్ధానికీ సామ్రాజ్యవాదానికీ విడదీయరాని సంబంధం కలదని చరిత్ర అనుభవం రుజువు చేసింది. చరిత్ర పుటలలో సిరాతో కాకుండా లక్షలాది ప్రజల రక్తంతో లిఖించిన ఘటనలను మానవ మేధస్సు మరచి పోజాలదు. 1898లో అమెరికా సామ్రాజ్యవాద యుగపు మొదటి యుద్ధాన్ని ప్రారంభించింది. అప్పటినుండి సామ్రాజ్యవాదం వివిధ జాతులపై "స్థానిక యుద్ధాలను" ఎడతెరపిలేకుండా జరిపింది; రెండుసార్లు కని విని ఎరుగని ఆవేశంతో ప్రపంచ మానవజాతిపై విరుచుకు పడింది. పైపెచ్చు, ద్వితీయ ప్రపంచ యుద్ధంలో నాశనమైపోయిన పట్టణాలు, నగరా లలో అగ్నిజ్వాలలు ఇంకా చల్లారకముందే, బంధువులను కోల్పోయిన లక్షలాది ప్రజా హృదయాల గాయాలు ఇంకా మానకముందే, అమెరికా సామ్రాజ్యవాదులు తృతీయ ప్రపంచ యుద్ధానికి కాలు దువ్వుతున్నారు.

సామ్రాజ్యవాద శిబిరంలో, అన్నిటికంటె ముఖ్యంగా అమెరికా శిబి రంలో, జూదగాళ్ళవలె ప్రవర్తించే బృందాలు పని చేస్తున్నాయి. తాము తెచ్చి పెట్టదలచుకొన్న నూతన యుద్ధం మానవజాతికి ఎంత హాని కలిగి స్తుందో వారు బొత్తిగా ఆలోచించడం లేదు. అణ్వాయుధాలూ, రాకెట్లూ అన్ని ఖండాలను ప్రజల మూక ఉమ్మడి మారణహోమ మండలాలుగా

మార్చి వేయగలవు, భౌతిక సంపద యావత్తూ నాశనమైపోతుంది. అణ్వా యుధ ప్రపంచ యుద్ధంలో, విస్తీర్ణానికి లోగడ ఉన్న ప్రాముఖ్యత పోతుంది: పశ్చిమార్ధ గోళం బూడిద కుప్పలుగా తయారవుతుంది. మన కాలంలో యుద్ధం, అంతర్జాతీయ సమస్యల పరిష్కారానికి సాధనం కాజాలదు. కాకూడదు.

యుద్ధ ప్రమాదం ఉందని గుర్తించడం, సమాజ జీవితంలో యుద్ధానికి తావులేకుండా చేసే నిమిత్తం మనం కృషి సలపడం—ఈ రెంటి మధ్య వైరుధ్యం ఉందా అని అడుగవచ్చు. కామ్రేడ్స్, ఇందులో వైరుధ్యం ఏమీ లేదు.

నేటి తరంలో ప్రపంచ యుద్ధాన్ని నివారించడానికి అన్నివిధాల అవ కాశం ఉందని పార్టీ విశ్వాసం. అంతర్జాతీయ రంగంలో పని చేస్తున్న శక్తులను కూలంకషంగా, సమగ్రంగా పరిశీలించిన మీదట ఈ విషయం ధృవపడింది. ఈ పర్యాలోచన ఒక నిర్వివాదమైన నిర్ణయానికి దారి తీస్తుంది: ప్రపంచ రాజకీయ, ఆర్థిక, సైనిక శక్తుల బలాలయొక్క తుల నాత్మక పరిశీలననుబట్టి శాంతి కాముక శిబిరంపై పే మొగ్గు ఉంది.

ఈ ఆధిక్యత ఎలా వచ్చింది? ఇందుకు ప్రధానమైన కారణాలు ఇవి:

ఒకటి: సోవియట్ యూనియన్ నేడు అత్యధిక బలిష్ఠమైన దేశం. ప్రపంచ శాంతిని కాపాడటానికి, పటిష్ఠం చేయడానికి అది సర్వవిధాల కృషి సలుపుతున్నది. ఏ పెద్ద సామ్రాజ్యవాద దేశమైనా తన బలాన్ని, అందుకు తగ్గట్టు తన దురాక్రమణ వాంఛలను పెంచుకొంటూ, యుద్ధ ప్రమా దాన్ని మరింత విషమింప జేసింది; ప్రపంచంలో మొట్టమొదటి సోషలిస్టు దేశం శక్తి పెరుగుగల యుద్ధ ప్రమాదాన్ని నివారించడానికి గట్టి పరిస్థితు లను కల్పించింది; కల్పిస్తున్నది; నివారించడానికి గల అవకాశాలను అధికం చేస్తున్నది. విజ్ఞానశాస్త్రం, సాంకేతిక విజ్ఞాన శాస్త్రం అనే నిశ్చ యాత్మక రంగాలలో సోవియట్ యూనియన్ ప్రపంచంలో అగ్రస్థానం పొంది, శాంతికోసం జరిపే పోరాటంలో ఈ ఆధిక్యతను ఉపయోగిస్తున్న

ప్పటినుండి, ప్రపంచ భద్రతను కాపాడుకోవడానికి గల అవకాశం ఎన్నో రెట్లు పెరిగింది.

రెండు: సోవియట్ యూనియన్‌తోబాటు ఇప్పుడు సామ్రాజ్యవాద దురాక్రమణ దారులకు మారొడ్డి నిలిచే మరొక శక్తి—అంటే ప్రపంచ సోషలిస్టు శిబిరంలోని అన్ని దేశాలు—ఉంది. సామ్రాజ్యవాదం కల్పించిన పరిస్థితుల్లో దేశాలు నిర్మించుకొనే ఏ కూటమి అయినా కొత్త యుద్ధాలకు సన్నాహపడటం తన లక్ష్యంగా పెట్టుకొంటుంది; అయితే సోషలిస్టు కుటుం. బానికి చెందిన దేశాలు శాంతి, సామాజిక అభ్యుదయ సాధనకోసమే తమ శక్తులను కూడదీసుకొంటున్నాయి.

మూడు: ప్రపంచరంగంలో మరొక నూతన శక్తి—అంటే ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలో కొత్తగా స్వాతంత్ర్యం పొందిన అనేక దేశాలు—అవతరించింది. జాతీయ పునర్నిర్మాణ కర్తవ్యాలను నెరవేర్చడం కోసం శాంతి రక్షణ అవసరమని ఈ దేశాలు భావిస్తున్నాయి. ఈ దేశాలలో అధిక భాగం శాంతియుత విధానాన్ని అనుసరిస్తున్నాయి. ఈ దేశాల ప్రజల ప్రధాన ప్రయోజనాలూ, సోషలిస్టు దేశాల ప్రజల ప్రయోజనాలూ ఒకే విధంగా వుండడంవల్ల, శాంతి పరిరక్షణలో తమ కృషిని సమీకరించడానికి భౌతిక ప్రాతిపదికగా యిది ఉంటుంది. మానవ జాతిలో మూడింట రెండు వంతుల మనోభీష్టాన్ని, శక్తిని చాటిచెప్పే ఈ మహాసంఘటన సామ్రాజ్యవాద దురాక్రమణదారులను వెనక్కి తిప్పి కొట్టగలదు.

నాలుగు: ప్రపంచ రాజకీయాలలో యిప్పుడు పెట్టుబడిదారీ దేశాల ప్రజలు నిర్వహించే పాత్ర కూడా ఎంతో పెరిగింది. అణ్వాయుధ యుద్ధ ప్రమాదం వున్నందువల్ల, చరిత్రలో అపూర్వమైన, ఒక విధమైన ఐక్యత రూపు దిద్దుకొంటున్నది. వేర్వేరు ప్రయోజనాలు గల అనేక ప్రజా ఉద్యమాల ఐక్యత అది; యుద్ధ ప్రమాదం నుండి మానవ జాతిని శాశ్వతంగా విముక్తి నొందించడం దాని ఐక్య వాంఛ. మానవజాతి భవిష్యత్తు పట్ల తన చారిత్రక బాధ్యతను నానాటికి బాగా గుర్తిస్తున్న అంతర్జాతీయ కార్మిక

పర్గం, ఈ ఐక్యతను సంఘటిత పరచే ఒక మహాశక్తిగా తయారైంది. శాంతి పతాకం అన్ని దేశాలలోను అనేకకోట్ల సంఖ్యలలో గల బలోపేత మైన కమ్యూనిస్టు సేనావాహిని యొక్క దృఢహస్తాలలో వుంది.

ఇలాంటి ప్రధాన శక్తులు, మన తరంలో యుద్ధ మార్గాన్ని నిరోధి స్తున్నాయి. వీటిసంఖ్య నేడు అసంఖ్యాకం. రేపు ఇవి మరింత శక్తి వంతంగా తయారు కాగలవు. సోషలిస్టు దేశాలు తమ ఆర్థిక పథకాలను పూర్తిచేసుకొంటే, వాటి పటిష్టతకు నిశ్చయాత్మక ప్రాధాన్యత ఏర్పడు తుంది. మన కార్యక్రమంలో నిర్దేశించిన పథకాలను పూర్తి చేస్తే, శాంతి పరిరక్షకులకు భౌతిక రీత్యా మరింత గట్టి వత్తాసు లభించగలదు.

మానవజాతి యుద్ధాన్ని నివారించగలదు, నివారించి తీరాలి. అయి నప్పటికీ, శాంతికాముక శక్తులన్నీ చాలా క్రియాశీలమైన, పట్టు విడుపులు లేని పోరాటం జరిపినప్పుడు మాత్రమే యీ కర్తవ్యం నెరవేరగలదు. సామ్రాజ్యవాదులను సకాలంలో అణచివేయడం, మారణాయుధా లను ప్రయోగించె అవకాశం వాటికి ఏ మాత్రమూ లేకుండా చెయు డం, యుద్ధాన్ని నిరోధించడం, దానిని రెచ్చగొట్టకుండా చేయడం— ఇదీ కీలక సమస్య.

రెండు సామాజిక వ్యవస్థలు ఉన్న కాలానికి అనుగుణమైన విదే శాంగ నీతి సూత్రాన్ని, విభిన్న సామాజిక పద్ధతులను అనుసరిస్తున్న రాజ్యాల మధ్య శాంతియుత సహజీవన సూత్రాన్ని లెనిన్, మన పార్టీ రూపొందించి, అమలుజరిపి, మహోపకారం చేశారు. ఈ సూత్రాన్ని మన పార్టీ ఇకముందు కూడ అమలు జరుపుతుంది. శాంతియుత సహజీవన సూత్రం కోట్లాది ప్రజల హృదయాలను చూరగొంటున్నది. సహృదయ తతో ఆలోచించే బూర్జువావర్గ ప్రతినిధులు కూడ ఈ సూత్రం యొక్క శక్తినీ, పాత్రనూ గుర్తిస్తున్నారు.

ఆయుధాల పోటీ ప్రజల పాలిటి గండరిత్తెరగా పరిణమించకుండా ఉన్నప్పుడు మాత్రమే, అంటే సమగ్ర, సంపూర్ణ నిరాయుధీకరణ పరిస్థి

తులు ఏర్పడినప్పుడు మాత్రమే. వేర్వేరు సామాజిక వ్యవస్థలు గల దేశాల మధ్య సంబంధాలలో నిజమైన సుస్థిరత్వం సాధింపబడగలదు. అంటే సార్వత్రిక సంపూర్ణ నిరాయుధీకరణ పరిస్థితులలో అన్నమాట. సైనిక శక్తి యొక్క పునాదిపై కాకుండా, సమగ్ర నిరాయుధీకరణ యొక్క పునాదిపై మాత్రమే అంతర్జాతీయ భద్రతకు మిక్కిలి విశ్వసనీయమయిన పరిస్థితి ఏర్పడగలదు. అందుచేత మన పార్టీ, సోవియట్ ప్రభుత్వమూ, మన ప్రజలందరూ నిరాయుధీకరణ కోసం పోరాడటానికి, ఈ లక్ష్య సాధనకు అనుగుణమైన మార్గాలను అన్వేషించడానికి, ఎలాగైనాసరే ఈ చారిత్రక కర్తవ్యం నెరవేరేట్లు చేయడానికి కృతనిశ్చయులై వున్నారు.

అంతర్జాతీయ సంబంధాలలో "యుద్ధ సమీప విధానం" ఎడతెగకుండా అసలు జరిగేట్లు చూడాలని సామ్రాజ్యవాదుల ఉద్దేశం. సుస్థిర శాంతి, ప్రజల సంపూర్ణ భద్రత నిరంతరం అంతర్జాతీయ సంబంధాలలో అసలు జరిచేట్లు చూడాలని మన ఉద్దేశం. సామ్రాజ్యవాద రాజకీయాలు, కొద్దిమంది గుత్త పెట్టుబడిదార్ల స్వార్థ ప్రయోజనాలను వెల్లడిస్తాయి. సోషలిజం రాజకీయాలు, యావత్తు మానవ జాతి ప్రయోజనాలను ప్రతిబింబిస్తాయి. అందుచేత సోషలిస్టు విదేశాంగ నీతి యొక్క ప్రధాన సూత్రం —శాంతియుత సహజీవన సూత్రం—అన్ని జాతులను, మానవ జాతికి సుస్థిరమైన శాంతి, సౌభాగ్యం కోరే ప్రజలందరిని ఆకర్షించే పతాకంగా ఉండగలదని మన విశ్వాసం.

మన నూతన కార్యక్రమాన్ని ఆమోదించడంలో, మన మహత్తర పార్టీ యుద్ధాన్ని నిరోధించడం మాత్రమే కాకుండా, సమాజ జీవితం నుండి దానిని శాశ్వతంగా తొలగించడం, మనతరం యొక్క జీవిత కాలం లోపలే యీ ఆశయాన్ని సాధించడం తన విదేశాంగ విధానం యొక్క ప్రధాన ఉద్దేశంగా ఉండేట్లు చేస్తుందని యావత్తు మానవ జాతికీ చాటి చెప్పింది.

మన శాంతి విధానం నియమబద్ధమైన, నిర్మొగమాటమైన, సోష

లిస్టు విధానం. మనము శాంతిని కోరుతున్నామంటే బలహీనంగా ఉంటి కాదు. చిరుత ప్రాయంలో ఉన్న మన సోషలిస్టు రిపబ్లిక్కును సామ్రాజ్యవాద తోడేళ్ళు అన్ని వైపులనుండి చుట్టుముట్టినప్పుడు కూడా మనము మన శత్రువులను పారద్రోలి, శాంతియుత పరిస్థితులను కల్పించుకోగలిగాం. అప్పట్లో మన రిపబ్లిక్కు సైనిక రీత్యా, ఆర్థిక రీత్యా సామ్రాజ్య వాదులతో పోల్చి చూస్తే చాలా బలహీనంగా ఉండేది.

ద్వితీయ ప్రపంచ యుద్ధ సమయంలో హిట్లరు యుద్ధ తంత్రానికి పరాజయం కలిగించడంలో సోవియట్ యూనియన్ నిశ్చయాత్మక పాత్ర వహించింది; ఫాసిస్టు బానిసత్వం నుండి మానవజాతిని కాపాడింది. నూతన పరిస్థితిలో, ప్రజలు సాధించిన సోషలిస్టు విజయాలను ఎదిరించడానికి సామ్రాజ్యవాద ఉన్మాదులు సాహసిస్తే, వారికి ఏమి గతి పట్టనున్నదో సందేహించ నక్కరలేదు. ఇప్పుడు సోవియట్ యూనియన్ బ్రహ్మాండమైన శక్తి కలిగి ఉంది; బలోపేతమైన సోషలిస్టు కుటుంబం దాని సరసన నడుస్తూ వుంది; ప్రపంచ మంతటా గల కోట్లాది ప్రజానీకం మనల్ని బలపరుస్తారు. ఈ పరిస్థితులలో యుద్ధం తీసుకురావడమంటే, ప్రజా వ్యతిరేకి సామ్రాజ్యవాద వ్యవస్థ అంతమైందని అర్థం.

ఈ విషయంలో మనకు దృఢవిశ్వాసం ఉందంటే సామ్రాజ్యవాద శక్తులను తక్కువ అంచనా వేస్తున్నామనే అర్థం కానేకాదు. సామ్రాజ్యవాదం యింకా బలంగా వుందని మనకు తెలుసు. సామ్రాజ్య వాదులు కొత్తగా యుద్ధం తీసుకువచ్చే అవకాశం లేదని కొట్టి పారవేయకూడదు. సామ్రాజ్యవాద ఉన్మాదులు చరిత్ర గమనాన్ని స్తంభింప జేయాలనే ఉద్దేశంతో, ఎలాంటి సాహస కృత్యాలకైనా ఒడిగట్టవచ్చు. అలాంటి పరిస్థితిలో మనకు ఒకే ఒక మార్గం ఉంది: మనం మన శక్తిని పెంచుకోవాలి. అతి శక్తివంతమైన ఆయుధాలను తయారు చేసుకోవాలి. దురాక్రమణదార్లు ఏ విధమైన దాడులు జరిపినా త్రిప్పి కొట్టడానికి ఏ క్షణంలోనైనా సిద్ధంగా ఉండాలి. మన సైన్యాన్ని రద్దు చేయడానికి, మన అణు బాంబులను, మన రాకెట్లను సముద్రంలో పారవేయడానికి సిద్ధంగా ఉన్నామని.

అయితే ఖచ్చితమైన అంతర్జాతీయ పర్యవేక్షణ క్రింద సమగ్ర, సంపూర్ణ నిరాయుధీకరణ జరిగినప్పుడే యిది సాధ్యమవుతుందని మనము అనేకసార్లు ప్రకటించాం, మళ్ళీ ప్రకటిస్తున్నాం. ఇందుకు సామ్రాజ్యవాద శక్తులు అంగీకరించేదాకా, మన మాతృదేశ రక్షణ కోసం అత్యాధునిక సాధనాలు— అణ్వాయుధాలు, థెర్మో న్యూక్లియర్ ఆయుధాలు, ఎంత దూరమైనా వెళ్ళ గల రాకెట్లు మన సాయుధ సైన్యాలకు ఉండేట్లు, అన్నిరకాల యుద్ధ పరికరాలు తగిన స్థాయిలో ఉంచేట్లు మనము చూస్తాం. సోవియట్ యూని యన్ రక్షణ బలాలను, సాయుధ బలాల శక్తినీ పటిష్టం చేసుకోవడం సోవియట్ ప్రజల ప్రధాన కర్తవ్యం.

చరిత్రను యథార్థస్థితిలో చూడటం కమ్యూనిస్టులు తమ విధ్యుక్త ధర్మంగా భావిస్తారు. యుద్ధ ప్రమాదం ఉన్నంతకాలం, క్రూర వ్యాఘ్రా లతో కూడుకొన్న సామ్రాజ్యవాద అరణ్యాలు ఈ ప్రపంచంలో ఉన్నంత కాలం, మన ప్రజలకు, మన యువతీయువకులందరికి మాతృదేశ ప్రేమను గూర్చి, యావచ్ఛక్తినీ, చివరికి ప్రాణాన్ని సైతం ఒడ్డి దానిని కాపాడు కోవడానికి సిద్ధంగా వుండటం గూర్చి బోధించవలసి ఉంటుంది. మనది ఉన్నతమైన లక్ష్యం. దానిని కాపాడుకోవడానికి సోవియట్ ప్రజలు తమ సర్వస్వాన్నీ అర్పించగలరు. సామ్రాజ్యవాదులు మనలను యుద్ధానికి పురి కొల్పితే, తడవుకోకుండానే దానిని అందుకొంటాం. అంతేకాదు. కమ్యూ నిస్టులలో జీర్ణించిన ధైర్య సాహసాలన్నీ ఉపయోగించి, శత్రువును హత మార్చుతాం.

కామ్రేడ్స్, కమ్యూనిజం శాంతికి, సామాజిక జీవితం నుండి యుద్ధాన్ని తొలగించే నిమిత్తం తగు పరిస్థితులను సృష్టించడానికి తోడ్పడు తుందనే వాస్తవాన్ని మన నూతన కార్యక్రమం యొక్క సారాంశం ధృవ పరుస్తుంది. ఆర్థిక, సాంస్కృతిక రంగాలలోను, ప్రజల జీవన ప్రమాణా లను అభివృద్ధి పరచడంలోను యింత అపూర్వమైన కర్తవ్యాలు సాధించ దలచిన వారెవ్వరూ యుద్ధం కోరజాలరని ప్రతి ఒక్కరికీ స్పష్టమవుతుంది. ఇదే సమయంలో కమ్యూనిజం నిర్మాణ కార్యక్రమం శాంతి, అంతర్జాతీయ భద్రతలను పటిష్టం చేసే చరిత్రాత్మక కార్యక్రమం కూడా అవుతుంది.

# VI

# ముసాయిదా కార్యక్రమం చర్చా ఫలితాలు

కాంగ్రెస్, ముసాయిదా కార్యక్రమం ప్రకటించినప్పటినుండి సోవియట్ యూనియన్‌లో, రాజకీయ జీవితం దానిపై కేంద్రీకరింపబడింది. పైపెచ్చు యీ కార్యక్రమంలో పొందుపరచిన విషయాలు మన దేశ సరిహద్దులను దాటి చాలా దూరంగా వ్యాపించాయి; అన్ని దేశాలు, అన్ని ఖండాలలో నివసిస్తున్న కోట్లాది ప్రజా హృదయాలలో వీటికి అపారమైన ఆదరణ లభించింది.

ముసాయిదా కార్యక్రమంపై చర్చ పార్టీకి, ప్రజలకు మధ్య గల అవినాభావ సంబంధాలను, సోవియట్ సమాజం యొక్క, తమ భవిష్యత్ నిర్ణేతలు తామే అయిన సమాజం యొక్క ప్రజాస్వామిక స్వభావాన్ని స్పష్టంగా వ్యక్తీకరించింది.

ముసాయిదా కార్యక్రమాన్ని గూర్చి పార్టీలోను, దేశంలోను జరిగిన చర్చా ఫలితాలను మొదట తెలియజేస్తాను. తర్వాత దీనిగురించి ప్రపంచమంతటా వచ్చిన అభిప్రాయాలను క్లుప్తంగా చెబుతాను.

## 1. ముసాయిదా కార్యక్రమానికి పార్టీ, ప్రజల ఏకగ్రీవామోదం. ముసాయిదాకు సవరణలు, చేర్పులు

మన పార్టీ యొక్క, సోవియట్ దేశం యొక్క చరిత్రలోనే అపూర్వమైన విధంగా ముసాయిదా కార్యక్రమంపై పెద్ద ఎత్తున చర్చ జరి

గింది. కార్యక్రమం యొక్క ఆశయాలూ, అందులో పొందుపరచబడిన కర్తవ్యాలూ మనలో ప్రతి ఒక్కరికీ సంబంధించినవి, ప్రతి ఒక్కరినీ ఉత్సాహపరచేవి కాబట్టి ఇలా జరగడం సహజమే.

పార్టీ అన్ని ప్రాథమిక సంస్థల సమావేశాలు, జిల్లా, నగర, ప్రాంతీయ ప్రాదేశిక పార్టీ మహాసభలు, యూనియన్ రిపబ్లిక్కుల కమ్యూనిస్టు పార్టీల మహాసభలన్నిటిలోను ముసాయిదా కార్యక్రమాన్ని గూర్చి కూలంకషంగా చర్చించారు. తొంభై లక్షల మందికి పైగా కమ్యూనిస్టులు, అంటే పార్టీ యావత్తూ ఈ చర్చలలో పాల్గొన్నది. ఫాక్టరీలు, సమష్టి వ్యవసాయ క్షేత్రాలు, ఆఫీసులు, సైనిక, నావిక యూనిట్లు, ట్రేడ్ యూనియన్, యువ కమ్యూనిస్టు సంస్థలు 500,000కు పైగా సమావేశాలు జరిపాయి; ముసాయిదా కార్యక్రమాన్ని గూర్చి చర్చించాయి. ఈ సమావేశాలకు దాదాపు 7,30,00,000 మంది హాజరైనారు. పార్టీ సమావేశాలు, మహాసభలు, యూనియన్ రిపబ్లిక్కుల పార్టీల మహాసభలు, కార్మిక ప్రజా సమావేశాలలో 46,00,000 మందికి పైగా ముసాయిదా కార్యక్రమాన్ని గూర్చి మాట్లాడారు.

అంతే కాదు. పార్టీ కేంద్ర కమిటీకి, స్థానిక పార్టీ సంస్థలకు, వార్తా పత్రికా, పత్రికా సంపాదకుల కార్యాలయాలకు, రేడియో, టెలివిజన్‌లకు 3,00,000కు పైగా లేఖలు, వ్యాసాలు వచ్చాయి.

అయినప్పటికీ చర్చలో ఎంతమంది పాల్గొన్నదీ నిర్దిష్టంగా తేల్చి చెప్పడం కష్టమైపోయింది. దేశంలో సిద్ధాంత జీవితం అంతటా చర్చ వ్యాపించింది; అనేక రూపాలలో—ఫాక్టరీ సిబ్బంది సమావేశాలు ప్రభుత్వ సమష్టి వ్యవసాయ క్షేత్రాల సమావేశాలు, ఆఫీసులు, విద్యాశాలలలో సమావేశాలు, పనికి వెళ్ళినప్పుడు, ఇంటివద్ద సంభాషణలలో ఈ చర్చ కొనసాగింది. ఈ విధంగా ముసాయిదా కార్యక్రమాన్ని యావత్తు ప్రజలూ చర్చించి, దానిని తమ స్వంత కార్యక్రమంగా, తమ జీవితాశయంగా ఆమోదించారంటే అతిశయోక్తి కాదు.

ముసాయిదా కార్యక్రమాన్ని కమ్యూనిస్టు లందరూ, సోవి-

యట్ ప్రజలందరూ ఏకగ్రీవంగా ఆమోదించినట్లు ఈ మహాసభ ధృవ పరుస్తున్నది. కార్యక్రమంలో పొందుపరచిన భావాలను, అవి సూచిస్తున్న పథకాలను సోవియట్ ప్రజలందరూ మనస్సులలోనే కాక హృదయపూర్వకంగా కూడా అంగీకరించారు. పార్టీ సభ్యుల, పార్టీకి చెందని ప్రజల ప్రసంగాలు, లేఖలు ఉన్నతాశయాలతో, అభిప్రాయాలతో నిండి ఉన్నాయి. ఆ లేఖలలో చాలా భాగం నిజంగా పద్య కావ్యాలని చెప్పవచ్చు. ఎంతో ఉత్తేజం, ఉత్సాహం పొంది వ్రాసిన లేఖలు అవి. వాటిలో పార్టీ నూతన కార్యక్రమానికి ప్రజలు హృదయపూర్వకంగా స్వాగతం చెప్పారు. దానిని అమలు పరచడానికి వారు కృతనిశ్చయంతో ఉన్నట్లు తెలియజేశారు. సూర్యుడు నీటి బిందువుల్లోను ప్రతిఫలించినట్లు ప్రజల ఆలోచనలు, భావాలు ఆ లేఖలలో ప్రతిబింబిస్తాయి.

ముసాయిదా కార్యక్రమంపై చర్చ విషయానికి సూటిగా, మిక్కిలి నియమబద్ధమైన సిద్ధాంత స్థాయిలో జరిగింది. పటిష్టమైన లక్షలాది కమ్యూనిస్టుల, సోవియట్ ప్రజలందరి రాజకీయ చైతన్య పరిపక్వతను ఇది మరొక దృష్టాంతం. కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి సంబంధించిన గురుతర, నూతన, క్లిష్ట సమస్యలెన్నిటినో సోవియట్ ప్రజలు సిద్ధాంత రీత్యా, ఆచరణ రీత్యా తమకు గల అపార విజ్ఞానంతో పరిష్కరించడం ముదావహం.

ముసాయిదా కార్యక్రమం సోవియట్ ప్రజల సిద్ధాంత జ్ఞానాన్ని విస్తృతం చేసింది. వారు ఇప్పుడు తమ మహోన్నత లక్ష్యాన్ని, పరిష్కరింపవలసిన సమస్యలను మరింత స్పష్టంగా చూస్తున్నారు. మహాసభ గౌరవార్హమైన దేశ వ్యాప్త సోషలిస్టు అనుకరణ ఉద్యమానికి ఒక మహోన్నత సృజనాత్మక శక్తిని యీ కార్యక్రమం ప్రసాదించింది. పార్టీ, ప్రజలూ కార్యక్రమాన్ని వాస్తవంగా అంగీకరించారని, దాని అమలుకు అప్పుడే కృషి చేస్తున్నారని ఇది స్పష్టంగా రుజువుపరుస్తుంది.

కామ్రేడ్స్, ముసాయిదా కార్యక్రమానికి సవరణలుగా వచ్చిన అనేక ప్రతిపాదనలనుబట్టి, సమస్యల పరిష్కారానికి అత్యుత్తమ మార్గాలు అన్వే

పించడంలో గల సృజనాత్మక కృషి విదితమవుతుంది; కమ్యూనిస్టు సమాజ నిర్మాణం వీలైనంత నైపుణ్యంతో కొనసాగేట్లు చేయడంలో సోవియట్ ప్రజలందరికీ గల అమితోత్సాహాన్ని ఇవి వెల్లడిస్తాయి.

ప్రతిపాదనలన్నిటినీ కేంద్ర కమిటీ కూలంకషంగా పరిశీలించిందని యీ మహాసభకు నివేదిస్తున్నాను. కేంద్ర కమిటీ అంగీకారయోగ్యమైనవిగా భావిస్తున్న ప్రతిపాదనలను గూర్చి నేను మొదట మాట్లాడతాను. అందులో చాలా ప్రధానమైన వాటిని మాత్రమే నేను పేర్కొంటాను.

1. సాంకేతికాభివృద్ధి త్వరితం చేయడం గూర్చి, ఉత్పత్తి శక్తులను మరింత సంపూర్ణంగా, సమగ్రంగా హేతుబద్ధంగా ఉపయోగంగూర్చి కార్యక్రమంలో యింకా గట్టిగా నొక్కి చెప్పాలనే ప్రతిపాదనను కేంద్ర కమిటీ బలపరుస్తుంది.

2. భారీ పెట్టుబడులు మరింత చక్కని ఫలితాలు ఇచ్చేట్లు చేయడం గూర్చి, చెల్లాచెదరుగా ఉండిపోయే పెట్టుబడులకు అనుమతించకుండా ఉండటం, వాటిని నిర్ణయాత్మకమైన రంగాలలో కేంద్రీకరించవలసిన ఆవశ్యకతనుగూర్చి ఒక ప్రత్యేక అంశాన్ని కార్యక్రమంలో పొందుపరచాలనే ప్రతిపాదనలు సరిఅయినవే అని కేంద్ర కమిటీ అభిప్రాయం.

చర్చ సందర్భంలో, నూతన పారిశ్రామిక భవనాల నిర్మాణానికీ, వాటికి పరికరాలు సమకూర్చడానికీ మధ్య సమన్వయం లేకపోవడం గూర్చి ప్రభుత్వ దృష్టికి తీసుకురావడం సరిఅయినదే. ఇలాంటి సమన్వయం కొరవడినందువల్ల మనం ఎంతో నష్టపడుతున్నాం. ఉదాహరణకు, 1961 జనవరి 1వ తేదీనాటికి, మిలియన్ల చదరపు మీటర్ల పారిశ్రామిక భవనాలు ఉన్నప్పటికీ వాటికి అవసరమయిన సామగ్రిని పూర్తిగా అమర్చలేము. కోట్లాది రూబుళ్ళ విలువ చేసే సామగ్రికి తగిన భవనాలు సిద్ధపరచపోవడమే ఇందుకు కారణం. మన దేశంలో భారీ నిర్మాణ పరిశ్రమల అభివృద్ధికిగాను కేంద్ర కమిటీ, ప్రభుత్వమూ తగుచర్యలను సిద్ధం చేసింది. ఈ ప్రధాన విషయంలో ఖచ్చితమైన పద్ధతిని ఏర్పాటు చేయడం అత్యవసరం.

3. కొన్ని పార్టీ సమావేశాలు, మహాసభలలో, ప్రపంచంలో కెల్లా ఇనుము విస్తారంగా లభించే కుర్స్క్ మాగ్నెటిక్ అనోమలీని ప్రాతిపదికగా చేసుకొని, సోవియట్ యూనియన్‌కు చెందిన యూరపు భాగం నడిగడ్డలో ఇనుము, ఉక్కు కేంద్రం ఒకటి స్థాపించడానికి కార్యక్రమంలో అవకాశం కల్పించాలని ప్రతిపాదింపబడింది. ఇది పథకాలకు అనుగుణమైన ప్రతిపాదన. ఇరవై ఏళ్ళ కాలం పూర్తి అయ్యేటప్పటికి, సైబీరియాలో మూడో లోహ కేంద్రాన్ని పూర్తి చేయాలని, కొత్తగా రెండు ఇనుము, ఉక్కు కేంద్రాలను స్థాపించాలని మనము ఆలోచిస్తున్నట్లు నేను ఇదివరకే తెలియజేశాను. ఏ ప్రాంతాలలో వాటిని నిర్మించవలసి వుంటుందో, కార్యక్రమంలో ఒక ఉద్దేశంతోనే పేర్కొనాలని మన అభిప్రాయం. అప్పుడు ఇనుము, ఉక్కు పరిశ్రమలోని పార్టీ సంస్థలు, ప్రణాళికా సంస్థలు, అన్ని కార్యనిర్వాహణ శాఖలు ఈ పథకాలను అమలు జరపడంలో గురుతరమైన బాధ్యత వహించవలసి వుంటుంది.

4. అనేక ప్రతిపాదనలు వచ్చి వుండటంచేత, సహజ సంపదల పరిరక్షణ, వాటి సద్వినియోగాన్ని గూర్చి ఒక ప్రత్యేక అంశానికి కార్యక్రమంలో ఉచితమయిన భాగంలో చేర్చడం అవసరమని కేంద్ర కమిటీ భావిస్తున్నది. మన అడవులు, నదులు, మత్స్యాది సహజ సంపదలు ఒక బ్రహ్మాండమైన జాతీయ సంపద. మనం కమ్యూనిజంవైపు పయనం సాగించేకొద్దీ, ప్రకృతి ప్రసాదించే వాటి నన్నిటినీ భద్రపరచుకోవాలి: మన సంపదలను తెలివితేటలతో సమగ్రంగా ఉపయోగించుకోవాలి. మన అడవుల, నదుల, సముద్రాల సంపదను పునరుద్ధరించుకోవాలి, ద్విగుణీకృతం చేసుకోవాల.

5. సోషలిస్టు శ్రామిక యోధుడు కామ్రేడ్ నెక్రైవ్, వ్యవసాయరంగంలో పనిచేస్తున్న తదితరులు, వ్యవసాయ క్షేత్ర యంత్రాల నిర్వహణ విషయమై యింకా ఎక్కువ శ్రద్ధ తీసుకోవలసిన అవసరాన్నిగూర్చి కార్యక్రమంలో నొక్కి చెప్పాలని ప్రతిపాదించడం చాలా సమంజసంగా వుంది.

అనేక సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోను, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలోను ఉపయోగిస్తున్న ట్రాక్టర్లు, తదితర యంత్రాలు తక్కువ నైపుణ్యం గలవి. ఇది విచారకరం. అన్నిటికంటె ముఖ్యమైన విషయమేమిటంటే, అవి తగినంతకాలం పనిచేయకముందే చెడిపోతున్నాయి. వాటిని సరిగా వాడుకొనక పోవడమే ఇందుకు కారణం. యంత్రాల పట్ల నిర్లక్ష్య వైఖరి, కొన్ని సందర్భాలలో అనాగరిక వైఖరి కూడ ద్యోతకమవుతున్నది. ఇది వ్యవసాయ క్షేత్రాల ఉత్పత్తిని కుంటుపరుస్తున్నది. ఇది జాతీయ సంపదను దుర్వినియోగం చేయడం తప్ప మరేమీ కాదు.

యూనియన్ రిపబ్లిక్కుల కమ్యూనిస్టు పార్టీల కేంద్ర కమిటీలు, మంత్రిమండలులు ట్రాక్టర్లను, నూర్పిడి యంత్రాలను తదితర యంత్రాలను దీర్ఘకాలం పనిచేయించేట్లు, వాటిని చక్కగా ఉపయోగించేట్లు ఆర్థికరీత్యా, నిర్మాణ రీత్యా, సాంకేతిక రీత్యా వెంటనే తగు చర్యలు తీసుకోవలసి వుంటుంది.

6. పాఠశాలాత్పూర్వ విద్యాశాలల సంఖ్యను పెంచడం వంటి ప్రధాన కర్తవ్యాన్ని నెరవేర్చడానికి పట్టే కాలవ్యవధిని తగ్గించాలని కార్మిక ప్రజానీకం నుండి, ముఖ్యంగా స్త్రీలనుండి అనేక ప్రతిపాదనలు వచ్చాయి. రెండో దశాబ్దంలో నర్సరీలు, కిండర్ గార్డన్‌ల సంఖ్యను పెంచాలని, వాటిలో తమ బిడ్డలను పోషించుకోదలచే కుటుంబాలన్నిటికి అలాంటి అవకాశం ఇవ్వాలనే విషయం ముసాయిదా కార్యక్రమంలో నిర్దేశింపబడింది. ముసాయిదా కార్యక్రమంపై చర్చ సందర్భంలో వెల్లడైన కోర్కెలను కేంద్ర కమిటీ క్షుణ్ణంగా పరిశీలించింది. వీటిని తప్పకుండా నెరవేర్చాలని, రానున్న కొలది సంవత్సరాల లోపలే నర్సరీల, కిండర్ గార్డన్‌ల సంఖ్యను వీలైనంతవరకు పెంచాలని భావిస్తున్నది.

పెద్ద కుటుంబాలకు చెందిన తల్లులకు, వారి స్వంత అభ్యర్థనపై తక్కువ గంటలు పని చేయడానికి అనుమతి ఇవ్వాలని, అందుకు అనుగుణంగా జీతాలు సర్దుబాటు చేయాలని అనేక ప్రతిపాదనలు వచ్చాయి. ఈ

సమస్యను మన ప్రభుత్వ పరిశీలనకు, ట్రేడ్‌యూనియన్‌ల పరిశీలనకు పంపి, దీనికి అనుగుణమయిన ప్రతిపాదనలు తయారు చేయవలసిందిగా సూచించాలని కేంద్ర కమిటీ అభిప్రాయపడుతున్నది.

గృహ సమస్యను సత్వరమే పరిష్కరించాలని చాలామంది పార్టీ సమావేశాలలోను, కార్మిక ప్రజల సమావేశాలలోను, కేంద్ర కమిటీకి వ్రాసిన లేఖలలోను సూచించారు. ఈ విషయమై వచ్చిన అనేక సూచనలను దృష్టిలో ఉంచుకొని, మొదటి పదేళ్లు పూర్తి అయ్యేటప్పటికి నేటికీ తక్కువ స్థాయికి చెందిన, జనసమ్మర్ధమయిన గృహాలలో నివసిస్తున్న ప్రజలకు క్రొత్త ఇళ్లు కట్టించే అంశాన్ని కార్యక్రమంలో పొందుపరచాలని కేంద్ర కమిటీ భావిస్తున్నది.

చర్చ సందర్భంలో మన సామాజిక జీవితానికి సంబంధించిన అన్ని విషయాలను గూర్చి ప్రతిపాదనలు చేయబడ్డాయి; అవన్నీ మన ఆర్థిక, సాంస్కృతిక సమగ్రాభివృద్ధి పట్ల గాఢమైన ఆసక్తిని వెల్లడించాయి. ప్రతిపాదనలలో చాలా భాగం పరిశ్రమలు, వ్యవసాయం, ప్లానింగ్, నిర్వహణలను అభివృద్ధిపరచుకోవడం, మన ప్రభుత్వ కార్యకలాపాలను, ఆర్థిక యంత్రాంగాన్ని మెరుగుపరచుకోవడం, దాని నిర్వహణ మరింత చవకగా ఉండేట్లు చేయడంలాంటి నిర్దిష్ట సమస్యలకు సంబంధించినవి. వివిధ సమస్యలపై, అన్నిటికంటె ముఖ్యంగా, పరిశ్రమలు, వ్యవసాయం, రవాణా సౌకర్యాలు, భవన నిర్మాణం, కమ్యూనికేషన్లలో క్రొత్తగా సాధించిన శాస్త్రీయ విజయాలను వర్తింపజేయడం గూర్చి పరిశోధనా కృషిని విస్తృతం చేయాలని అనేక ప్రతిపాదనలు వచ్చాయి. సిద్ధాంత కృషి, కమ్యూనిస్టు నైతిక చైతన్యం, విద్య, సంస్కృతిని గూర్చి పరశ్రమోపజీవనం, ధనాపహరణ, వ్యక్తిగత ఆస్తి మనస్తత్వం ఫలితంగా ఏర్పడిన తదితర దుర్లక్షణాలను రూపుమాపడానికై ఇతోధిక చర్యలను గూర్చి చాలా ప్రతిపాదనలు పంపించారు. టౌన్-ప్లానింగ్ రంగంలో, ముఖ్యంగా గృహనిర్మాణం, పట్టణ, గ్రామీణ అభివృద్ధి పథకాల విషయమై విలువైన ప్రతిపాదనలు చేయబడ్డాయి.

ఇతర సమస్యలపై కూడా అనేక ప్రతిపాదనలు ఉన్నాయి. ఈ సమస్యల పరిష్కారానికి ముసాయిదా కార్యక్రమంలో స్పష్టంగా ప్రాతిపదిక వేయబడింది. అయినప్పటికీ ప్రతిపాదనలలో చాలా భాగం దేశ, ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధి, రాజకీయ, సైద్ధాంతిక, విద్యావిషయక కృషి వంటి ప్రధాన సమస్యలకు సంబంధించినవి. ఇవి తీవ్రంగా ఆలోచించదగిన ప్రతిపాదనలు. వీటిని శ్రద్ధగా పరిశీలించిన తర్వాత ముసాయిదా కార్యక్రమం శుద్ధ ప్రతి తయారుచేయబడింది. కేంద్ర కమిటీ అన్ని ప్రతిపాదనలను శ్రద్ధగా అధ్యయనం చేస్తున్నది; అవసరమైన, ఆచరణ సాధ్యమైన చర్యలు తీసుకోవలసిందిగా తత్సంబంధమైన పార్టీ, ప్రభుత్వ, తదితర సంస్థలకు అది ఆజ్ఞాపన ఇవ్వగలదు.

స్థానిక పార్టీ, ప్రభుత్వ, ఆర్థిక, ట్రేడ్ యూనియన్ సంఘాల, సంస్థల కృషిని గూర్చి పార్టీ సభ్యులు, పార్టీకి చెందని ప్రజలు చాలా విమర్శలు, ప్రతిపాదనలు పంపించారు. ఉత్పత్తి, వ్యాపారం, ప్రజలకు భోజన వసతి, ఇళ్ళ పంపిణీ, నివాస గృహాల నిర్వహణ వగైరా విషయాలలో లోపాలను పేర్కొన్నారు. కొందరు నిర్వహణాధికారుల నిరంకుశ పద్ధతులను, పని చెయడంలో అనవసర జాప్యాన్ని, అధికార హోదాను దుర్వినియోగపరచడాన్ని సోదాహరణంగా వెల్లడించారు. ఈ విమర్శలను, ప్రతిపాదనలను కూలంకషంగా పరిశీలించి, వెల్లడి చేయబడిన లోపాలను సవరించడానికి తగు చర్యలు తీసుకోవలసిందిగాను, ఆ విషయం అందుకు సంబంధించిన విస్తృత సమావేశాలకు, ఆ తర్వాత పార్టీ సదస్సులకు, మహాసభలకు తెలియ జేయవలసిందిగాను మన మహాసభ ప్రాంతీయ కమిటీలను, ప్రాదేశిక కమిటీలను, యూనియన్ రిపబ్లిక్కుల కమ్యూనిస్టు పార్టీల కేంద్ర కమిటీలకు ఆదేశం యివ్వాలి.

కమ్యూనిస్టు నిర్మాణానికి సంబంధించిన కొన్ని సమస్యలను పరిష్కరించడానికి కొందరు చేసిన ప్రతిపాదనలు అవాస్తవిక దృక్పథంతో కూడినవై ఉన్నాయి. అయితే అలాంటి ప్రతిపాదనలు చాలా కొద్దిగానే వచ్చాయి.

ఉదాహరణకు, కొందరు కామ్రేడ్స్, వచ్చే పదేళ్ళ లోపల, లేదా అయిదేళ్ళ లోపలనే, వ్యవసాయ క్షేత్రాలతో సహా దేశమంతటా సమగ్ర విద్యుదీకరణకు కార్యక్రమంలో అవకాశం కల్పించాలని ప్రతిపాదించారు. "నిర్ణయాత్మకమైనవే" అయినప్పటికీ, ఆర్థికంగా ఆచరణ సాధ్యం కానట్టి మరికొన్ని యిలాంటి చర్యలను కార్యక్రమంలో పొందుపరచాలని కొన్ని ప్రతిపాదనలు చేయబడ్డాయి. ఇలాంటి కామ్రేడ్స్ అభిప్రాయాలను మనము అర్థం చేసుకొంటాం. అయితే మనము వీరితో ఏకీభవించలేం. మనం నెరవేర్చలేని పనిని కార్యక్రమంలో చేర్చడం తప్పు. అలాంటి వాగ్దానాల ద్వారా మనం మన కార్యక్రమానికి అపఖ్యాతి తెచ్చిన వారం అవుతాం.

కొందరు మరొక రకమైన ప్రతిపాదన చేశారు. జీవితంలో రూపొందుతున్న పరిణామాల పట్ల వారి వైఖరిని అది తెలియ జేస్తుంది. వారు తమ పాండిత్యాన్ని ప్రదర్శించారేగాని సృజనాత్మక శక్తిని ప్రదర్శించలేదని నేను చెప్పవలసి వుంటుంది. ఉదాహరణకు కొందరు కామ్రేడ్స్, కమ్యూనిజం అంతిమ విజయం పొందేవరకూ శ్రామిక వర్గ నియంతృత్వం కొనసాగనివ్వాలనే అభిప్రాయం వెలిబుచ్చారు. ఈ కామ్రేడ్స్ మన దేశంలో అభివృద్ధి చెందిన పరిస్థితులను దృష్టిలో ఉంచుకోవడం లేదు. వీరు గ్రంథస్థమైన ఏవో కొన్ని ప్రమాణాలను పట్టుకొని వేళ్ళాడుతున్నారు. శ్రామికవర్గ నియంతృత్వ పరిపాలనను గూర్చి మార్క్స్, ఎంగెల్స్, లెనిన్‌ల సిద్ధాంత సారస్యాన్ని వీరు గ్రహించడం లేదు. పెట్టుబడిదారీ విధానం నుండి సోషలిజానికి, అంటే కమ్యూనిజం యొక్క ప్రథమ దశకు పరివర్తన చెందే కాలంలో శ్రామిక వర్గ నియంతృత్వం ప్రభుత్వ రూపంగా వారు చెప్పారు. .

మన సోషలిస్టు సమాజంలో యిప్పుడు సోషలిస్టు ఉత్పత్తిలో పాల్గొంటున్న శ్రామిక వర్గాలు మాత్రమే ఉన్నాయనీ, అవి సామాజికంగా, రాజకీయంగా, సిద్ధాంత రీత్యా ఒక దానికొకటి అభిన్నమైనవనే వాస్తవాన్ని వీరు గ్రహించడం లేదు. మన దేశంలో సోషలిజం అంతిమ

విజయం పొందిన తర్వాత, ఒక వర్గం యొక్క నియంతృత్వం ఉండటానికి ఆస్కారం లేదు. మరి ఏ వర్గానికి సంబంధించి నియంతృత్వం ఉండ గలదు? అలాంటి వర్గమేదీ లేదు.

అంతేకాదు. ఇలాంటి కామ్రేడ్స్, కార్మిక వర్గం యొక్క, రైతాంగం యొక్క ఐక్య సంఘటన యింకా వుంది కాబట్టి శ్రామిక వర్గ నియంతృత్వం కూడా వుండాలని అభిప్రాయపడుతున్నారు. అయితే,దోపిడీ వర్గాలకు వ్యతిరేకంగా పోరాడటానికి, రైతు వ్యవసాయాన్ని సోషలిస్టు వ్యవసాయంగా పరివర్తన చెందించటానికి, రైతాంగానికి పునర్విద్యా బోధచేయడానికి, సోషలిజం నిర్మాణానికిగాను, కార్మిక, రైతు ఐక్య సంఘటనకు శ్రామిక వర్గ నియంతృత్వం అవసరం అయిందనే విషయం ఈ కామ్రేడ్స్ గుర్తించడం లేదు. ఇప్పుడు ఆ కర్తవ్యాలు నెరవేరాయి కాబట్టి, కార్మిక వర్గం యొక్క, రైతాంగం యొక్క ఐక్య సంఘటన, యావత్ప్రజల సోషలిస్టు రాజ్యంలో, శ్రామిక వర్గ నియంతృత్వం లేకుండానే అభివృద్ధి చెందుతున్నది, నానాటికి పటిష్ట మవుతున్నది.

కమ్యూనిజానికి పరివర్తన చెందిన కాలంలో శ్రామికవర్గ నియంతృత్వంలో గర్భితమైన నిర్మాణ, ఆర్థిక, సాంస్కృతిక, విద్యావిషయిక కార్యకలాపాలనుకూడ ఈ కామేడ్స్ ప్రస్తావిస్తున్నారు. అయినప్పటికీ ఈ కార్యకలాపాలు కమ్యూనిజంలోకూడ ఉంటాయి. మనం సంప్రదాయానికి బద్ధులై ఉండాలంటే, శ్రామికవర్గ నియంతృత్వం కమ్యూనిజంలోకూడ ఉండాలని యీ కామ్రేడ్స్ వాదన. ఈ వాదన పసలేనిదని ప్రతి ఒక్కరికీ స్పష్టమవుతుంది.

కార్యక్రమంలో రూపొందించినట్లు, శ్రామికవర్గ నియంతృత్వ పరిపాలననుండి యావత్ప్రజల పరిపాలనకు పరివర్తన గురించి చెప్పబడిన దానిని వాస్తవ పరిస్థితి పూర్తిగా రుజువు చేసింది. ఇది వాస్తవంగా సిద్ధించిన పరిపాలన; ఇది సమాజం యొక్క రాజకీయ నిర్మాణాన్నిగూర్చి మన విధానాన్ని, అంటే ప్రజాస్వామ్యం యొక్క సమగ్రాభివృద్ధిని లక్ష్యంగా పెట్టు

కొన్ని విధానాన్ని వెల్లడిస్తుంది.

కొందరు కామ్రేడ్స్ సమష్టి క్షేత్ర వ్యాపారాన్ని ఎత్తి వేయాలని ప్రతిపాదించారు. కొందరు ఇంకా ముందుకు వెళ్ళి, వ్యాపారాన్నే పూర్తిగా ఎత్తివేసి దాని స్థానంలో ప్రత్యక్ష పంపిణీ ప్రవేశపెట్టాలని సూచించారు. ఈ కామ్రేడ్స్ చాలా దూరం వెళ్ళుతున్నారని రుజువు పరచవలసిన అవసరం లేదనుకొంటాను. వ్యాపారం ఉండాలా, అక్కరలేదా అనే సమస్య ఏదో ఒకరి ఇష్టం ద్వారాగాని, నిర్ణయం ద్వారాగాని తేల్చబడదు. ప్రత్యక్ష పంపిణీకి పరివర్తన చెందాలంటే, మనం అందుకు అవసరమైన సామగ్రిని, సాంకేతిక పునాదిని, కోకొల్లలుగా వస్తువులను సృష్టించాలి. అది లేనంత వరకు సోవియట్ వ్యాపారాన్ని కుదించకూడదు; పైపెచ్చు దానిని అభివృద్ధి చేయాలి, సమగ్రం చేయాలి. ప్రజలకు ఆహార పదార్థాలు సరఫరా చేయడంలో సమిష్టి క్షేత్ర వ్యాపారం చెప్పుకోదగిన పాత్ర వహిస్తున్నది కాబట్టి, దానిని నిషేధించకూడదు. సమష్టి వ్యవసాయదార్లు తమ పంటలో కొంత భాగాన్ని అమ్ముకోవలసి ఉంటుందని, అధికార రీత్యా దానికి నిర్ణీతమైన మార్కెట్ ధరలు ఏర్పాటు చేయకూడదని కొందరు కామ్రేడ్స్ భావిస్తున్నారు. సమిష్టి క్షేత్రపు మార్కెట్‌లో ధరల తగ్గింపు అనేది ప్రధానంగా వ్యవసాయ క్షేత్రంలో పంటను అధికం చేయడం ద్వారా చేయాలి. అంతేకాని అధికార రీత్యా తీసుకొనే చర్యల ద్వారా కాదు; లాభసాటి వ్యాపారం చేసేవారికి వ్యతిరేకంగా వర్తింపజేసే చర్యలు అవి. ఇదే సమయంలో సహకార సంస్థల కృషిని అభివృద్ధి పరచవలసి ఉంటుంది; వ్యవసాయదార్లు తమ అదనపు పంటను అమ్ముకోవడంలో అవి తోడ్పడాలి.

సోవియట్ వ్యాపారం నానాటికి విస్తృతం అవుతూ ఉండటం దృష్ట్యా, కమ్యూనిస్టు నిర్మాణ దశలో వ్యాపారాన్నిగూర్చి, దాని అభివృద్ధిని గూర్చి ఒక అంశాన్ని కార్యక్రమంలో చేర్చడం మంచిదని కేంద్రకమిటీ అభిప్రాయ పడుతున్నది.

మన పార్టీ శాస్త్రీయ కమ్యూనిస్టు పార్టీ అయినందువల్ల, తగు పరి

స్థితులు ఏర్పడి అవి పరిపక్వమయ్యే కొద్దీ, కమ్యూనిస్టు నిర్మాణ కర్తవ్యాలను క్రమంగా ప్రవేశ పెడుతుంది, సాధిస్తుంది. ఉత్పత్తి, జీవన ప్రమాణాలగూర్చి పార్టీ పథకాల వివరాలను నేను ఇదివరకే పేర్కొన్నాను.

అయినప్పటికీ, కొందరు కామ్రేడ్స్, భౌతిక, సాంస్కృతిక ఉచిత సౌకర్యాలను విశాల ప్రాతిపదికపై కలిగించాలనే సూత్రాన్ని, ప్రణాలికా లక్ష్యాలు నిర్దేశించిన దానికంటె, సమీప భవిష్యత్తులో అనులు జరపాలని ప్రతిపాదిస్తున్నారు. అర్హతలతోగాని, పని స్వభావంతోగాని నిమిత్తంలేకుండా అందరికీ సమానమైన జీతం ప్రవేశం పెట్టాలని దీని అర్థం, ఇవి చాలా తప్పు ప్రతిపాదనలు. ఇలాంటి మార్గాన్ని చేబట్టడమంటే ఉన్నత శ్రామికోత్పత్తి శక్తికి అవసరమైన భౌతిక ప్రోద్బలాన్ని తొలగించడమన్న మాట; కమ్యూనిజం నిర్మాణాన్ని కుంటుపరచడమన్న మాట.

కేంద్ర కమిటీ చొరవతో ఇటీవలి సంవత్సరాలలో జీతాల విషయంలో ఒక క్రమపద్ధతి అనుసరించడానికి తగు కృషి జరిగిందని మనం అందరికీ తెలుసు. ఈ చర్యల ఫలితంగా ఎక్కువ ఆదాయాలు కొన్ని రకాల ఆధికారుల జీతాలూ తగు విధంగా తగ్గించబడ్డాయి. ఇదే సమయంలో జీతాల కనీస స్థాయి పెంచబడింది. ఆదాయపు పన్ను రద్దు పద్ధతిని ఏర్పాటు చేసినందువల్ల, కార్మిక ప్రజానీకంలో వివిధ బృందాల ఆదాయాల మధ్య వ్యత్యాసం తగ్గిపోతున్నది.

ఒక్క మాటలో చెప్పాలంటే, జనాభాలో వివిధ బృందాల ఆదాయాల మధ్య వ్యత్యాసం తగ్గించడానికి ఎంతో కృషి జరిగింది. ఈ పద్ధతిని పార్టీ పట్టు విడుపులు లేకుండా కొనసాగిస్తుందని ముసాయిదా కార్యక్రమంలో స్పష్టీకరింప బడింది. తద్వారా మొదటి పదేళ్లు పూర్తి అయ్యేసరికి మన దేశంలో తక్కువ జీతాలు పొందే కార్మికులనేవారు లేకుండా ఉండేట్లు, ప్రజలందరి జీవన ప్రమాణాలు పెరిగేట్లు చూడాలని పార్టీ సంకల్పం.

జీతాలు పెరగడంతోబాటు, సామాజిక నిధులుకూడ త్వరితగతిని

పెరుగుతాయి. తత్ఫలితంగా ఆదాయాలలో అసమానత్వం రూపు మాసిపో తుంది. తక్కువ జీతాలు పొందే కార్మికులు, మధ్యరకం జీతాలు పొందే కార్మికుల జీవన ప్రమాణాలు ఇంకా త్వరగా అభివృద్ధి అవుతాయి. అందరినీ సమానంగా చూడాలనే ధోరణులు ఉత్పత్తి అభివృద్ధికి, జీవన ప్రమాణాల పెరుగుదలకు వ్యతిరేకమైనవి. శ్రమపట్ల కార్మిక ప్రజలకు కమ్యూనిస్టు వైఖరిని అలవరచడానికి కూడ ఇవి వ్యతిరేకమైనవి.

"పని చేయనివానికి తిండి లేదు" అనే సూత్రాన్ని— చేసిన పనినిబట్టి జీతం అనే సూత్రాన్ని మనం ఖచ్చితంగా అమలు జరపాలి. ఇదే సమయంలో, సమాజాన్ని దోచుకోవడానికి, శ్రమద్వారా కాకుండా ఇతరత్రా ఆదాయాలు సంపాదించి పరశ్రమోప జీవనం గడిపేందుకు సంఘ వ్యతిరేక శక్తులకు ఏవిధమైన అవకాశమూ ఇవ్వకూడదు. సోవియట్ చట్టాలను, ప్రజాభిప్రాయాన్ని శక్తివంతంగా ఉపయోగించి అధిక లాభార్జనవంటి ఇతర కుటిల చర్యలను పూర్తిగా రూపు మాపాలి.

ప్రజలందరి జీవన ప్రమాణాలను క్రమంగా అభివృద్ధి పరచడానికి మనం సుముఖులం. అయితే ఇదే సమయంలో వ్యక్తిగత ఆస్తి మనస్తత్వం కలిగించే విధంగా పెద్ద ఎత్తున ఆస్తి ప్రోగుచేసుకోవడాన్ని మనం వ్యతిరేకిస్తాం.

చర్చ సందర్భంలో ఒక క్రమపద్ధతిని అనేక మార్పులు, చేర్పులు ప్రతిపాదింపబడ్డాయి. కేంద్రకమిటీ ఆ సవరణలను పరిశీలించింది. అందులో కొన్ని కార్యక్రమ పాఠాన్ని మెరుగుపరుస్తాయి. ఈ సవరణలు, మార్పులు మీ ముందు ముసాయిదా కార్యక్రమంలో ఉన్నాయి.

ముసాయిదా కార్యక్రమంపై చర్చ సందర్భంలో ముందుకు వచ్చిన ప్రధాన విషయాలు ఇవి.

# 2. ముసాయిదా కార్యక్రమంపై అంతర్జాతీయ వ్యాఖ్యలు

కామ్రేడ్స్, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ ముసాయిదా కార్యక్రమం నిజంగా ప్రపంచ ప్రాముఖ్యతగల పత్ర ప్రాముఖ్యాన్ని సంతరించుకొన్నది; ఇప్పటి కప్పుడే ప్రపంచ రాజకీయ వాతావరణంపై తగినంత ప్రభావాన్ని కలిగించింది. సోషలిస్టు దేశాలలోని అశేష ప్రజానీకాన్ని, సామ్రాజ్యవాద దేశాలలోని సాధారణ ప్రజానీకాన్ని, స్వాతంత్ర్యం పొందిన, లేదా ఇంకా వలస పరిపాలనకింద నలిగిపోతున్న ప్రజలను అది మిక్కిలి ఆకర్షించింది. అది ప్రపంచంలో మారుమూల ప్రాంతాలకు చొచ్చుకు పోయింది; పచ్చి అభివృద్ధి నిరోధకమైన పత్రికలలోకూడ చోటు సంపాదించింది.

సోవియట్ కమ్యూనిస్టులమైన మనం సోదర మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలూ, అన్ని దేశాలలో లక్షోప లక్షల సంఖ్యలో వున్న పటిష్టమైన కమ్యూనిస్టులూ ముసాయిదా కార్యక్రమాన్ని వేనోళ్ళ శ్లాఘించాయని తెలుసుకొని సంతోషించడం సహజమే. ఇతర దేశాలలోని కమ్యూనిస్టులు తాము ముసాయిదా కార్యక్రమంనుండి తమ నిత్య కార్యకలాపాలకు పోరాటానికి ఉత్తేజం పొందుతున్నామని, మన విజయాలు వారి శక్తులకు, స్వేచ్ఛ, శాంతి శక్తులకు, ప్రపంచమంతటా సోషలిజానికి బలం చేకూర్చగలవని చెప్పినప్పుడు అంతర్జాతీయతా వాదులైన మనం సంతసిస్తున్నాం. సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ ఇరవై రెండవ మహాసభ ప్రతినిధుల తరఫున, మన పార్టీ సభ్యులందరి తరఫున, సోవియట్ ప్రజలందరి తరఫున సోదర పార్టీలకు, ప్రపంచ మంతటా గల కమ్యూనిస్టులకు, మన పథకాలకు మన ఆశయాలకు వారు తోడ్పాటు అందజేసినందుకు నాను మన హృదయపూర్వకమైన కృతజ్ఞతాభివందనలు తెలుపుతున్నాను.

ఇతర దేశాలలోని సోదరులారా, మన లెనినిస్టు పార్టీ, శ్రామికవర్గ

అంతర్జాతీయతా పతాకాన్ని చేబూని, మానవజాతిని శాంతియుత, సుఖప్రద, సౌభాగ్యప్రదమైన ప్రపంచానికీ, కమ్యూనిస్టు సమాజానికీ చేరువగా తీసుకు రావడానికి తన శాయశక్తులా కృషిచేస్తుందని హామీ యిస్తున్నాం.

కార్యక్రమం నేడెదుర్కొంటున్న అత్యవసర సమస్యలెన్నింటినో పరిష్కరించడానికి తోడ్పడుతుందని, సామాజికోద్యమాలలోను, ఆధునిక అభ్యుదయకర పరిణామాలలోను ఘనమయిన పాత్ర వహించగలదని అభివృద్ధి కాముకుల, ప్రజాస్వామిక వాదులందరి అభిప్రాయం. బూర్జువా వర్గమూ, వారి పత్రికలకు సంబంధించినంతవరకు, కార్యక్రమమూ దాని విజయమూ యావత్ప్రపంచ పరిస్థితిపైన అపూర్వమైన ముద్రవేస్తాయని అంగీకరించవలసి వచ్చింది.

మన పార్టీ ముసాయిదా కార్యక్రమం విషయమై ప్రముఖ బూర్జువా, మితవాద సోషలిస్టు ప్రముఖులు చేసిన ప్రకటనలను పరిశీలిస్తే, మనం సూత్ర సంబంధమైన ప్రాధాన్యత గల ఎన్నో నిర్ణయాలకు రాగలం.

కమ్యూనిస్టు, బూర్జువా సిద్ధాంతాల రెండిటి మధ్య నిజమయిన పోరాటం కార్యక్రమంలో పొందుపరచిన అభిప్రాయాల చుట్టూ పెంపొందిందని మొట్టమొదట చెప్పవలసి వుంది. బ్రహ్మాండమైన నిర్మాణ పథకాలలో పొందుపరిచిన కమ్యూనిస్టు భావాలు బూర్జువా సిద్ధాంతంతో, హింసాత్మక, వినాశకర సిద్ధాంతంతో పోల్చి చూస్తే ఎన్నోరెట్లు శ్రేష్ఠతరమయినవనీ, ఆ సిద్ధాంతంపై క్రొత్త విజయాలు సాధించాయని స్పష్టంగా రుజువవుతుంది. ఈ విషయాన్ని మనం ఘంటాపథంగా చెప్పవచ్చు.

మొట్టమొదటి విజయమేమంటే, కమ్యూనిజం ఒక నూతన సామాజిక, ఆర్థిక నిర్మాణంగా, మన కాలంలో నానాటికీ పెంపొందుతున్న బలోపేత శక్తి అని బూర్జువా సిద్ధాంత వేత్తలు ఇప్పుడు అంగీకరిస్తున్నారు. పందొమ్మిదో శతాబ్దంలో బూర్జువావర్గం, కమ్యూనిస్టు అభిప్రాయాలు వట్టి గాలిమేడలని ప్రకటించింది, ఆ అభిప్రాయాలను బలపరచిన వారిని రాచి రంపాన పెట్టింది.

ఇరవయ్యో శతాబ్దంలో మొదటి ముప్పయ్యేళ్ళు అంతర్జాతీయ ప్రాతిపదికపై బూర్జువావర్గం అనేక "కమ్యూనిస్టు-వ్యతిరేక" ఉద్యమాలు నడిపింది. అనేక దేశాలలో కమ్యూనిజాన్ని అధఃపాతాళానికి త్రొక్కివేశామని వారు ప్రకటించారు. అయిదో దశాబ్దంలో కమ్యూనిజం "తిరుగులేని సంక్షోభం"లో పడి కొట్టుమిట్టాడుతున్నదనే నిర్ధారణకు వారు వచ్చారు. అయితే మరికొన్నేళ్లు గడిచిన తర్వాత, కమ్యూనిజం బ్రహ్మాండంగా అభివృద్ధి చెందినట్లు అభివృద్ధి నిరోధకులైన సామ్రాజ్యవాదులు తప్పకుండా గుర్తించవలసి వచ్చింది. కమ్యూనిజం యొక్క పుష్టినిచ్చే శక్తిని, ప్రపంచ చరిత్రలో దానికి ప్రాధాన్యతను పరిగణనలోకి తేసుకోవలసి వచ్చింది.

బూర్జువా దృక్పథాలు ఎలాంటి పరిణామం చెందుతూ ఉంటాయో తెలుసుకోవాలంటే, బ్రిటిష్ ఎకనమిస్టు వంటి పచ్చి బూర్జువా వార పత్రిక చేసిన ప్రకటనను చూస్తే సరిపోతుంది. మన పార్టీ రెండవ కార్యక్రమాన్ని ఆమోదించినప్పుడు, బోల్షివిజానికి శక్తి ఉడిగిపోతున్నదని ఎకనమిస్టు నిష్కర్షగా చెప్పింది; అదే పత్రిక ఇప్పుడు, కార్యక్రమం "నేటి ధోరణుల ప్రతిబింబం"అని, "మానిఫెస్టోలో చేసిన వాగ్దానాలు విడ్డూరంగా కనపడటం లేద"ని విధిగా అంగీకరించవలసి వచ్చింది.

కమ్యూనిస్టులు తాము వ్యర్థ ప్రసంగాలు చేయమని, తమ వాగ్దానాలను పూర్తి చేస్తామని రుజువు పరచారు. తమ పథకాలను ప్రత్యర్థులు కూడ గౌరవించేట్లు చేయగలిగారు. కమ్యూనిజం ఆధునిక జీవితంలోకి సూటిగా, స్పష్టంగా ప్రవేశించింది. ఆ జీవితంలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించింది. దాని జైత్రయాత్రను అడ్డుకొనే శక్తి ఏదీ లేదు.

ప్రపంచ వ్యాఖ్యలను పరిశీలిస్తే, ఇంకొక ముఖ్య నిర్ణయానికి కూడా రావచ్చు: కమ్యూనిజమూ, శాంతీ విడదీయరానివనే కార్యక్రమం యొక్క ఉన్నతాశయం పెట్టుబడిదారీ దేశాల ప్రజానీకంలో ఇతోధికంగా వ్యాప్తి చెందుతున్నది. బూర్జువా ప్రతినిధులు చాలామంది, ఇలాంటి బృహత్ నిర్మాణ పథకాలను ప్రకటించిన దేశానికి శాంతి అవసరమని అంగీకరించ

పలసి వచ్చింది. సామ్రాజ్యవాదానికి పట్టుగొమ్మ అయిన అమెరికాలో ప్రజాస్వామిక వాదులైన ప్రజలు మన పార్టీ కార్యక్రమం శాంతి, మానవత్వాల ఉజ్వల సోపానమని, సైనిక సమీకరణకు ఉద్దేశించిన అమెరికన్ సామ్రాజ్యవాదుల పథకాలు "దుఃఖమూ, కష్టమూ, రక్తమూ" ప్రసాదిస్తాయని పోల్చుకొంటున్నారు.

సోవియట్ వ్యతిరేక ప్రచారంలో ఆరితేరిన ఆస్ట్రేలియన్ సిడ్నీ మార్నింగ్ హెరాల్డ్, ఇలాంటి బృహత్ పథకం తలపెట్టిన సోవియట్ యూనియన్‌కు శాంతి అవసరమని అంగీకరించవలసి వచ్చింది.

ప్రపంచంలో మరొక భాగంలో ఉన్న బూర్జువా పత్రిక లెబనీస్ అన్ నహర్ "యుద్ధం కోరేవారికి చావుదెబ్బ తగిలింది. కార్యక్రమం యొక్క సారాంశాన్ని ప్రతి ఒక్కరూ ఒకసారి గ్రహిస్తే, శాంతి పతాకం ప్రతిచోట ఎగురుతుంది" అని చెప్పవలసి వచ్చింది.

ఇలాంటి ఒప్పుకోళ్ళు మనకు ఏమి తెలియజేస్తాయి? కార్యక్రమం దురాక్రమణ శక్తులపైన హైడ్రోజన్ బాంబును ఆరాధించేవారిపైన క్రొత్తగా పెద్ద దెబ్బతీసిందని మనకు తెలియజేస్తాయి.

కార్యక్రమంలోని ఉన్నతాశయాలు బూర్జువా వర్గం యొక్క, వారి తాబేదార్ల యొక్క కమ్యూనిస్టు వ్యతిరేక కల్పిత గాథలను, అబద్ధాలను పటాపంచలు చేస్తున్నాయి. కమ్యూనిజం యొక్క ఆకర్షణ శక్తి పెరుగుతున్నది; కమ్యూనిస్టు భావాలను ప్రజలు ఇతోధికంగా బలపరుస్తున్నారు. కమ్యూనిజం ఆర్థికంగా, రాజకీయంగా, నైతికంగా పెట్టుబడిదారీ విధానం కంటె శ్రేష్టతరమైనదని, భవిష్యత్తు కమ్యూనిజానిదేనని నూతన కార్యక్రమం ద్వారా ప్రజలు యింకా ఎక్కువగా గుర్తించగలరు.

బూర్జువా వర్గమూ, వారి తాబేదార్లూ నేడు దిగులుపడుతున్నారంటే, దానికి కారణాలను తెలుసుకోవడం కష్టమేమీ కాదు; మన పార్టీ కార్యక్రమానికి ఎదురొడ్డటానికి వారి వద్ద ఏముంది? భవిష్యత్తును గూర్చి వారు చెప్పేది ఏమీ లేదు; ఇరవై ఏళ్ళ మాట అలా ఉంచి, ఒక ఏడాదికైనా వారు పథకం

వేయలేరు. బర్మా రచయిత్రి డౌ ఆ మా, "అమెరికా, పెట్టుబడిదారీ సమాజానికి చక్రవర్తి, కమ్యూనిస్టు వ్యతిరేక పోరాటంలో 'సర్వ సైన్యాధిపతి.' ఆ దేశం ఒక వేళ తలచుకొన్నప్పటికీ, సోవియట్ పథకంతో పోటీపడే పథకం ఏదీ తయారు చేయలేదు. బ్రిటన్ విషయంలో కూడా యిదే వర్తిస్తుంది. సోవియట్ యూనియన్ పథకాన్ని పోలిన ఏ ఒక్క పథకాన్నీ అది తయారు చేయలేదు" అని చక్కగా చెప్పింది.

సామ్రాజ్యవాద బూర్జువా వర్గం ముఖ్యంగా ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా ప్రజలలో కార్యక్రమం ఎలాంటి ప్రభావం కలిగిస్తుందో అని దిగులు చెందుతున్నారు. సెనేట్ విదేశ సంబంధాల కమిటీ సభ్యుడు ఆల్బర్ట్ గోరే, ముసాయిదా కార్యక్రమాన్ని గూర్చి ఒక హెచ్చరిక చేశారు; వెనుకబడిన దేశాలను అది ఎంతగా ఆకర్షించగలదో తక్కువ అంచనా వేయకూడదు అని చెప్పారు.

పెట్టుబడిదారీ విధానం ద్వారా దోపిడీకి గురి అవుతున్న ప్రజలందరిని కార్యక్రమంలోని ఆశయాలు చాలా ఆకర్షిస్తాయనడంలో సందేహం లేదు. ది టైమ్స్ ఆఫ్ ఇండియా యిలా వ్రాసింది: "కమ్యూనిస్టు మానిఫెస్టో తర్వాత, ఇంత ఉత్తేజపరచిన కమ్యూనిస్టు పత్రం ఏదీ లేదు. కార్యక్రమం ఆచరణ సాధ్యం అవుతుందనే విషయంలో కూడా సందేహపడ నక్కరలేదు; కనీసం ఆఫ్రికా, ఆసియా దేశాలను సోవియట్ విజయాలు ఆకర్షించాయి. రష్యా ఏ వాగ్దానాలు చేసినా నెరవేరుస్తుందని వారికి ఒక విధమైన నమ్మకం కలిగిస్తాయి." మన కార్యక్రమానికి, మన కార్యకలాపాలకు ఇచ్చిన ఈ యోగ్యతా పత్రం చెడ్డదేమీ కాదు!

పెట్టుబడిదారీ విధానాన్ని స్తోత్రం చేయడానికిగాను సామ్రాజ్యవాద ప్రచారకులు నిరంతరం క్రొత్త పద్ధతులను కనిపెడుతున్నారు. పెట్టుబడి మార్గానికి భిన్నమైన మార్గంలో అభివృద్ధి అనేది చిక్కులు కల్పిస్తుందని క్రొత్తగా విముక్తి పొందిన దేశాలను భయపెడుతున్నారు. సామ్రాజ్యవాద బూర్జువా వర్గం ఇలా చేసే కొద్దీ, వలస పరిపాలనను పూర్తిగా రద్దుచేయడం

కోసం జరిగే పోరాటంలో, సామాజికాభ్యుదయంకోసం జరిగే పోరాటంలో ప్రజలను ఉత్తేజపరిచే అభివృద్ధికర భావాలు వారిని ఎక్కువ భయపెడతాయి. మనకు సంబంధించినంతవరకు, మనము మన భావాలను ఎవరిపైనా రుద్దం. అయినప్పటికీ క్రొత్తగా విముక్తి పొందిన జాతులు సోషలిస్టు భావాలను, అభివృద్ధికర భావాలను అనుసరించగోరితే, మన స్వీయ అనుభవాన్నిబట్టి, వారు సరి అయిన పనిచేస్తున్నారని చెప్పగలం.

సామ్రాజ్యవాదానికి సిద్ధాంత రీత్యా ఊడిగం చేసేవారు, కమ్యూనిస్టు భావాలు పాశ్చాత్య దేశాల ప్రజానీకాన్ని ఏ విధంగానూ ఆకర్షించడం లేదని, తమ యజమానులను అసత్యవాదనల ద్వారా ఓదార్చ జూస్తున్నారు. ఓ పెద్ద మనుష్యులారా, ఏమి తెలివి తక్కువతనం యిది!

కమ్యూనిస్టు భావాలు సజీవమైనవి. కష్టపడి పనిచేస్తూ, పెట్టుబడిదారీ విధానం ద్వారా పీడనకు గురైన ప్రజలు ఉన్నచోటెల్లా అవి వేళ్లూను తున్నాయి. "నాగరికత"కు పేరుగాంచిన మీ దేశాలలోని లక్షలాది ప్రజలు ఏమనుకొంటున్నారో మీకు తెలుసా? రేపు గడిచేది ఎలా అనే దిగులుతో జీవిస్తున్న ఏ కార్మికునైనా అడగండి, నాశనమైపోయిన ఏ రైతులనైనా అడగండి, కూటికి మొగం వాచిపోతున్న ఏ నిరుద్యోగినైనా అడగండి, తమ బిడ్డలకు శాంతి, సౌఖ్యం వాంఛిస్తున్న వారందరినీ అడంగండి. మీ దేశాలలోనే లక్షలాది ప్రజలు కమ్యూనిజం వైపు ఆకర్షింపబడ్డారని మీకు తెలిసిపోతుంది.

ఒక అమెరికన్ నిరుద్యోగి, ఆర్థర్ స్టోన్ ప్రావ్దాకు వ్రాసిన లేఖను నేను యిక్కడ ఉదాహరించ దలచాను, ఆయన యిలా వ్రాశారు: "ప్రపంచ ప్రజలను కాదని పెట్టుబడిదారులు ఎన్నో నేరాలు చేస్తున్నారు. తద్వారా ప్రతిచోటా కార్మికులను నిత్య హత్య చేస్తున్నారు. దీనికి సమాధానం యీ ముసాయిదాలో, ప్రపంచ మంతటికీ కనిపిస్తుంది. ఇది ప్రపంచంలోని పీడిత ప్రజలందరికీ ఆశను చిగురింపజేసే, ఉత్సాహాన్ని రేకెత్తించే కార్యక్రమం."

ఆర్థర్ స్టోన్ సోవియట్ ప్రజలకు యిలా విజ్ఞప్తి చేశారు: "నేను త్వరగా ఒక మాట చెప్పి యీ కర్తవ్యాన్ని పూర్తి చేస్తాను. సోవియట్ యూనియన్‌లోని మీ వైపు ప్రపంచమంతా ఎదురుచూస్తున్నది. వీలైనంత త్వరగా యీ కార్యక్రమాన్ని నెరవేర్చండి, పూర్తిచేయండి. ఈ విధంగా లక్షలాది ప్రజలను కాపాడండి. అలా చేయకపోతే వారు దోపిడీ మూలంగా కృశించి నశించిపోతారు." ఈ లేఖను ఆయన తన హృదయ రక్తంతో వ్రాశారు; పెట్టుబడిదారీ దేశాలలోని మన సోదరుల ఆలోచనలను, భావాలను ఇది బాగా వెల్లడిస్తుంది.

కార్యక్రమంలోని భావాలు, కమ్యూనిజం యొక్క భావాలు జగత్తు అంతటా వ్యాప్తి చెందుతున్నాయి. ఎందుకంటె అణగారిన, పూర్తి హక్కులు లేని లక్షలాది ప్రజలు వాటిలో తమ అత్యుత్తమ భావాలూ, వాంఛలూ రూపు దాల్చి ఉండటం గమనిస్తున్నారు. పెట్టుబడిదారీ విధానపు గురువులు పోలీసు వలయాల ద్వారా, "ఇనుప తెరల" ద్వారా, ప్రజలకు యీ అభివృద్ధికర భావాలు అందకుండా నిరోధించ లేరు. కమ్యూనిజం ప్రజల ఆశాజ్యోతి, వారి ఉజ్వల భవిష్యత్తుకు హామీ!

అయినప్పటికీ, సామ్రాజ్యవాద బూర్జువావర్గం సిద్ధాంత రీత్యా తమ ఓటమిని ఇప్పటికీ అంగీకరించ దలచుకోలేదు. అ విధంగా చేయడమంటే తాము రాజకీయంగా ఆత్మహత్య చేసుకొన్నట్లు అవుతుంది మరి. సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ ముసాయిదా కార్యక్రమ ప్రాధాన్యతను, ప్రజానీకంపై దాని ప్రభావాన్ని తగ్గించడానికి వారు ఎన్నో తీవ్ర ప్రయత్నాలు చేస్తున్నారు, ఎన్నో పద్ధతులను అవలంబిస్తున్నారు.

పెట్టుబడిదారీ సమాజానికి చెందిన పాలకవర్గం తమ కార్యక్రమాన్ని, అంటే పెట్టుబడిదారీ విధానాన్ని కాపాడుకొనే ఏదో ఒక పథకాన్ని మన కార్యక్రమానికి పోటీ పెట్టాలని వ్యర్థ ప్రయత్నాలు చేస్తున్నారు. అయితే పెట్టుబడిదారీ విధానానికి ఉద్దీపన కలిగించడానికై ఎన్నోసార్లు ప్రయత్నాలు జరిగినట్లు మనం చదివాం, విన్నాం. కాని పెట్టుబడిదారీ విధానం నిర్నిరోధ

మైన విధంగా క్షీణించి పోతున్నది. ఎందుకంటె వినాశమైన ఈ వ్యవస్థను కాపాడగల సాధనా లేవీ లేవు. ఇలాంటి వ్యవస్థలో ప్రజలను ఉత్తేజ పరచగల భావా లేవీ వుండవు. బూర్జువా సిద్ధాంతం యొక్క దివాళాకోరు తనానికి న్యూయార్క్ పోస్టు పత్రికే తిరుగులేని సాక్ష్యం. "చాలా సంవత్సరాలుగా అమెరికన్ నాయకులు 'జాతీయ ప్రయోజనం'తో కుస్తీ పడుతున్నారు; కాని దాదాపు వట్టి చేతులతోనే బయటికి వచ్చారు" అని ఆ పత్రిక వ్రాసింది.

పెట్టుబడిదారీ విధానానికి ఏ కార్యక్రమం లేదనీ, మన కార్యక్రమాన్ని విమర్శించడానికి తగిన వాదనలుగాని లేవనేది స్పష్టం. తప్పించుకొని పోవ డానికి వీలులేని పరిస్థితిలో, పెట్టుబడిదారీ విధానాన్ని సమర్థించేవారు సర్వ శూన్యమైన ఎడారిలో, కమ్యూనిస్టు వ్యతిరేక బాణాలకోసం అన్వేషించారు. అయితే నింద, అభాండాలు, అపసవ్యమైన దృష్టాంతాలతో విషపూరి తమైన బాణలు తప్ప వారికి మరేమీ దొరకలేదు. అందుకే కమ్యూనిస్టు శత్రు శిబిరంలో ఇంత గందరగోళం, చేతగాని క్రోధం, అవిశ్వాసం బయలు దేరాయి.

బూర్జువా విమర్శకులు వంత చెప్పినట్లు, ఒక్కుమ్మడిగా ఈ కార్య క్రమం ఆచరణ సాధ్యమైంది కాదన్నారు. ప్రథమ సోవియట్ పంచవర్ష ప్రణాళికల దగ్గరనుండి మనకు సుపరిచితమైన వల్లింపులే-అంటే "కల్పన" "ఎండ మావులు", "భ్రమ" అనే మాటలే తిరిగి అభివృద్ధి నిరోధకుల పత్రికలలో కనబడ్డాయి.

మన కార్యక్రమాన్ని ఎదిరించేవారు ఏవైనా లెక్కలుగాని, అంచ నాలుగాని, వాస్తవాలుగాని దగ్గర పెట్టుకొన్నారా అంటే అదేమీలేదు. మన కార్యక్రమంలోని ప్రతి లక్ష్యమూ ఎలా ఆచరణసాధ్యమో వివరింపబడింది. అయితే వారి ప్రకటనలలో గట్టి అరపులు తప్ప మరేమీ వినిపించడంలేదు. మనం ఇచ్చిన ప్రతి లెక్క గుణించబడి, రుజువు చేయబడింది. పవిత్ర జలానికి భూతం భయపడినట్లు, వారు లెక్కలను చూచి భయపడుతున్నారు.

చారిత్రక పరిణామక్రమాన్ని గూర్చి మనం సరియైన, శాస్త్రీయమైన విశ్లేషణను యిచ్చాం. వారు తమ ఘాతవైద్యుల మంత్రోచ్చాటనలే చేస్తున్నారు; తేయాకులు చూచి నిష్ఫలమైన జోశ్యాలు చెబుతున్నారు.

వారు ఎంతో పట్టుదల ప్రదర్శిస్తున్నారు. అయితే వైరుధ్యాల ఊబిలోకే తాము దిగబడిపోతున్నామని, తమ కథలను ఒకదానితోనొకటి సరిగా అతికించలేక పోతున్నామని వారు గ్రహించడం లేదు. పైపెచ్చు యింకా తలలు బ్రద్దలు కొట్టుకొంటున్నారు.

విమర్శకులలో ఒక ముఠా యీ కార్యక్రమం నెరవేరేది కాదు అని అరుస్తూ ఉంటే, వేరొక ముఠా "ఇది ఒక సవాలు! చేతనైతే ఆత్మరక్షణ చేసుకోండి!" ఇది అరుస్తున్నది. ఫ్రెంచి పత్రిక ఫిగారొ, నూతన సోవియట్ పథకాలు "గాలిమేడలు" అని చెబుతున్నది. ఆస్ట్రియన్ పత్రిక సాస్ క్లీన్ వోల్క్స్ బ్లాట "క్రెమ్లిన్ తలపెట్టిన బృహత్తర లక్ష్యాలను కేవలం గాలిమేడలు అని లెక్కించ కూడదు; ఎందుకంటే ఆ ఆశయాలు పాశ్చాత్య దేశాలకు అక్షరాలా సవాలు"అని పాశ్చాత్య ప్రపంచాన్ని హెచ్చరించింది. ఇది నిజంగా "గ్రహించగలిగితే గ్రహించదగిన విషయం!" ఈ విమర్శకులు చివరికి మూడు చెట్లు ఉన్న అడవిలోనైనా కాకుండా, కేవలం రెండు చెట్లు ఉన్న అడవిలోనే దారి తప్పారని మనం గ్రహించగలం.

మన కార్యక్రమాన్ని విమర్శించేవారు, కమ్యూనిజంలో వ్యక్తి స్వాతంత్ర్యం ఉండదనే పాతబడిపోయిన పుక్కిటి పురాణం పట్టుకొని కూడ ఊరేగుతున్నారు. ఆస్ట్రియన్ సోషల్-డెమాక్రటిక్ వార్తాపత్రిక ఆర్బీటర్ జీటుంగ్ ఆ తప్పు ఊహను పట్టుకు వ్రేళ్ళాడటానికి ప్రయత్నించింది. ఆ పత్రిక ఏమంటున్నదో చూడండి : "ఎల్లుండి ఒక సోవియట్ పౌరునికి ఉచితంగా ప్రయాణం చేయడానికి టిక్కెట్టు దొరికితే దొరకవచ్చునని మేము నమ్ముతున్నాం. అయితే అతడు తన ఇష్టం వచ్చినచోటికి వెళ్లే హక్కు కలిగి ఉంటాడంటే మాత్రం మేము నమ్మడం లేదు." ఎవరైనా ఒక సోవియట్ పౌరుని ఉద్దేశించి, నీ ఇష్టం వచ్చిన చోటికి నీవు వెళ్ళగలవా అని అడిగితే, ఇతనికి మతిభ్రమ ఏమైనా కలిగిందా, ఏ పిచ్చి ఆసు

పత్రినుండి అయినా తెప్పించుకు రాలేదుగదా అని అనుకున్నట్టుగా అతడు చూస్తాడు. సోవియట్ ప్రజలు తమ ఇష్టం వచ్చిన చోటికి వెళ్ళుతున్నారు. వందలాది అమెరికన్‌లు, ఆ "స్వతంత్ర యాత్రికు"లు, దక్షిణ రాష్ట్రాలలో పర్యటించి ఖైదులో చిక్కుపడిపోయినవారు, ఇదే ప్రశ్నకు ఏమని సమాధానం చెబుతారు?

బూర్జువా ప్రచారంలో మరొక హాస్యాస్పదమయిన పద్ధతి ఉంది: అన్నిటికంటె ముఖ్యంగా, అమెరికా, తదితర పెట్టుబడిదారీ దేశాలలో ఇదివరకే సాధించిన పరిస్థితులను సోవియట్ ప్రజలు యిప్పుడు కమ్యూనిజంలో సాధించదలచారని వారు చెబుతారు.

పెట్టుబడిదారీ దేశాలలో కార్మిక ప్రజల వాస్తవిక జీవన పరిస్థితులను యిలా తప్పుగా చిత్రించడం గూర్చి ఏమనాలో తెలియదు. "నిరుద్యోగస్థాయి జాతికే అప్రతిష్ఠ తెస్తున్నద"ని, లక్షలాది ప్రజలు వాస్తవంలో పస్తులుంటున్నారని అమెరికా పత్రికలే అంగీకరిస్తున్నాయనే విషయం ఒకసారి ఊహించుకోండి. అయినప్పటికీ అమెరికా జీవిత విధానంలో గల "సుఖా ల"ను అనుభవిస్తున్న లక్షలాది ప్రజలందరూ తమ అవసరాలు నెరవేర్చబడుతున్నాయని ఊరకే నమ్మేట్లు చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

ఏటేటా అమెరికా పత్రికలు, అమెరికాలో వైద్యానికి అయ్యే ఖర్చు ప్రాణాంతకంగా తయారవుతున్నదని వ్రాస్తున్నాయి. అయినప్పటికీ ఇప్పుడు రమకు కూడ ఉచిత వైద్య సౌకర్యం ఉందని వారు మనలను నమ్మించ జూస్తున్నారు. లక్షలాది కుటుంబాలకు ఇంటి అద్దె భరించరానంత ఎక్కువగా ఉందని నిన్ననే అమెరికా పత్రికలు వ్రాశాయి. అయినప్పటికీ ఇప్పుడు వారి కిరాయి లేఖకులు అమెరికాలో ఇళ్లు దాదాపు ఉచితంగానే దొరుకుతాయని వ్రాస్తున్నారు. వారు అబద్ధాలతో కిలగాయిలగంగా కలిసిపోయారు, ఈ కాబోమే విమర్శకులు.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమం సహజీవన, శాంతియుత పోటీ పంథాను ఎకరీతిని అమలు జరుపుతుంది. శాంతియుత

సహజీవనానికి సవాలు, శాంతికి విముఖులైన వారినే హడలగొడుతున్నట్లు మనం గమనిస్తున్నాం. కొన్ని బూర్జువా పత్రికలు శాంతియుత సహజీవనం "ప్రపంచ విప్లవాయుధం" అని చెప్పేదాకా వెళ్ళాయి. న్యూయార్క్ టైమ్స్ పెట్టుబడిదారీ ప్రపంచంలోని ప్రముఖ పత్రికలలో ఒకటి. అది కార్యక్రమంపై వ్యాఖ్యానిస్తూ, స్వేచ్ఛా ప్రపంచంపై కొత్తగా యుద్ధం ప్రకటించబడిందని, అది సైనిక, రాజకీయ, ఆర్థిక, ప్రచార యుద్ధ ప్రకటన అని చెప్పింది.

మహాశయులారా! ఇదీ హృద్రోగ లక్షణం. మీ నరాలకు బిగువు తప్పింది. పెట్టుబడిదారీ ప్రపంచంపై యుద్ధ ప్రకటన వంటిది, కార్యక్రమంలో మీకు ఏ భాగంలో కనిపించింది? కార్యక్రమంలోని ఏ నిబంధనను, ప్రతిపాదనను బట్టి మీరు ఇలా చెపుతున్నారు? అందులో ఇలాంటి ఉద్ఘాటనలకు ఏ విధమైన, ఆస్కారం లేదు, ఉండజాలదు. న్యూయార్క్ టైమ్స్‌లో పనిచేసేవారు ఇప్పటికీ పాత సిద్ధాంతాన్నే పట్టుకు వ్రేళ్ళాడుతూ ఉంటే, వారు శాంతి, సహజీవనాలను గూర్చి భయపడుతున్నట్లు, పెట్టుబడిదారీ విధానం సోషలిజంతో శాంతియుత పోటీకి నిలువలేదని వారు గ్రహించినట్లు రుజువవుతుంది. సామ్రాజ్యవాద వర్గాలు అన్ని విఫల యుద్ధానికి తయారైనారు; తద్వారా తమ పథకాలు ప్రజల ముఖ్య ప్రయోజనాలకు వ్యతిరేకమైనవని మరొకసారి రుజువుపరచుకొంటున్నారు.

వివేక వ్యతిరేకులు, అభివృద్ధి నిరోధకులూ మన కార్యక్రమాన్ని ఎదిరిస్తున్నారని మనము ఏ మాత్రమూ తలక్రిందులై పోవడం లేదు. వారు మనలను పొగిడేట్లయితే మనము తలక్రిందులు కావలసివస్తుంది. వివేక వ్యతిరేకులు మన కార్యక్రమానికి వ్యతిరేకంగా ఆర్పులు బొబ్బలు పెడుతూ ఉంటే, మన కార్యక్రమం చాలా సూటిగా ఉందని అర్థంచేసుకోవలసి ఉంటుంది. మనం మన పంథాను, కమ్యూనిజం పంథాను విశ్వాసంతో అనుసరిస్తున్నాం. ఇప్పుడు కాకపోతే, మరొకప్పుడైనా మానవ జాతి యావత్తూ ఆ పంథాను అనుసరిస్తుందని మన దృఢ నమ్మకం.

# VII

# విశాల ప్రాతిపదికపై కమ్యూనిస్టు నిర్మాణ దశలో పార్టీ

కామ్రేడ్స్, నూతన కార్యక్రమం యొక్క గొప్పదనం మన లెనినిస్టు పార్టీ యొక్క గొప్పదనాన్ని వెల్లడిస్తుంది. కమ్యూనిజం యొక్క ఉన్నతాశయాలకు రూపకల్పన చేస్తూ, మన పార్టీ సమాజం యొక్క విప్లవాత్మక పరివర్తనకు నాయకత్వం వహించి, తన కర్తవ్యాన్ని చక్కగా నిర్వహిస్తున్నది. శ్రామిక వర్గ పార్టీగా అవతరించిన మన మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీ సమస్త ప్రజల పార్టీగా తయారైంది. ప్రయోజనాలూ, దృక్పథం మధ్య అభేద్యత గల సోవియట్ సమాజం యొక్క దృఢ ఐక్యతా, బలమూ యిందులో గోచరిస్తాయి. అన్ని వేళలా, కష్టంలోగాని, సుఖంలోగాని, మంచి రోజులలోగాని, గడ్డు రోజులలోగాని, పార్టీ ప్రజలను అంటిపెట్టుకొని వుంది. ప్రజలు పార్టీని అంటి పెట్టుకొని ఉన్నారు. నూతన చారిత్రక పరిణామ దశలో మనలను ఎదుర్కొంటున్న కర్తవ్యాలను నెరవేర్చడంలో, మన ప్రజల మనోభీష్టాన్ని, శక్తి సామర్థ్యాలను కూడా విడదీయగలది కమ్యూనిస్టు పార్టీయే.

నేడు మన దేశానికి విస్తృతమయిన భౌతిక సంపదలు ఉన్నాయి: బాగా అభివృద్ధి చెందిన శాస్త్రీయ విజ్ఞానం, సాంకేతిక విజ్ఞానం ఉన్నాయి: ప్రజలలో ఉత్సాహం పొంగి పొరలు తున్నది. అలాంటప్పుడు మన అభివృద్ధి ప్రమాణాలు, ముఖ్యంగా మన రాజకీయ విధానాన్ని దేశవ్యాప్తంగా, స్థానికంగా ఖచ్చితమయిన పద్ధతిలో అమలు జరపడాన్నిబట్టి, మన ప్రభుత్వ సంస్థలూ, ప్రజా సంస్థలూ అన్నీ చక్కగా జయప్రదంగా పనిచేయడాన్ని

బట్టి, సోషలిస్టు వ్యవస్థ కల్పించిన సౌకర్యాలను అవి సక్రమంగా ఉపయోగించుకోవడాన్ని బట్టి ఆధారపడి వుంటాయి. అందుచేత విశాల ప్రాతిపదికపై కమ్యూనిస్టు నిర్మాణ దశలో పార్టీ దర్శక, నిర్మాణ పాత్రను పెంచవలసిన అవసరం వుంది.

ఈ దశలో కమ్యూనిస్టు పార్టీ ప్రధానంగా ఏ విధమయిన పద్ధతులలో అభివృద్ధి చెందుతుంది? ఈ క్రిందిపద్ధతులలో అభివృద్ధి చెందుతుందని మనము విశ్వసిస్తున్నాం:

అత్యున్నతమయిన సామాజిక, రాజకీయ నిర్మాణ రూపంగా పార్టీ పాత్రను ఇతోధికంగా పెంచడం, కమ్యూనిస్టు నిర్మాణ రంగాలన్నిటిలోను దాని దర్శక ప్రభావం ఇతోధికంగా ఉండేట్లు చేయడం;

పార్టీకి, ప్రజలకుమధ్య ఐక్యతను పటిష్టం చేయడం; పార్టీకి చెందని ప్రజలతో పార్టీ సంబంధాలు అనేక రూపాలలో వుండేట్లు చేయడం, కార్మిక ప్రజలలో యింకా ఎక్కువ మందిని పార్టీ సభ్యుల స్థాయికి తీసుకురావడం;

పార్టీ అంతరంగిక ప్రజాస్వామ్యాన్ని యింకా పెంపొందించడం, పార్టీ సభ్యుని పేరుకు ఇతోధికంగా ప్రాధాన్యత కలిగించడం, కమ్యూనిస్టులందరి కర్తవ్యనిష్ఠను, ఉత్సాహాన్ని మరింత ప్రోదిచేయడం, పార్టీని అనుసరించే ప్రజల మధ్య ఐక్యతను, సంఘీభావాన్ని పటిష్ఠం చేయడం.

విశాల ప్రాతిపదికపై కమ్యూనిస్టు నిర్మాణ దశకు తగినట్లు పార్టీ రాజకీయ కృషి యొక్క, నిర్మాణ రీత్యా నాయకత్వం యొక్క స్థాయిని పెంచాలని నొక్కి చెప్పవలసి వుంది. నూతన కార్యక్రమాన్ని ఆమోదించడం ఒక చారిత్రాత్మకమైన చర్య. అయితే ఇది తొలి చర్య మాత్రమే. ప్రధాన విషయం కార్యక్రమాన్ని అమలు జరపడం. కార్యక్రమంలో పేర్కొన్న కర్తవ్యాలు నెరవేరాలంటే పార్టీ మొత్తంగానూ, ప్రతి పార్టీ సంస్థ చాలా ఎక్కువ కృషి చేయవలసి వుంటుంది.

నూతన కార్యక్రమ ప్రాతిపదికపై మన మహాసభ ఆమోదించే సోవి

యట్ దేశ కమ్యూనిస్టు పార్టీ నిబంధనలు, విశాల ప్రాతిపదికపై కమ్యూనిస్టు నిర్మాణ దశలో ఏర్పడే పరిస్థితులకు ఎదురయ్యే కర్తవ్యాలకు అనుగుణమయిన పార్టీ నిర్మాణ సూత్రాలను విస్తృత పరుస్తాయి.

ఎన్నికైన పార్టీ సంస్థలను ఏవిధంగా ఏర్పాటు చేయాలనే సమస్య చాలా ప్రధానమైనది. ముసాయిదా కార్యక్రమం ఒక నూతన పద్ధతిని ప్రతిపాదిస్తున్నది: పార్టీ అగ్ర సంస్థల సభ్యులను క్రమంగా మార్పు చెయాలనేదే అది. ఈ పద్ధతిని ఎన్నుకొనబడిన ప్రభుత్వ, ప్రజా సంస్థలకు కూడ వర్తింపజేయడం మంచిదని మా విశ్వాసం.

ఈ వ్యవస్థకు పరివర్తన చెందడమంటే, మన ప్రజాస్వామ్యాభివృద్ధిలో చాలా పెద్ద ముందంజ వేయడం కాగలదు. ప్రభుత్వం యావత్ప్రజల రాజ్యంగా తయారై, పార్టీ యావత్ప్రజల మనోభీష్టానికి, ప్రయోజనాలకు ప్రతినిధిగా తయారై, సోవియట్ సమాజం యొక్క రాజకీయ నిర్మాణంలో ఏర్పడిన నూతన దశకు ఇది అనుగుణంగా ఉంది. పార్టీ సభ్యుల సంఖ్య బాగా పెరగడం, వారి సిద్ధాంత స్థాయి మిక్కిలి అభివృద్ధి చెందడం, పార్టీ కార్యకర్తల సంఖ్య చాలా అధికంగా పెరగడం ప్రజల రాజకీయ, సాంస్కృతిక స్థాయి ఇదివరకెన్నడూ లేనంత ఎక్కువగా పెంపొందడం—ఇవి యీ దశలో కనిపించే ప్రత్యేక లక్షణాలు.

పార్టీ రూపుదిద్దుకొనేటప్పుడు, అందులో అభివృద్ధి భావాలుగల కార్మికులు, మేధావులు కొద్దిమందే ఉండేవారు. వారు మార్క్సిజం వైపు ఆకర్షింపబడ్డారు. ఎందుకంటే వారు చారిత్రక పరిణామాన్ని తెలుసుకోదలచారు, సమాజంలో కనిపిస్తున్న వైరుధ్యాలకు విప్లవ పద్ధతిలో పరిష్కారమార్గం అన్వేషించ దలచారు. విప్లవమే వృత్తిగా పెట్టుకొన్న వీరు, కమ్యూనిజం పట్ల గాఢ విశ్వాసం కలిగిన వీరు, లెనినిస్టు పార్టీకి పట్టుగొమ్మలై వుండేవారు. లెనినిస్టు పార్టీ కార్మిక వర్గాన్ని, కార్మిక ప్రజానీకాన్ని సంఘటిత పరచి, వారికి రాజకీయ చైతన్యం కలిగించింది. పాత దోపిడీ పద్ధతిని వారు ఎదిరించేట్లు చేసింది. సోషలిజం విజయాన్ని సాధిం

చింది. పార్టీ ఏర్పడినప్పటినుండి, దాని ఉన్నత సిద్ధాంత ఐక్యత, దాని సభ్యుల మధ్య సంఘీభావం, క్రమశిక్షణ, దానికి ప్రజానీకంతో గల సంబంధాలు, దానికి కార్మిక వర్గమూ, కష్టించి పనిచేసే రైతాంగమూ ఇచ్చిన తోడ్పాటు మూలంగా అది బలపడింది.

అక్టోబరు విప్లవ విజయం కోసం జరిపిన పోరాటాలలో, అంతర్యుద్ధం యొక్క అగ్ని గుండంలో, సోషలిస్టు నిర్మాణ రంగాలలో, మాతృదేశ రక్షణ కోసం జరిగిన మహా యుద్ధపు అగ్ని పరీక్షలో, యుద్ధానంతర సంవత్సరాలలో మన పార్టీ బలం అనేక రెట్లు పెరిగింది; దాని సభ్యులు హెచ్చారు, కార్యకర్తలు, సభ్యులు నిగ్గుదేలారు. కమ్యూనిస్టులతో భుజం భుజం కలిపి, కమ్యూనిస్టులతో భావైక్యత గల పార్టీకి చెందని ప్రజలు కూడా, నేడు కమ్యూనిజం నిర్మాణంలో చురుకుగా పాల్గొంటున్నారు.

విప్లవం తొలి రోజులలో మనకు ప్రముఖ పార్టీ కార్యకర్తలు కొద్దిమందే ఉండేవారు. నేడు ప్రముఖ స్థానాలకు క్రొత్తవారిని పంపించడానికి అపారమైన అవకాశాలు ఉన్నాయి. ప్రముఖ స్థానాలకు ఎన్నికైన కామ్రేడ్స్ క్రొత్త వారిని రాకుండా మార్గ నిరోధం చేయడం దుస్సాధ్యంగా ఉండేట్లు, పై పెచ్చు పార్టీలోను, ప్రభుత్వంలోను, ట్రేడ్ యూనియన్‌లోను, తదితర ప్రజా సంస్థలలోను, పార్టీ నాయకత్వంలోను, దేశ నాయకత్వంలోను, క్రొత్త వారు బాధ్యతాయుత స్థానాలను ఆక్రమించి, తమ బుద్ధి కుశలతను, శక్తి సామర్థ్యాలను ఉపయోగించడానికి అవకాశం కల్పించేట్లు ఒక పద్ధతిని ప్రవేశపెట్టవలసిన అవసరం ఉంది. మనలో ఎంతోమంది సమర్థత గల, విద్వాంసులైనవారు ఉన్నారు. అయితే వారికి లేనివల్లా తగినంత అనుభవం. మన ప్రముఖ కామ్రేడ్స్ క్రొత్త కార్యకర్తలకు తర్ఫీదు యివ్వడంలో తోడ్పడవలసి ఉంటుంది.

ప్రతి జీవికి వేర్వేరు జీవాణువులు ఉంటాయి. కొన్ని అణువులు నశించిపోతే, క్రొత్తవి పుట్టుకొస్తూ ఉంటాయి. ఈ విధంగా ప్రతి జీవి నిత్యనూతనత్వం సంతరించుకొంటూ ఉంటుంది. పార్టీకి, యావత్తు సమా

జానికీ కూడా ఇదే క్రమపద్ధతి, ఇవే జీవిత నియమాలు వర్తిస్తాయి. పార్టీ సమాజ జీవిత పరిణామ క్రమానికి హాని కలిగించకుండా ఉండాలంటే యీ సహజమైన క్రమపద్ధతిని నిరోధించ కూడదు, దీనికి భంగం కలిగించ కూడదు.

తమ కాలంలో మన్నన పొంది, ప్రముఖ స్థానాలకు ఎన్నికై, ఆ పదవులను డజనులకొద్దీ సంవత్సరాలు ఆక్రమిస్తూ వచ్చిన కామ్రేడ్స్ మనలో ఉన్నారనే విషయం బహిరంగ రహస్యం. ఈ కాలంలో వారిలో కొందరు సృజనాత్మకంగా కృషిచేసే శక్తిని కోల్పోయారు, క్రొత్తదనాన్ని పరిగ్రహించే జ్ఞానం వారిలో పూర్తిగా నశించి, ఒక అవరోధంగా తయారైనారు. వారు గతంలో యీ పదవులకు ఎన్నికైనారు కాబట్టి, అక్కడే అట్టి పెట్టాలనడం తప్పు అవుతుంది. ఒక పర్యాయం ప్రముఖ స్థానాలకు ఎన్నికైతే, ఆ వ్యక్తులను ఆ స్థానాలలో శాశ్వతంగా అట్టిపెట్టాలనుకోవడం సరి కాదు. అది మన విధానం కాదు. తమ పదవీకాలం ముగిసిన తర్వాత, ఒక పార్టీ సంస్థకు పార్టీ కామ్రేడ్స్ తిరిగి ఎన్నిక కాకపోతే, ఇది వివక్షకు కారణం కారాదు. ఒక నిర్ణీత కాలంపాటు ఒక కమ్యూనిస్టుకు అప్పగించిన పనిని అతడు బాగా చేస్తే, ఆ ఖ్యాతి అంతా అతనిదే.

పనిలో తమ విశిష్టతను రుజువు పరచుకొన్న యువక కామ్రేడ్స్‌ను ప్రముఖ పార్టీ, ప్రభుత్వ పదవులలోకి ఆకర్షించడం మన కర్తవ్యం. మార్క్సిజం-లెనినిజం యొక్క సిద్ధాంతాన్నీ, విప్లవకారులు సోషలిజం నిర్మాతలు తరతరాలుగా గడించిన అనుభవాన్నీ తీసుకొని, నూతన శక్తులు రాటుదేరిన కార్యకర్తల సహకారంతో, మన దేశ బలాన్ని పటిష్ఠం చేయ గలవు; దాని ఆర్థిక వ్యవస్థను, శాస్త్రీయ విజ్ఞానాన్ని, సాంకేతిక విజ్ఞానాన్ని సంస్కృతిని అభివృద్ధి పరచగలవు.

మన పార్టీలో ప్రాథమిక, ఉన్నత శాఖలు, మన ప్రభుత్వ, ప్రజా సంస్థల శాఖలు ఎన్నుకోబడినవి, లక్షలాదిగా ఉన్నాయి. వీటికి ప్రతిసారి క్రమంగా జరిగే ఎన్నికలలో క్రొత్తవారు పలు లక్షలాదిగా ప్రముఖ స్థానా

లను అతిక్రమించగలరని స్పష్టమవుతుంది.

పాత కార్యకర్తల స్థానంలో క్రొత్తవారిని నియమిస్తుండటం, తమ విశిష్టతను రుజువుపరచుకొన్న కామ్రేడ్స్‌ను పైపదవులకు పంపడం, యువ కార్యకర్తలను, మంచి అనుభవం గల కార్యకర్తలను సమ్మేళనంచేసి పార్టీ, ప్రభుత్వ ఉన్నత యంత్రాంగంలోకి తీసుకోవడం మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీ అభివృద్ధికి మార్గం. ఈ విషయంలో పార్టీ, ముఖ్యంగా, స్టాలిన్ వ్యక్తి పూజ ద్వారా ఏర్పడిన ఫలితాలనుండి గుణపాఠాలు తీసుకొంటుంది. నేను యీ సమస్యపై ఎన్నో పర్యాయాలు, ముఖ్యంగా యీ మహాసభకు కేంద్ర కమిటీ నివేదిక సమర్పించే సందర్భంలో మాట్లాడాను.

కార్యక్రమం, నిబంధనల ముసాయిదాలో, పార్టీ యొక్క యీ ముఖ్య పత్రాలలో, పొందుపరచిన అంశాలు, వ్యక్తి పూజ పునశ్చరణ కావడానికి ఏ మాత్రమూ వీలు లేకుండా చేసే ప్రతిపాదనలను చేయాలి; దాని మార్గాన్ని ఖచ్చితంగా నిరోధించాలి. వ్యక్తిపూజను శాశ్వతంగా నిరోధించడానికిగాను పార్టీ అవసరమైన చర్యలన్నీ తీసుకొంటుందని మేము యీ మహా సభ వేదికనుండి ప్రకటిస్తున్నాం.

ఇక మీదట, ఎన్నికైన సంస్థలలో క్రమంగా కొత్త వారిని ప్రవేశపెడుతూ ఉండడం పార్టీ జీవితంలోను, ప్రభుత్వ, ప్రజా జీవితంలోను ఒక అనుల్లంఘనీయమయిన నియమంగా ఉండగలదు. సమిష్టి నాయకత్వ సూత్రాలను యింకా గట్టిగా అమలు జరపడానికి ఇది క్రొత్త అవకాశాలను కల్పించగలదు.

కమ్యూనిస్టుల, యావన్మంది ప్రజల సమిష్టి అనుభవం, సమిష్టి ఆలోచనపై పార్టీ ఆధారపడి వుంటుంది; ప్రజాసంస్థలూ, సోవియట్ ప్రజలూ ప్రదర్శించే చొరవకు యిది అన్నివిధాల ప్రోత్సాహం ఇస్తుంది. నూతనమయిన ప్రతి మంచి విషయాన్ని, ప్రతి మంచి భావాన్నీ, ప్రతి విలువగల ప్రతిపాదనను చెవియొగ్గి వినవలసి వుంటుంది; దానికి తోడ్పడవలసి వుంటుంది; దానిని అమలు పర్చవలసి ఉంటుంది.

అయితే ప్రజలు వివిధంగా ప్రదర్శించిన చొరవను చూడ నిరాకరించే అధికారులు మనలో వున్నారు. వారి దృష్టిలో తాము అనుకొన్నదే, తాము చెప్పిందే ప్రధాన విషయం. ఇది కమ్యూనిస్టు దృక్పథం కాదు: దొరల దృక్పథం. కమ్యూనిస్టు నిర్మాణానికై ప్రతి పౌరుని నైపుణ్యాన్నీ, శక్తి సామర్థ్యాలనూ ఉపయోగించేట్లు చూడటం ప్రముఖ కార్యకర్తలందరి, పార్టీ సంస్థలన్నిటి కర్తవ్యం.

ఎన్నికైన సంస్థలను క్రమపద్ధతిలో ఏర్పాటు చేయాలనే ప్రతిపాదన విమర్శ, ఆత్మవిమర్శల అభివృద్ధికి, తమ పైస్థాయిలోని వారి ఇష్టాయిష్టాల మీద ఆధారపడే వ్యక్తులు ఉన్న సందర్భంలో అలాంటి పరిస్థితులను ఖచ్చితంగా రూపుమాపడానికి, బంధుప్రీతిని ప్రదర్శించేవారిని ఏరి పారవేయడానికి, పనిలో ఒకరి తప్పులను ఒకరు దాచుకొనే పద్ధతిని అంతం చేయడానికి నూతన అవకాశాలు కల్పిస్తుంది. ఒకానొక సంస్థ యొక్క, ప్రజల యొక్క సమిష్టి నాయకత్వం వెల్లడించే అభిప్రాయాన్ని, మనోభీష్టాన్ని పరిశీలించ నిరాకరించే వారిని: పార్టీ పట్ల, ప్రజల పట్ల తమ బాధ్యతను విస్మరించిన వారినీ ఎన్నికైన సంస్థ నుండి తొలగించడానికి, సంస్థలలోనికి కొత్త వారిని తీసుకోవాలనే సూత్రం వీలు కల్పిస్తుంది. ఇదిమొదట, ఎన్నికైన సంస్థలలో క్రమంగా కొత్త వారిని చేర్చుతూ వుండాలి: తమ విశిష్టతను బాగా రుజువు పరచుకొన్న, కమ్యూనిజం పట్ల మిక్కిలి శ్రద్ధాసక్తులు గల వారిని అందులోకి తీసుకొంటూ వుండాలి.

మన కృషి యొక్క ప్రయోజనాల దృష్ట్యా, పాత, కొత్త కార్యకర్తలను సరియైనవిధంగా సమ్మేళనపరుస్తూ, నాయకత్వాన్ని ధారావాహికంగా కొనసాగించడం, ప్రధానంగా ఉన్నత సంస్థలలో చాలా అవసరం. ధారావాహికమైన నాయకత్వం లేనిదే సరియైన దేశీయ, విదేశాంగ విధానాన్ని అనుసరించడం: ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధి విజయవంతంగా జరిగేట్లు చూడటం కష్టమైపోతుంది.

ధారావాహిక మైన నాయకత్వం లెనినిస్టు మూలసూత్రాలలో ఒకటి.

లెనిన్ మనకు యీ విధంగా బోధించారు: "వాస్తవంలో ఒక పార్టీ సంస్థ యొక్క, పార్టీ నాయకులని పిలువదగిన వారియొక్క విధులలో ఒకటి ఏదంటే, ఆలోచనా శక్తి గల ఒక వర్గ ప్రతినిధులందరూ దీర్ఘకాలం, పట్టు విడుపులు లేకుండా, భిన్న భిన్న రూపాలలో, విస్తారంగా సాధించిన కృషి ద్వారా, క్లిష్టమైన రాజకీయ సమస్యలకు సత్వర, సక్రమ పరిష్కార మార్గం చూపించడానికి అవసరమైన జ్ఞానాన్నీ, అనుభవాన్నీ—జ్ఞాన, అనుభవాలే కాకుండా—రాజకీయ చైతన్యాన్నీ రూపొందించాలి."*

పార్టీ కార్యకర్తల, లేదా దాని నాయకుల ప్రతిష్ఠ పార్టీకి అమూల్యమైన పెన్నిధి. వ్యక్తి పూజను మనం తిరస్కరించినప్పటికీ, ప్రముఖ పార్టీ కార్యకర్తలను తయారు చేసుకోవలసిన అవసరాన్ని, వారి ప్రతిష్ఠను పెంచవలసిన అవసరాన్ని మనం ఏ విధంగానూ త్రోసిపుచ్చడం లేదు. తమ శక్తి సామర్థ్యాలను బట్టి, తమ రాజకీయ, వ్యవహార దక్షతను బట్టి, పార్టీ నాయకులు పార్టీ సభ్యులనుండే తయారు కావాలనేది; కమ్యూనిస్టులతోను, ప్రజలతోను వారికి సన్నిహిత సంబంధాలుండాలనేదీ ముఖ్య విషయం. లెనిన్ జీవిత కాలంలో పార్టీ నాయకులు యీ విధంగానే తయారైనారు. నేడు కూడా ఇదే విధంగా జరగాలి.

లెనినిస్టు పార్టీ జీవిత ప్రమాణాలను, సమిష్టి నాయకత్వ సూత్రాన్ని మనం తప్పక పాటించాలి, అభివృద్ధి పరచాలి; నాయకత్వం వహిస్తున్న సంస్థల, వాటి అధిపతుల కార్యకలాపాలను; వారు తమ క్రియాశీలతను, చొరవను పెంపొందించుకోవడాన్ని, పార్టీ విధానాన్ని వ్యాప్తి నొందించడంలోను, అమలు జరపడంలోను వారు నిజంగా నిర్మాణ రీత్యా పాల్గొనడాన్ని; విమర్శను, ఆత్మ విమర్శను అభివృద్ధి పరచుకోవడాన్ని పార్టీ సభ్యులు ఖచ్చితంగా తనిఖీ చేస్తూ ఉండాలి.

---

* వి. ఐ. లెనిన్. రచనల సంకలనం, 4వ రష్యన్ ముద్రణ, సంపుటి 31, పుట 50.

పార్టీకి ఎల్లప్పుడూ ముందుచూపు ఉండి, అది ఎల్లప్పుడూ ప్రజలను అంటిపెట్టుకొని, వారి బుద్ధి కుశలత ద్వారా తమ అనుభవాన్ని అభివృద్ధి పరచుకొంటూ, విస్తృపరచుకొంటూ ఉంటే, అన్ని కష్టాలకు తట్టుకొని నిలబడగలదు. లెనిన్ స్థాపించి, ప్రోదిచేసిన మన పార్టీ అలాంటిది.

అందుచేత, కామ్రేడ్స్, మన చిరస్మరణీయమైన నాయకుడూ, గురువూ యిచ్చిన ఆదేశాలను మనం ఎల్లప్పుడూ పవిత్రంగా చూసుకోవాలి; ఇతోధిక శ్రద్ధతో వాటిని పాటించాలి. అప్పుడే మన విజయాలు అన్నివిధాల ఆకర్షణీయంగా ఉంటాయి.

మన అభివృద్ధియొక్క నూతన దశలో, సోవియట్ల పార్టీ నాయకత్వాన్ని, ఆర్థిక ట్రేడ్ యూనియన్, యువ కమ్యూనిస్టు, సహకార తదితర ప్రజా సంస్థల నాయకత్వాన్ని అభివృద్ధి పరచుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. ప్రజా సంఘటనను అభివృద్ధి పరచడానికి, వారి సృజనాత్మక శక్తులను సమీకరించడానికి ఇది చాలా అవసరం. కమ్యూనిస్టు నిర్మాణ రంగాలన్నిటా జరిగే పనికి బాధ్యత వహిస్తున్నప్పటికీ, పార్టీ సంస్థలు ప్రభుత్వ సంస్థల, ప్రజా సంస్థల విధులలోకి వ్రేలు పెట్టకూడదు. ప్రజా సంస్థలలో పనిచేసే పార్టీ నాయకుల ప్రధాన కర్తవ్యం ఏమిటంటే, కమ్యూనిస్టు నిర్మాణానికి వాటి కృషిని సమీకరించాలి; ప్రముఖ ప్రజా సంస్థల సమ్మేళనాన్ని క్రమంగా అభివృద్ధి పరచాలి; కార్యకర్తలను సరి అయిన స్థానాలలోకి పంపి, వారికి తర్ఫీదు యివ్వాలి.

ప్రస్తుత దశలో పార్టీ సభ్యుని పాత్ర, బాధ్యత అధికమవుతాయి. కమ్యూనిస్టు అన్న పేరు ఉన్నతమైనది. ఇదివరకు ఎన్నడూ లేనంతగా, నేడు అతడు పార్టీ విధానాన్ని అమలు పరచడానికి జరిగే పోరాటంలో ముందు నిలబడవలసి వుంటుంది. తాను పట్టుదలతో ప్రజలకు చేసే సేవలోను, సామాజికమైన, వ్యక్తిగతమైన తన ప్రవర్తనలోను, కమ్యూనిస్టు నైతిక సూత్రాలను పాటించడంలో కమ్యూనిస్టు ఆదర్శంగా ఉండాలి;

తద్వారా కమ్యూనిస్టు సంబంధాలను అభివృద్ధి పరచడానికి, పటిష్టం చేయడానికి దోహదం చేకూర్చాలి.

పార్టీయొక్క అభేద్య సిద్ధాంత, నిర్మాణ పటిష్టతే దాని బలానికి, అజేయతకు మూలకందంగా ఉంటుంది. లెనినిస్టు పార్టీ సూత్రాలకు విరుద్ధమైన మతాతత్వం, గ్రూపులు కట్టే పద్ధతి ఎక్కడ కనపడినా దానిని పార్టీ ఎదిరించి, నిర్మాణ రీత్యా భద్రత చేకూర్చుతుంది.

ముసాయిదా కార్యక్రమంలో ఉద్దేశించిన చర్యలు — కార్యకర్తలను కొత్తవారిని ప్రవేశపెడుతూ ఉండటం, వ్యక్తిపూజను నిరోధించడం, అంతరంగిక పార్టీ ప్రజాస్వామ్యాన్ని విస్తృత పరచడం నిజంగా విప్లవాత్మకమైన చర్యలు. ఇవి పార్టీ యొక్క సాధారణ పథకంతోను, కమ్యూనిజం కోసం జరిపే పోరాటంలో దాని ఎత్తుగడలు, వ్యూహంతోను గట్టిగా ముడివడి ఉన్నాయి.

ఈ చర్యలను ఆచరణలో పెట్టినప్పుడు, కమ్యూనిజం పట్ల శ్రద్ధాసక్తులు గల సమర్థులైన కార్యకర్తలను ఇంకా విశాల ప్రాతిపదికపై తయారు చేయడానికి; పార్టీ కార్యకలాపాలను, అన్ని ప్రజా సంస్థల, యావన్మంది ప్రజల కార్యకలాపాలను అభివృద్ధి పరచడానికి వీలవుతుంది. ఈ విధంగా ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధి, కమ్యూనిస్టు నిర్మాణం మరింత విజయవంతంగా సాగిపోతాయి.

క్రమేప్స్ విశాల ప్రాతిపదికపై కమ్యూనిస్టు నిర్మాణానికై కార్యక్రమాన్ని రూపొందించడమే మన పార్టీ యొక్క, కేంద్ర కమిటీ యొక్క అపారమైన సిద్ధాంత పరిజ్ఞానానికి ప్రబల తార్కాణం. కార్యక్రమాన్ని చేబట్టి, సోవియట్ కమ్యూనిస్టులమైన మనం కమ్యూనిస్టు భవిష్యత్తును గూర్చి స్పష్టమైన దృక్పథం కలిగించే ఉన్నత శిఖరాలను అధిరోహిస్తున్నట్లు భావిస్తున్నాం.

మనకు బలం కలిగించేది ఏది? అన్నిటికంటె ముఖ్యంగా మార్క్సి

జం-లెనినిజం సర్వదా అజేయమైన, సర్వకాలాలలోను పెంపొందుతున్న సిద్ధాంతం; ఇదే సందర్భంలో సోషలిస్టు, కమ్యూనిస్టు నిర్మాణక్రమం, కోట్లాదిగా గల ప్రజల నిత్య అనుభవం ద్వారా మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాన్ని పరిపుష్టం చేసే క్రమం. నూతన కార్యక్రమం అపూర్వమైన సిద్ధాంత రాజకీయ పత్రం: అందులో కమ్యూనిజాన్ని గూర్చి మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంత మూలసూత్రాలూ; సోషలిస్టు, కమ్యూనిస్టు నిర్మాణంలో యీ సూత్రాలను అమలు పరచడంలో పొందిన అనుభవాలనుండి క్రొత్త నిర్ణయాలూ సంగ్రహింపబడ్డాయి.

మనం ఎవరూ వెళ్ళని త్రోవను వెళుతున్నాం. కమ్యూనిస్టు నిర్మాణ దశలో ఉత్పన్నమయ్యే అనేక సమస్యలకు మనం నిశ్చితమైన సిద్ధాంత సూత్రీకరణలను రూపొందించి, నిర్వచించవలసి ఉంటుంది. సూర్యకాంతి లేకుండా జీవపదార్థం మామూలుగా ఎలా అభివృద్ధి చెందజాలదో, అదే విధంగా మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంత విజ్ఞాన ప్రకాశం లేకుండా కమ్యూనిస్టు నిర్మాణం నెరవేరజాలదు. మన మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాన్ని నిరంతరం అభివృద్ధిపరచుకోవడం మన పార్టీ కర్తవ్యం. ఈ నమ్మకమైన దిక్సూచి కమ్యూనిస్టు నూతన విజయాలకు మార్గదర్శక మవుతుంది.

* * *

కామ్రేడ్స్, ఇరవై రెండవ మహాసభ ప్రతినిధులైన మనం సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ నూతన కార్యక్రమాన్ని—అంటే కమ్యూనిస్టు నిర్మాణ కార్యక్రమాన్ని పరిశీలించి, ఆమోదించడం ఒక మహాభాగ్యం. ఈ కార్యక్రమం ఆచరణలోకి వచ్చినప్పుడు మానవజాతి చరిత్రలో అత్యుజ్జ్వల యుగం ప్రవేశిస్తుంది.

శతాబ్దాల తరబడి మానవ జాతి దోపిడీ లేని సమాజాన్ని గూర్చి; సామాజిక, జాతీయ పీడన లేని సమాజాన్ని గూర్చి; ప్రజలకు పైశాచిక యుద్ధ భయం లేని సమాజాన్ని గూర్చి కలలు గన్నది. ప్రజాక్షేమం కోసం

జరిగిన పోరాటంలో ఎంతోమంది వీరోచితంగా మరణించారు. అయితే సౌఖ్యాన్ని గూర్చి ప్రజలు గన్న కలలు కలలుగానే మిగిలిపోయాయి; దుఃఖమూ, దుఃఖాశ్రువులూ వారి పాలికి వచ్చాయి. మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతం యొక్క గొప్పదనం ఏమంటే, అది శ్రమజీవుల వాంఛలను నెరవేర్చడానికీ వాస్తవయుతమైన మార్గం చూపెట్టింది. కమ్యూనిజం యొక్క ప్రథమ దశను, అంటే సోషలిజాన్ని ఆచరణలో పెట్టే మహద్భాగ్యం, సోవియట్ ప్రజలను కమ్యూనిజం యొక్క ఉన్నత దశకు తీసుకువెళ్ళే మహద్భాగ్యం మన పార్టీకి దక్కింది.

ప్రపంచంలో స్వాతంత్ర్య జ్యోతిని, సోషలిస్టు, కమ్యూనిస్టు పతాకాన్ని చేబూని, మన పార్టీ ఇరవయ్యో శతాబ్దాన్ని మానవ భవిష్యత్తులో విప్లవాత్మకమైన సమూలమైన మార్పులు తెచ్చే శతాబ్దంగా వన్నెకెక్కించింది. అన్ని దేశాలలోనూ గల కమ్యూనిస్టు మహా వాహిని ప్రజల అండతో జరిపిన వీరోచిత పోరాటం చరిత్ర గతిని త్వరితం చేసింది; మానవ జాతి యొక్క అత్యుత్తమ ఆశయాలు నెరవేరే రోజు దగ్గర పడేట్లు చేసింది. అయితే సోవియట్ యూనియన్‌లో కమ్యూనిస్టు సమాజం నిర్మింపబడినప్పుడు చరిత్ర ఇంకెంత వడిగా ముందుకు వెళ్ళగలదో!

కమ్యూనిస్టు ఆశయాలు పెద్ద ఎత్తున పురోగమిస్తున్నాయి. కమ్యూనిజం పతాకాన్ని ధరించిన మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలు తాము విప్లవకారుల పార్టీల మని, నవ్యతను ప్రవేశపెట్టిన వారమనీ, ప్రజా సౌఖ్య ప్రదాతలమని రుజువుపరచుకొన్నాయి. అన్ని దేశాలలోని అభివృద్ధి కాముకులూ కమ్యూనిజంతో అత్యంత సుందరమైన, ఉజ్వలమైన వాటన్నిటినీ జోడిస్తున్నారు. కమ్యూనిస్టు శక్తులు అక్షయమైనవి. జీవిత సత్యం, చరిత్ర సత్యం కమ్యూనిజం పక్షానే ఉంది.

కమ్యూనిజం విజయం లెనినిస్టు పార్టీ ఎల్లప్పుడూ ఉద్దేశించిన అంతిమ లక్ష్యం. ఈ కమ్యూనిజం కల ఇప్పుడు నిజమవుతున్నది. కామ్రేడ్స్, మన

వారసులు మాత్రమే కాకుండా, మనమూ, మన తరంలోని సోవియట్ ప్రజలు కూడ కమ్యూనిస్టు సమాజంలో జీవించగలరు! ఇది తెలుసుకొని ప్రతి సోవియట్ పౌరుడూ ఉప్పొంగి పోతాడు; ఇంకా జీవించాలని, అపూర్వ ఉత్సాహంతో పనిచేయాలని ఉబలాట పడతాడు.

కమ్యూనిజం నిర్మాతలలో తాను ఏస్థానం ఆక్రమించవలసిందీ, కమ్యూనిజం యొక్క శ్రేయస్సు కోసం తాను ఏ విధంగా పనిచేయవలసిందీ, అధ్యయనం చేయవలసిందీ, కమ్యూనిస్టు సమాజంలో జీవించడానికి తాను ఏ విధంగా తయారుకావలసిందీ కార్యక్రమం ప్రతి ఒక్కరికి తెలియజేస్తుంది. అందుచేత, కామ్రేడ్స్, మన దేశంపై కమ్యూనిజం సూర్యుడు ప్రకాశించే రోజు దగ్గర పడేట్లు చేయడానికి మన శక్తి సామర్థ్యాలన్నిటినీ ఉపయోగిద్దాం!

సోషలిజం విజయం కోసం జరిపిన పోరాటంలో లెనిన్ పతాకం మనలను ఉత్తేజపరచింది. మన విజయం పొందాం!

మన దేశాభివృద్ధి నూతన చారిత్రక దశలో, కమ్యూనిస్టు నిర్మాణ దశలో లెనిన్ పతాకమే మనలను ఉత్తేజపరుస్తున్నది!

మార్క్సిజం-లెనినిజం పతాకం క్రింద, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం క్రింద, కమ్యూనిజం విజయం కోసం సాగిపోదాం!





## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA130B128 |
| పుస్తకం పేరు | సోవియట్ దేశ కమ్యూనిస్టుపార్టీకార్యక్రమంగురించి |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 204 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | i, 17B, 1 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Kasimbi |
| పేజీలు విడదీసినది | Kasimbi |
| స్కాన్ చేసినది | Susmitha |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |